వారెవ్వా!

## ఖాళీ సమయంలో కళాఖండాలు!

హంగరీ కళాకారుడు సెర్క్యాహైగైజో పెన్సిల్ ములుకుతో ఓహో అనిపించే అత్యంత సూక్ష్మ కళాఖండాలను చెక్కాడు. పగలంతా ఉద్యోగం చేస్తూనే, సాయంత్రం ఇంటికొచ్చాక తనకున్న ఖాళీ సమయంలో వివిధ రకాల పరికరాలను సృష్టించాడాయన.

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు...
మీ అభిమాన విపుల / చతురకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా - పోస్టుకార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదేసైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.**
**ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.**

★ ఫొటోలు పంపేవారు విధిగా తమ ఫోన్‌నెంబర్లుసహా తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.
★ మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ని పంపుతాం.
★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com







# మనసున ఉన్నదీ...



★ ఆగస్టు 'చతుర' నవల 'శాంతిహోమం' లో ఫ్యాక్షనిస్టుల పగ, ప్రతీకారాల నేపథ్యంలో వారి కుటుంబ జీవితంలోని అభద్రతను చక్కగా చిత్రించారు రచయిత్రి పుష్పాంజలి. పగవాడిని అంతం చేయడమే ధ్యేయంగా పెట్టుకునేవాళ్లు సమాజంలో కొన్ని ప్రాంతాలలో ఇంకా ఉన్నారనడంలో ఆశ్చర్యం లేదు. తరతరాల పగని వారసత్వంగా కొనసాగిస్తూ భర్తని చంపిన వీరమ్మలాంటి వ్యక్తులను తలచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది.

– కల్పనాకిరణ్,
కందుకూరు, ప్రకాశం జిల్లా

★ కృష్ణాష్టమి సందర్భంగా వంశీమోహనుడి ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' ఆనందాన్ని కలిగించింది. 'శాంతిహోమం' నవల విభిన్నంగా ఉండి ఎంతగానో ఆకట్టుకుంది. చతురోక్తులు శీర్షిక ద్వారా ప్రతినెలా అందిస్తున్న విషయాలు బాగుంటున్నాయి. జేమ్స్ జాయిస్ నవల యూలిసీస్ పరిచయం చాలా బాగుంది.

– సంజీవిగారి నాగశ్వేత, బెంగళూరు

★ ఆగస్టు నవల 'శాంతిహోమం' ఉత్కంఠభరితంగా సాగింది. రచయిత్రికి అభినందనలు. కొత్తగాలి కవితలు, డా. జాన్సన్ చతురోక్తులు చాలా బాగున్నాయి. అతితక్కువ ధరకే 'చతుర' ద్వారా అమూల్యమైన సాహిత్యాన్ని అందిస్తున్న యాజమాన్యానికి, సిబ్బందికి అభినందనలు.

– గుర్రం శారదాశ్రీనివాస్, చెరుకుపల్లి

★ రాధామాధవుల ముఖచిత్రంగా వచ్చిన ఆగస్టు 'చతుర' మమ్మల్ని అలరించింది. చతుర ప్ర.జ. ద్వారా చాలా విషయాలు తెలుసుకుంటున్నాం. మలయాళీ కథ 'హనీమూన్' ఆకట్టుకుంది.

– ఎమ్.వి. సత్యసంపత్, నర్సీపట్నం

★ ఆగస్టు 'చతుర' ముఖచిత్రం ఆకట్టుకుంది. ఎ. పుష్పాంజలి నవల 'శాంతిహోమం' పగ, ప్రతీకారాలతో చెలరేగేవారికి కనువిప్పు కలిగించేలా ఉంది. చతురకతలు చాలా బాగున్నాయి.

– బి. సాయివివేక్,
చింతపల్లి, విశాఖ

★ గోపీకృష్ణ ముఖచిత్రంతో వచ్చిన 'చతుర' చాలా బాగుంది. నవల 'శాంతిహోమం' పగలు, ప్రతీకారాల నిర్హేతుకతను తెలియజేస్తూ శాంతి కుసుమాలు పూయించే దిశగా ఆలోచింపజేసింది. 'అక్షరధార'లో శ్లోకాలు నేటి మానవజీవనానికి ఉపయోగపడేలా ఉన్నాయి. 'తిక్క కుదిరింది' చతురకత నవ్వించింది.

– మహమ్మద్ రఫీ, శ్రీకాకుళం

★ ఆగస్టు 'చతుర'లో వచ్చిన జి. వివేకానందన్ పెద్దకథ 'హనీమూన్' ముంబయి నగరానికి పొట్ట చేత పట్టుకుని వెళ్లినవారి దుస్థితిని కరుణార్ద్రంగా చిత్రీకరించింది. కథ ఏకబిగిన చదివించింది. సామాన్య మానవ జీవితచిత్రాన్ని యథాతథంగా చిత్రీకరించడంలో రచయిత సఫలీకృతమయ్యారు.

– స్వప్న రాగలీన,
హైదరాబాద్

★ రాధామాధవులు ముఖచిత్రంగా వచ్చిన ఆగస్టు 'చతుర' కనులకింపుగా ఉంది. మలయాళ కథ 'హనీమూన్' ఒక ఆర్ట్‌ఫిల్మ్‌లా ఉంది. ఐదు దశాబ్దాల నాటి బాంబే నేపథ్యాన్ని అక్షరాల్లో పొదిగి చూపించారు. 'చతుర ప్రపంచం' విజ్ఞానదాయకం. జాన్సన్ చతురోక్తులు నవ్వించాయి.

– యు. చిట్టిబాబు, కొత్తపాల్వంచ

★ ఆగస్టు సంచికలో ప్రచురితమైన చతుర కతలు బాగున్నాయి. ఎ. పుష్పాంజలి నవల మమ్మల్ని అంతగా ఆకట్టుకోలేకపోయింది. 'శాంతిహోమం' శీర్షిక కూడా ఈ రచనకు తగినట్టు లేదనిపించింది.

– ఎం. శ్రీనివాస్, హైదరాబాద్

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 8
428వ సంచిక, పేజీలు : 132
సెప్టెంబరు 2013

# చతుర





'హేయ్! ఎవరు నువ్వు?' హఠాత్తుగా తన ఎదురుగా కనబడ్డ వ్యక్తిని ఆశ్చర్యంగా అడిగాడు ఆదిత్య.

'నా పేరు సహదేవుడు' అన్నాడు కొత్తవ్యక్తి.

'ఇక్కడికెలా వచ్చావు? కొత్తగా పనిలో చేరావా?' అడిగాడు ఆదిత్య.

'లేదు. నన్ను దేవుడు పంపాడు. ఒక్క అవకాశమిస్తే ఈ లోకాన్ని నువ్వు ఆయన కన్నా బాగా నడిపించగలనని అన్నావట. ఓ అవకాశమిచ్చి ఏం చేస్తావో చూసి రమ్మన్నాడు' అన్నాడు సహదేవుడు.

నిజంగా ఆదిత్య దగ్గరకు దేవుడే సహదేవుడ్ని పంపాడా? దేవుడు ఆదిత్యకు ఇచ్చిన అవకాశమేంటి? మరి ఆదిత్య ఈ లోకాన్ని దేవుడి కన్నా బాగా నడిపించాడా?

ఆద్యంతం ఉత్కంఠగా చదివించే **పుట్టగంటి గోపీకృష్ణ** నవల

**దేవుడితో పంతం!**

6వ పేజీలో...

బొమ్మలు : శ్రీ చంద్ర



'నా మరణాన్ని కొన్ని క్షణాలు
వాయిదా వెయ్యి దేవుడా! లేదంటే
అమాయకుల ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి.
దయచేసి నాకు కాస్త ఆరోగ్యాన్నివ్వు' అని
ఆక్రోశించాడు వయోవృద్ధుడు ప్రకాష్ సింగ్ .
ఆస్పత్రిలో మృత్యువుతో పోరాడుతున్న ఆయన
తన వద్దకు ఎవరైనా వస్తే బాగుండునని
చూస్తున్నాడు. ఐసీయూ తలుపు దగ్గర నర్సుతో
మాట్లాడుతున్న తన డ్రైవరు కనబడ్డాడాయనకు.

ఆ తర్వాతేం జరిగింది? ప్రకాష్ సింగ్
మృత్యువును తప్పించుకుని
అమాయకుల ప్రాణాలను కాపాడగలిగాడా?
ఆద్యంతం ఉత్కంఠగా చదివించే

పుట్టగంటి గోపీకృష్ణ

**దేవుడితో పంతం!**

ఈ నెల చతుర కానుక!

పుట్టగంటి గోపీకృష్ణ

# దేవుడితో పంతం!



జీవం అనేక రూపాల్లో ఉంటుంది.

గాలిలో ఎగిరే పక్షులూ... నీటిలో ఈదే చేపలూ... నేల మీద నడిచే జంతువులూ.. కీటకాలు, పురుగులు, పాములు, మొక్కలు, చెట్లు, లతలు, అంతేనా?

అన్నిటినీ మించి మనిషి.. అన్ని జీవులూ ఒకదానిపై మరొకటి ఆధారపడ్డవే. పులికి మేక కావాలి. పిట్టకి పురుగు కావాలి. పాముకి ఎలుక కావాలి. పక్షికి పాము కావాలి. మరి మనిషికి అన్నీ కావాలి.

సృష్టిలో ఏ జీవీ వృథా కాదు. అన్నీ అవసరమే! ఒకదాని మీద మరొకటి ఆధారపడ్డవే! అదే జీవ వైవిధ్యం.

అలాగే... జీవనం కూడా అనేక రూపాల్లో ఉంటుంది.

సంపాదించి తెచ్చే పురుషులు.

ముక్కు మూసుకుని జపించే రుషులు.

హలాన్ని భుజాన వేసుకునే హాలికులు.

ఉదయాన్నే గొంతు సవరించుకునే వైతాళికులు.

ఇంటిని చక్కదిద్దే ఇంతులు.

పురుషులతో పోటీ పడే పడతులు.

తాతలు, తండ్రులు, అన్నలు, బావలు, అమ్మలు, అత్తలు, అక్కలు, పిల్లలు, కూరగాయలమ్మే కాశీపతీ, పాలు తెచ్చి పోసే పకీరయ్యా, ఇంట్లో పనిచేసే రత్తాలు, వీధులు ఊడ్చే రజియా, లారీ డ్రైవరు, విమానం పైలెట్, బిళ్ళ బంట్రోతు, బడా వ్యాపారి.. అందరూ అవసరమే! అందరూ కలిస్తేనే జీవన స్రవంతి. ఒకరు ఎక్కువా కాదు, మరొకరు తక్కువా కాదు. అదే జీవన వైవిధ్యం.

★ ★ ★

సైరన్ మోగించుకుంటూ వచ్చి, విశాలమయిన భవనం ముందు కారు ఆగింది. అందులో నుండి దిగిన కేంద్ర మంత్రి సిసోడియా ఒకసారి చుట్టూ పరిశీలించి చూశాడు.

రంగురంగుల విద్యుత్ కాంతుల మధ్య, దసరా సందర్భంగా అలంకరించిన మైసూర్ ప్యాలెస్‌లా మెరిసిపోతోంది ఆ భవనం.

దేశ రాజధాని ఢిల్లీలోని సంపన్నులు నివసించే పోష్ లొకాలిటీ అది. విశాలంగా విస్తరించిన గార్డెన్ మధ్య ఉంది ఆ అందమయిన భవనం. దానికి ఆనుకుని ఉన్న ఈత కొలను చుట్టూ రౌండ్ టేబుల్స్ వేసి ఉన్నాయి. అప్పటికే సగం పైగా కుర్చీలు అతిథులతో నిండిపోయి కళకళలాడుతున్నాయి.

ఈ సంరంభానికంతా కారకుడు ప్రకాష్ సింగ్. ఈ రోజు ఆయన తొంభయ్యో పుట్టినరోజు. ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన పార్టీ అది. ముందు సిసోడియా ఆ పార్టీకి రావాలని అనుకోలేదు. ప్రధాన మంత్రి స్వయంగా పిలిచి, తనకు పార్టీకి వెళ్ళటం వీలు కావటం లేదనీ, కాబట్టి తన తరపున వెళ్ళి రమ్మనీ చెప్పటంతో వచ్చాడు సిసోడియా.

పరిసరాలను గమనించటం ముగించి అతను వడివడిగా ముందుకు కదిలాడు.

ప్రకాష్ సింగ్ కొడుకు స్వదేష్ సింగ్ అతిథులను ఆహ్వానించే కార్యక్రమంలో హడావుడిగా ఉన్నాడు. అతను గబగబా ముందుకు వచ్చి సిసోడియాని సాదరంగా ఆహ్వానించి అతన్ని ఒక వ్యక్తికి అప్పచెప్పి లోపలకు పంపాడు.

చాలా తక్కువమంది అతిథులను మాత్రమే ఆ ఫంక్షన్‌కు పిలిచారు. దాదాపు అతిథికి ఒకవ్యక్తి చొప్పున ఏర్పాటు చేసిన మనుషులు వచ్చినవారి అవసరాలు చూడటానికి హడావుడి పడుతున్నారు.

కొడుకులు, కూతుళ్ళు, కోడళ్ళు, అల్లుళ్ళు, మనవలు, మునిమనవలతో ప్రకాష్ సింగ్

కుటుంబం చాలా పెద్దదిగా ఉంది- ఆయన నివసిస్తున్న భవనంలానే.

పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ పేరుతో ప్రకాష్ సింగ్ స్థాపించిన కంపెనీ దేశంలోనే అతి పెద్ద నిర్మాణ రంగ సంస్థ.

ఇప్పుడు పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్‌తో పోటీపడే కంపెనీలు దేశంలో మరికొన్ని కూడా ఉండవచ్చు. కానీ ప్రకాష్ సింగ్ ఈ కంపెనీ స్థాపించిన తొలి రోజుల్లో అనేక కష్టనష్టాలను ఎదుర్కొన్నాడు. ఎన్ని అడ్డంకులు ఎదురయినా దేశ నిర్మాణంలో పాలు పంచుకోవాలన్న తపనతో తన కంపెనీని నడిపాడు. అందుకే ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం.

దేశంలో ఏ మూల ఏ పెద్ద ప్రాజెక్ట్ కడుతున్నా దానిలో పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ పాత్ర ఉంటుంది. హైడల్ పవర్ ప్రాజెక్టు దగ్గర నుండి మెట్రో రైలు ప్రాజెక్టుల వరకు, ఎక్స్‌ప్రెస్ హైవేల దగ్గర నుండి యూనివర్సిటీ భవనాల వరకూ ఆ కంపెనీ చేపట్టని ప్రాజెక్ట్ లేదు. ప్రకాష్ సింగ్ అప్పుడప్పుడూ గర్వంగా చెప్తుంటాడు- 'ఈ దేశ నిర్మాణంలో పాలు పంచుకున్నాం.. అని చెప్పుకునే అవకాశం కేవలం మా కంపెనీకి ఒక్కదానికే ఉంది!' అని.

సింహాసనం మీద కూర్చున్న రారాజులా ప్రకాష్ సింగ్ విడిగా ఒక కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

వస్తున్న అతిథులు ఒకరొకరుగా ఆయన్ని పలుకరించి కాసేపు మాట్లాడి వెళ్తున్నారు. వయసు ప్రభావంతో శరీరమంతా క్షీణించగా, ముడుతలు పడిన చర్మంతో, వేసుకున్న కోటులో ఒదిగిపోయి, పిట్టలాంటి ఆకారంతో కూర్చుని ఉన్నాడు ప్రకాష్ సింగ్.

మిగిలిన శరీరమంతా వృద్ధాప్యాన్ని సూచిస్తుంటే ఆయన కళ్ళు మాత్రం మెదడులోని చురుకుదనాన్ని ప్రతిఫలిస్తు

న్నాయి.

సిసోడియా నెమ్మదిగా దారి చేసుకుని ఆయన దగ్గరకు చేరుకుని తన చేతిలోని పుష్పగుచ్ఛాన్ని ఆయనకు అందించాడు. దానిని అందుకుంటున్న ప్రకాష్ సింగ్‌తో, "హ్యాపీ బర్త్‌డే సర్!" అన్నాడు.

నవ్వుతూ కృతజ్ఞతలు చెప్పిన ప్రకాష్ సింగ్ తన పక్కన ఉన్న సోఫాలో సిసోడియాని కూర్చోపెట్టుకున్నాడు.

"ప్రధానమంత్రిగారు ముఖ్యమైన పనిలో ఉండటం వలన రాలేకపోయారు. నాకు మరీమరీ చెప్పారు- మీకు తమ శుభాకాంక్షలు చెప్పమని" అన్నాడు సిసోడియా.

"అలాగే నా కృతజ్ఞతలు కూడా వారికి తెలుపండి" నవ్వుతూ అన్నాడు ప్రకాష్ సింగ్.

ప్రకాష్ సింగ్ ఈ దేశంలో పుట్టిన గొప్ప మేధావుల్లో ఒకడు. ఎంత వృద్ధుడయినా ఆయన శరీరం బలహీనపడిందేమో కానీ, మేధస్సు మాత్రం ఇంకా చురుగ్గానే ఉంది.

"ఇంతకుముందు పుట్టినరోజుని ఓ పండుగలా చేసుకోవటానికి నేను ఇష్టపడేవాడిని కాదు. ఎందుకంటే 'పుట్టటంలో ఏం గొప్ప ఉందని సెలబ్రేట్ చేసుకోవాలి? ఏం సాధించామని వేడుకలు చేసుకోవాలి?' అనుకునేవాడిని. కానీ ఈసారి అలా అనిపించలేదు" స్వగతంలా లోగొంతుకతో అన్నాడు ప్రకాష్ సింగ్.

"అభ్యంతరం లేకపోతే అప్పటికీ ఇప్పటికీ తేడా ఏమిటో తెలుసుకోవచ్చా?" కుతూహలంగా అడిగాడు సిసోడియా.

"ఇప్పుడు తరువాతి పుట్టినరోజు వరకు బతకటమే ఒక గొప్ప విజయం అనిపిస్తోంది. అందుకే ఈసారి ఈ బిగ్‌బాష్‌కి నేను అభ్యంతరం చెప్పలేదు"

నవ్విన సిసోడియా "మీకొక రహస్యం చెప్పనా? మీ పేరు పద్మభూషణ్ అవార్డు కోసం రికమెండ్ చేశాం" అన్నాడు.

ఆ చెప్పటంలో అతని స్వరంలో కించిత్ గర్వం తొణికిసలాడింది.

ఆ విషయం గమనించనట్లు ప్రకాష్ సింగ్ మాత్రం తన స్వరంలో నమ్రతను వీడకుండా సమాధానమిచ్చాడు- "ధన్యుడ్ని! మీరు ఇచ్చేవారు.. నేను తీసుకునేవాడ్ని. ప్రభుత్వం ఏ గౌరవం ఇచ్చినా అది నా దేశం నాకు చేస్తున్న సత్కారం అనుకుంటాను. అయినా ఇంతకుముందు ఇచ్చిన పద్మశ్రీ అవార్డే నా తాహతుకు ఎక్కువని నా అభిప్రాయం"

తన తప్పును సరిదిద్దుకుంటూ "అయ్యో! అదేం మాటండి! మీకెన్ని అవార్డులు ఇచ్చినా దేశానికి మీరు చేసిన సేవకు అవి సరితూగలేవు" అన్నాడు సిసోడియా.

మరికాసేపు సంభాషణ నడిచిన తరువాత సిసోడియాకి ఆయన్ని ఒక విషయం అడగాలని అనిపించింది. దాంతో "నేనొక విషయం అడుగుతాను. ఏమీ అనుకోరుగా?" అన్నాడు.

"అడగండి.." చిరునవ్వుతో అన్నాడు ప్రకాష్ సింగ్.

"ఇంత సుదీర్ఘ జీవితంలో మీకు అసంతృప్తులు ఏమైనా ఉన్నాయా?" అడిగాడు సిసోడియా. అడిగిన తరువాత అతనికి అనిపించింది 'అనవసరంగా ఎక్కువ చనువు తీసుకుంటున్నానా?' అని. కానీ ఆయన మొహం మీద చిరునవ్వు చెరగకపోవటం చూసి ధైర్యం వచ్చింది.

"నాకు తృప్తి దొరికిందెక్కడ? జీవితమంతా అసంతృప్తిగానే గడిచిపోయింది. ఇంత సాధించాను.. అని అనుకోబుద్ధి కాదు. ఇంకా సాధించవలసింది ఎంతో ఉందనిపిస్తోంది"

"ఇంత ఎదిగిన మీకే తృప్తి లేదంటే..."

"నా దృష్టిలో తృప్తి అనేమాట మరణానికి పర్యాయపదం. మనిషి బతికి ఉన్నం

# ఫ్రాన్స్‌లో ఆఖరి మరణశిక్ష

మరణశిక్షను అమెరికాలో ఎలక్ట్రిక్ ఛెయిర్‌తో అమలు చేయగా, కొన్ని దేశాల్లో తుపాకులతో కాల్చి, సౌదీ అరేబియాలో మెడ దగ్గర కోసి, మరికొన్ని దేశాల్లో విషపు ఇంజక్షన్లు ఇచ్చి అమలు చేస్తారు. ఫ్రాన్స్‌లో మాత్రం గిల్లెటిన్ యంత్రం ద్వారా తలను మెడనుంచి వేరు చేసి చంపేవారు. ఆ యంత్రానికి ఓ వైపు కింద బరువులు, మరోవైపు ఓ చట్రంలో పైన పెద్ద సూదిపలక ఉంటుంది. నేరగాడి తలను ఆ చట్రంలోని కిందభాగంలో ఉంచి, మరో వైపు బరువును తొలగించడంతో ఆ ఇనపపలక కిందకు వేగంగా దిగి శిరస్సును కత్తిరిస్తుంది. ఇప్పుడున్న మోడల్‌ను 1792లో రూపొందించినప్పటికీ ఈ యంత్రాన్ని అంతకు ముందునుంచే వాడుతున్నారు. ఫ్రెంచ్ విప్లవంలో గిల్లెటిన్‌తో వేలమందిని చంపారు. బెల్జియంలో కూడా కొంతకాలం గిల్లెటిన్‌ను ఉపయోగించారు. ఆఖరుగా ఫ్రాన్స్‌లో 1977లో దీన్ని ఉపయోగించారు.



టునీషియా నుంచి వచ్చిన వలసదారుడు హమీదా జాన్ డొబి, తన ప్రియురాలు ఎలిజబెత్‌ను హత్య చేసినందుకు అతడిని గిల్లెటిన్‌తో చంపారు. ఆమెనతడు బలవంతంగా వ్యభిచార వృత్తిలోకి దింపాడు. నెల తర్వాత ఆమె పారిపోతే, పట్టుకుని వచ్చి అత్యాచారం జరిపి, ఆమె వక్షోజాలు, జననాంగాలను కాల్చి, గొంతు పిసికి చంపాడు. ఇది జరిగిన ఓ నెల తర్వాత హమీద్ తనమాట వినని మరో అమ్మాయిని కిడ్నాప్ చేస్తుండగా ఆమె తప్పించుకుంది. ఎలిజబెత్‌ను అతను చంపాడని కోర్టులో చెప్పింది. సెప్టెంబర్ 10, 1977న అతన్ని గిల్లెటిన్‌తో చంపారు. ఈ మరణశిక్షను అనేకమంది ప్రజలు వచ్చి చూసారు. ఆ తర్వాత 1981లో ఫ్రాన్స్ మరణశిక్షను రద్దు చేయడంతో ఆ యంత్రానికి పని లేకుండా పోయింది. 1791లో ఉపయోగించిన గిల్లెటిన్ యంత్రాలను పారిస్‌లో ప్రదర్శనకు ఉంచారు.

# కోతులకు ఉగ్రవాద శిక్షణ

ఆఫ్ఘనిస్థాన్‌లో అనాదిగా కోతులకు శిక్షణనిచ్చి పనులు చేయించుకుంటున్నారు. చెట్లమీది పళ్లను కోయడం ప్రధానంగా కోతులు చేసే పని. పొలంలోని పంపులను తిప్పడం, లైట్ల స్విచ్‌లు ఆన్ చేయడం లాంటివి ఇంటికోతులు చేస్తుంటాయి. కొంత రుసుముకి కోతులకు పనుల్లో శిక్షణనిచ్చేవారు ఆ దేశంలో ఉన్నారు. ఆఫ్ఘనిస్థాన్‌ని పాలించే తాలిబన్ల మీద అమెరికా యుద్ధం చేసి, పదవీచ్యుతులను చేసారు. దాంతో వారు అమెరికన్ సైనికులను చంపేందుకుగాను ఏకంగా ఓ కోతుల శిక్షణా కేంద్రాన్ని నెలకొల్పారు. వాటికి టెర్రరిస్ట్ దాడులలో శిక్షణ ఇస్తున్నారని చైనా గూఢచార సంస్థ కనుక్కొంది. 2010లో కోతుల సైన్యాన్ని తాలిబన్లు సృష్టించారన్న సంగతిని మొదటిసారిగా చైనీస్ అధికార దినపత్రిక 'పీపుల్స్ డైలీ' వెల్లడించింది. దీనికోసం బబూన్స్, మకావ్ జాతి కోతులను ఎంపిక చేసుకుంటారు. అమెరికన్ మిలిటరీ యూనిఫారాలు ధరించిన వారిమీదకి అవి చేతి బాంబులను విసురుతాయి. అలా విసిరినప్పుడు వాటికి బహుమతినిచ్చి, విసరకపోతే శిక్షించే పద్ధతిలో ఈ శిక్షణనిస్తున్నారు. అంతేకాక మెషీన్‌గన్‌ను ఉపయోగించే శిక్షణనూ కోతులకు ఇస్తున్నారు. అడవుల్లో యుద్ధం జరిగేటప్పుడు వారు 'ముజాహిదీన్ కోతుల'ను ఆయుధాలతో వదులుతారు. అమెరికన్ యూనిఫాం ధరించినవారిపై అవి దాడి చేస్తాయి. మనుషులకన్నా నేడు అమెరికన్ సైన్యం గెరిల్లా కోతులకే భయపడుతోంది.





తకాలం తృప్తి పడకూడదు. తృప్తిపడిన మనిషి ఏమీ సాధించలేడు"

"మీ గురించిన వివరాలు పత్రికల్లో ఎప్పుడూ వస్తుంటాయి. ఒక వ్యక్తి జీవితంలో ఎన్ని సాధించాలో అంతకంటే చాలా ఎక్కువే సాధించారు. మీరు ఆ దేవుడికి ముద్దుబిడ్డ అనిపిస్తుంది. అయినా మీరు ఏ గుడికీ వెళ్ళినట్లు నేను చూడలేదు. మీరు దేవుడ్ని నమ్మరా? "

ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయాడు ప్రకాష్ సింగ్. తరువాత నెమ్మదిగా చెప్పాడు- "నమ్ముతాను. మా ఇంట్లో అందరూ అన్ని పూజలూ చేస్తారు. నేను మాత్రం దేవుడ్ని కేవలం పూజించటానికి పనికివచ్చే ఒక విగ్రహంగా చూడను. నా

కొత్తగాలి...

**పట్టణం**
**పల్లె వైపు చూస్తోంది**
**నేలతల్లి పురిటివాసన**
**గుర్తొచ్చిందేమో...!**

– డా. మౌని,
తిరుపతి

నడకను నిర్వచించే మార్గదర్శిగా చూస్తాను. ఆయన్ని పూజించటం కంటే ఆయన చూపిన బాటలో నడవటానికి ప్రయత్నిస్తాను. అందుకే నాకు పనిలో దేవుడు కనిపిస్తాడు. ప్రత్యేకంగా పూజ చేయవలసిన అవసరం కనిపించదు. దేవుడు మన నుండి పూజలు కోరుకోడు. పూజలు చేయవలసిన అవసరం తన బిడ్డలకు రాకూడదనే కోరుకుంటాడు. అందుకే నేనెప్పుడూ ఆయన్ని ఏమీ అడగలేదు. ఇంతవరకు అంత అవసరం రాలేదు. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో ఎవరికి తెలుసు? "

"ఒకవేళ ఇప్పటికిప్పుడు ఆ దేవుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే ఏమి కోరుకుంటారు? "

ఈసారి చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు ఆయన. అలాంటి ఆలోచన చేయవలసిన అవసరం అంతవరకు రాలేదు కాబోలు.. సమాధానం చెప్పటానికి కష్టపడవలసి వచ్చింది.

"అందరూ నన్ను ఈ దేశానికి చాలా చేశానంటారు. కానీ చేయవలసిన అసలు పనులు ఇప్పుడే మొదలవుతున్నాయి. నా ఓపిక అయిపోయింది. అయినా దేశసేవ అన్నది ఏ ఒక్కరో చేస్తే సరిపోదు. అందరూ తమ బాధ్యత అనుకుని చేయాలి. అందుకే నేను లేకపోయినా నా ఆశయాలకు అనుగుణంగా నడిచేటట్లు నా కంపెనీని తయారు చేశాను. ఇప్పటికే ఓపిక లేక కంపెనీ వ్యవహారాలను నేను పట్టించుకోవటం మానేశాను. నేనున్నా, లేకున్నా నా కంపెనీ విలువలను పాటిస్తూ కలకాలం దేశానికి సేవ చేయాలన్నది నా కోరిక. ఇక నా వ్యక్తిగత జీవితానికి వస్తే పెద్దగా కోరికలేం లేవు. గౌరవంగా జీవించాను. అంతే గౌరవంగా మరణించాలనుకుంటున్నాను. నాకు కలకాలం బతకాలని లేదు. కానీ, బాధపడకుండా చావాలని ఉంది. ప్రశాంతంగా, బాధ లేకుండా చనిపోయే అదృష్టం కలగాలని కోరుకుంటున్నాను"

"మీ పుట్టినరోజున ఇలాంటి మాటలు ఎందుకులెండి? నేనేదో కుతూహలం కొద్దీ అడిగాను. ఇక వెళ్ళొస్తాను" అంటూ లేచాడు సిసోడియా.

తరువాత భోజనం ముగించి బయటకు వచ్చాడు సిసోడియా. గేటు దగ్గర గుమికూడిన విలేకరులను చూసి మనసులో నవ్వుకున్నాడు. 'ప్రకాష్ సింగ్ ఎంత

ప్రముఖ వ్యక్తి అయినా రేపు దినపత్రికల్లో ఈ వార్త మొదటి పేజీలో రాదు. అదే నేను ఒక పిచ్చి స్టేట్‌మెంట్ ఇస్తే అది మొదటి పేజీలో వస్తుంది. దటీజ్ ఇండియా' అనుకున్నాడు అతను.

ఆ తరువాత కూడా చాలాసేపు పార్టీ కొనసాగుతూనే ఉంది.

అయితే సిసోడియా ఊహల్ని చిత్తు చేస్తూ మరుసటి రోజు ఉదయం దినపత్రికల్లో మొదటి పేజీ వార్త ప్రకాష్ సింగ్ గురించే వచ్చింది. ఆయన అనారోగ్యంతో హాస్పిటల్లో చేరాడన్న వార్త బిజినెస్ వర్గాల్లో కలకలం రేపింది.

★ ★ ★

ప్రైవేట్ జెట్ ఆకాశంలో ఎత్తుగా ఎగురుతోంది. దాని గమ్యస్థానం భారతదేశం. అది తన గమ్యం చేరటానికి ఇంకా గంటన్నర సమయం పడుతుంది. అందులో ప్రత్యేకంగా ఉన్న ఒక చిన్న గదిలో విశ్రాంతిగా పడుకుని ఉన్నాడు మల్హోత్రా. అతనికి యాభై ఏళ్లు ఉంటాయి. అయినా అలా కనపడడు. క్రమం తప్పకుండా వ్యాయామం చేసే అలవాటు ఉండటం వల్ల శరీరం దృఢంగా ఉంది.

అతను ఇంతవరకూ పెళ్ళి చేసుకోలేదు. దీనికి కారణం ఎంతమంది అడిగినా నవ్వుతాడు తప్ప ఏమీ చెప్పడు.

అతనికి ఏదీ త్వరగా నచ్చదు. ఏదీ త్వరగా తృప్తి ఇవ్వదు. ఒకసారి అనుకున్నది సాధించాక మళ్ళీ దాని గురించి పట్టించుకోడు. ఎప్పుడూ ఇంకా ఏదో కావాలన్న అసంతృప్తి అతన్ని వేధిస్తూ ఉంటుంది. తను ఒక స్త్రీతో సరిపెట్టుకోలేనని అతనికి యుక్తవయసులోనే తెలిసింది. అందుకే పెళ్ళి అనే పొరపాటు చెయ్యలేదు.

అతను పుట్టటమే డబ్బులో పుట్టాడు. డబ్బుతో పెరిగాడు. కాలక్రమంలో ఆ డబ్బుని అనేక రెట్లు పెంచాడు. ఇంకా సంపాదిస్తున్నాడు.

అనేక వ్యాపారాల అనంతరం ప్రస్తుతం 'స్కైలైన్' అనే విమానయాన సంస్థని స్థాపించాడు. ఆ విమానయాన సంస్థ ఛైర్మన్ హోదాలోనే అతను విదేశాలు వెళ్ళి వస్తున్నాడు. ఇప్పుడతను ప్రయాణిస్తున్న విమానం అతని సంస్థకు చెందినదే!

దేశంలోని మిగిలిన ఎయిర్‌లైన్ సంస్థలేవీ ఇవ్వనన్ని సౌకర్యాలు కల్పిస్తూ అనతి కాలంలోనే నెంబర్ వన్ స్థానానికి ఎదిగింది ఆ సంస్థ.

బయటకు అంతా బానే ఉన్నట్లు కనపడుతున్నా ప్రస్తుతం ఆ సంస్థ ఆర్థిక పరిస్థితి అంత పటిష్టంగా లేదు. ఇక్కడి బ్యాంకులు ఇకపై అప్పులివ్వటానికి అంగీకరించటం లేదు. అందుకే అతను విదేశాలు వెళ్ళాడు.

విదేశాల్లోని ఇన్వెస్టర్లను ఆకర్షించి పెట్టుబడులు సాధించటం కోసం ప్రయత్నించి వస్తున్నాడు.

అయితే అతని ప్రయత్నాలేవీ ఫలించటం లేదు. అతనికి సహాయం చెయ్యడానికి ఎవరూ ముందుకురావటం లేదు.

విషయం అత్యంత రహస్యంగా ఉంచటం వలన ఇంకా అందరికీ అతని ఆర్థిక ఇబ్బందుల సంగతి తెలియదు.

దేశంలో అందరికీ అతన్ని తలచుకోగానే కేర్‌ఫ్రీగా జీవితాన్ని ఎంజాయ్ చేసే విజయవంతమైన వ్యాపారవేత్త గుర్తుకు వస్తాడు.

అతని అసలు పరిస్థితి తెలిసిన అతి కొద్దిమందిలో అతని సెక్రటరీ ఒకరు. ఆమె అతని దగ్గర గత ఆరు నెలలుగా పనిచేస్తోంది. ఈ ఆరు నెలల కాలం ఆమెకు ఒక కలలా గడిచిపోయింది.

అతని దృష్టిలో అది చాలా ఎక్కువ సమయం. ఇక ఆమెకు 'బై! బై!!' చెప్పవల

సిన సమయం వచ్చేసిందని అతనికి అర్థమవుతోంది. అయితే గౌరవప్రదంగా ఆమెను పక్కకి తప్పించే అవకాశం కోసం అతను ఎదురు చూస్తున్నాడు.

అతను ఆలోచనల్లో ఉండగానే ఫ్రిజ్‌లో నుండి విస్కీ సీసా తీసి, ఒక పెగ్ ఫిక్స్ చేసి అతని ముందు ఉంచిందామె. అది 1936లో స్వీడన్‌లో తయారయిన విస్కీ. ఒక విదేశీ వ్యాపారవేత్త బహుమతిగా ఇచ్చాడు. దాని విలువ లక్షల్లో ఉంటుంది.

అదనే కాదు- అతను వాడే సిగార్‌ను హవాయ్ నుండి తెప్పిస్తాడు. అతను వేసుకునే కోటు లండన్‌లో కుట్టిస్తాడు. షూస్ నుండి గాగుల్స్ వరకూ దేనిలోనూ సెకెండ్ రేటెడ్ వస్తువులు అతనికి పడవు. అన్నీ టాప్ క్లాస్‌వే కావాలి.

ప్రస్తుతం అతనున్న పరిస్థితుల్లో ఎవరున్నా... దిగులుతో, భయంతో బెంబేలెత్తిపోతారు. అతను మాత్రం ముందు ఎలా ఉన్నాడో ఇప్పుడూ అలానే ఉన్నాడు. అందుకే అతన్ని చూసిన సెక్రటరీకి ఆశ్చర్యం కలుగుతుంటుంది.

"సర్! మీకు భయమన్నది తెలియదా? " తనిచ్చిన విస్కీ సిప్ చేస్తున్న అతన్ని అడిగింది. ఇపుడిప్పుడే ఆమెకు అతనితో ఇలాంటి మాటలు మాట్లాడే చనువు ఏర్పడుతోంది. అది కూడా ఒక కారణం ఇక ఆమెని వదిలించుకోవలసిన సమయం వచ్చిందని అతను అనుకోవటానికి.

అందుకే అతను వెంటనే సమాధానం చెప్పలేదు.

పడుకున్నవాడు లేచి విమానం కిటికీ గుండా బయటికి చూశాడు.

విమానం ఎంతో ఎత్తుగా ఎగురుతోంది.

అమావాస్య రాత్రి కావటంతో ఆకాశం చిక్కటి నలుపును సంతరించుకుంది. నల్లటి ఆకాశపు నేపథ్యంలో నక్షత్రాలు స్వచ్ఛమైన వజ్రాల్లా మెరుస్తున్నాయి.

కింద అంతు తెలియని సముద్రం అనంతంగా పరచుకుని ఉంది. చీకట్లో సముద్రం కూడా నల్లగానే ఉంది. మధ్యలో ఎక్కడో చిన్న దీపపు చుక్క కనిపించింది. బహుశా ఏదో ఓడ అయి ఉంటుంది.

పైన ఆకాశం. కింద అర్ణవం. రెండూ ఎంతో గంభీరంగా, లోతులు అంతుబట్టనట్లు ఉన్నాయి. ఆ రెంటి మధ్యా మనిషి అల్పత్వం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

హఠాత్తుగా చిన్న కుదుపు. విమానం కిందకు జారి సర్దుకుంది.

ఉలిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకున్నాడతను. ప్రశ్న అడిగిన సెక్రటరీ అతని సమాధానం కోసం ఎదురుచూస్తోంది.

"ఆకాశంలో ఎగరాలనుకున్నవాడికి భయం వెయ్యకూడదు" అన్నాడతను.

"మనిషి ఎంత ఆకాశంలో ఎగిరినా ఎప్పుడో ఒకప్పుడు భూమి మీదకి దిగిరాక తప్పదు కదా!"

"ఆ విషయం నాకూ తెలుసు. నీ మనసులోని ప్రశ్న అది కాదని కూడా నాకు తెలుసు. నువ్వు అడగదలుచుకున్నది నేనెందుకంత ఆడంబరంగా జీవిస్తానని కదూ!"

"అబ్బెబ్బే..! అదేమీ కాదు సర్!!"

"నా గురించి మీరందరూ ఏమనుకుంటున్నారో నాకు తెలుసు. మీ దృష్టిలో నేను డబ్బు మదంతో కొవ్వెక్కి కొట్టుకుంటున్న వెధవని. అవునా? "

"నో సర్! ఐ స్వేర్!!"

"డోంట్ వర్రీ! నా దగ్గర నిజం మాట్లాడటానికి భయపడవలసిన అవసరం లేదు. ఇక విషయానికి వస్తే.. మీ అందరి మనసులోని ప్రశ్నా నాకు తెలుసు. నేనెందుకు అందరిలాగా ఉండనని కదూ! నా

విచ్చలవిడితనం చూసి మీకు అసహ్యం కలుగుతోంది కదూ!"

"నో! అదేమీ లేదు సర్!"

"నువ్వని కాదు, చాలామంది నన్ను చూసి అలా ఫీలవుతారు. ముందు మీ ఫీలింగ్ ఏమిటో తెలుసుకోండి? అది అసహ్యమా? ఈర్ష్యా? నీకొక నిజం చెప్పనా, బయటకు నన్ను విమర్శించే ప్రతి ఒక్కరూ అవకాశం వస్తే నాతో గడపటానికి అర్రులు చాస్తారు. నిజమా, కాదా? చెప్పు? "

"నిజమే సర్! బట్ అది మీ డబ్బుని చూసి..." తెగించి చెప్పేసింది ఆమె.

"నా దగ్గర ఉన్న డబ్బు నేను సంపాదించినది కాదు. వారసత్వంగా పెద్దలనుండి వచ్చింది. నేను సాధించటానికి వాళ్ళేమీ మిగల్చలేదు. అందుకే నేను కసిగా వాళ్ళు సంపాదించిన దానిని ఖర్చుపెడుతున్నాను. అయినా ఒకస్థాయి దాటిన తరువాత ఖర్చు పెట్టి డబ్బు అవగొట్టలేము. అది అంతకంతా సంపాదించి పెడుతుంది. ఇప్పుడు నాకు మొదటిసారి సమస్య వచ్చింది. దానితో పోరాడుతున్నాను. 'డబ్బంటే ఇష్టం లేనప్పుడు పోతే పోనివ్వవచ్చు కదా! పోరాడటమెందుకు?' అని మీరు అడగవచ్చు. అది నా కోసం కాదు. నా మీద ఆధారపడిన వందల కుటుంబాల కోసం. ఇప్పుడు నేను భయపడకూడదు. కనీసం భయపడినట్లు లోకానికి కనిపించకూడదు. భయపడే మనిషిని ఈ లోకం ఇంకా భయపెడుతుంది. సమస్యని అధిగమించే మార్గం వెతికే వాడికి భయం వెయ్యదు"

"మీలాంటి వారికి ఆ దేవుడు అన్యాయం చెయ్యడు సర్!" కాజువల్‌గా అని చటుక్కున నాలుక కరుచుకుంది ఆమె. అవును మరి. అతనికి దేవుడంటే నమ్మకం లేదు.

"నేను దేవుడ్ని నమ్మను..." ఆమె ఆలోచనల్ని నిజం చేస్తూ అన్నాడతను.

"మీరు నమ్మినా నమ్మకపోయినా ఆయన ఉన్నాడు సర్!" నమ్మకంగా చెప్పిందామె.

"నువ్వేమన్నా దేవుడి ఏజెంటువా? అంత కచ్చితంగా ఎలా చెప్పగలవ్? "

ఆమె నవ్వింది. మల్హోత్రా ఊరుకోలేదు. "నువ్వెప్పుడయినా దేవుడ్ని ఏదైనా కావాలని కోరుకున్నావా? "

"చాలాసార్లు"

"అవన్నీ జరిగాయా? "

"కొన్నిసార్లు జరిగాయి. కొన్నిసార్లు జరగలేదు"

"మరి దేవుడు ఉన్నట్లు ఎలా అనుకుంటున్నావ్? దేవుడుంటే నీ కోరికలు ఎప్పుడూ తీరాలిగా? "

"మనకి ఏది అవసరమో, ఎంత అవసరమో అదే దేవుడు ఇస్తాడు"

"నీ అవసరాల గురించి ఆయనకి తెలిసినపుడు, వాటిని ఆయనే తీరుస్తాడన్న నమ్మకం ఉన్నప్పుడు ఇక పూజించటం ఎందుకు? నువ్వు పూజించటం లేదని ఆయన నీకు వచ్చేదాన్ని రాకుండా చేయడు కదా? "

"మీతో వాదించలేను. కానీ, ప్రార్థన చేయటంలో నాకు తృప్తి దొరుకుతుంది"

"సరే! ప్రార్థన ఎంతసేపు చేస్తావ్? "

"పది నిమిషాలు"

"గంట సేపు ప్రార్థన చేసేవాళ్ళు ఉంటారా? "

"ఉంటారు"

"రోజంతా ప్రార్థన చేసేవాళ్ళు ఉంటారా? "

"యోగులు, సన్యాసులూ ఉండవచ్చు"

"ఎక్కువసేపు పూజ చేస్తే ఎక్కువ పుణ్యం వస్తుందా? "

"నాకంత జ్ఞానం లేదు సర్!"

"అందరూ రోజంతా పూజ చేస్తూ గడి

పితే ఏమవుతుంది? "

"ఏమో సర్!"

"తిండిలేక అందరూ ఛస్తారు"

'ఛ' అక్షరాన్ని ఒత్తి పలుకుతూ అన్నాడు మల్హోత్రా.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"కొంతమంది మనుషులయినా పూజ చెయ్యటం ఆపి, పని చెయ్యబట్టి మీలాంటి వారికి తేలిగ్గా ఆకలి తీరి పూజ చేసుకునే వెసులుబాటు దొరికింది..."

"నేను నా అభిప్రాయం ఇంకొక రకంగా చెప్తాను. రోజంతా పూజ చేయవలసిన అవసరం లేదు. కానీ రోజుకి కాసేపు ఎవరి తీరికను అనుసరించి వారు పూజ చేస్తే తప్పు లేదుగా!" అందామె.

"గుడ్! అయితే ఈ పీఠాధిపతులు, మత ప్రచారకులు, బాబాలు, స్వామీజీలు చేసేది తప్పని ఒప్పుకుంటున్నట్లేనా? "

ఆమె ఏం చెప్పాలో తెలియక మౌనంగా ఉండిపోయింది.

"ఇంకొక మాట అడగాల్సి ఉంది. తీరికననుసరించి రోజుకి పది నిమిషాలు పూజ చేసినా చాలన్నావ్! ఆ మాత్రం కూడా తీరిక లేనివారు ఎవరైనా ఉంటే ఆ కాస్త పూజ చేయకపోయినా ఫరవాలేదన్నమాటేగా? "

"రోజుకి పది నిమిషాలు తీరిక లేని వారు ఎవరుంటారు? "

"ఒకవేళ ఉంటే? "

"ఉంటే, పూజ చేయకపోయినా ఫర్వాలేదు" అతని వాదనతో ఏకీభవిస్తూ అంది.

"అదే నేను రుజువు చేయదలచుకుంది. నీ నోటితో నువ్వే ఒప్పుకున్నావ్!"

చెంపలు వేసుకుందామె. "ఈ టాపిక్ ఇక వదిలిపెట్టండి సర్! దేవుడి గురించి ఇలా మాట్లాడుకోవాలంటే నాకు భయం వేస్తోంది"

మల్హోత్రా రెట్టించలేదు. వాదనతో ఒక మనిషిని ఓడించడం తేలిక. అయితే ఆ మనిషి అభిప్రాయాలను, భావోద్వేగాలను మార్చటం అత్యంత కష్టం.

మనిషి తను పెట్టుకున్న నియమాలను తనే పాటించడు. ఇక దేవుడి నియమాలు ఎక్కడ పాటించగలడు?

తన సెక్రటరీని చూస్తే మల్హోత్రాకి అదే అనిపించింది. 'ఏ సామాజిక నియమాలను అనుసరించి నువ్వు పెళ్ళి చేసుకోకుండా నాతో గడుపుతున్నావ్? నీ కోరికలు దేవుడే తీరుస్తాడన్న నమ్మకం ఉంటే పూజలు చేసుకుంటూ గడపవచ్చుగా? ' మనసులోని మాటలను బయటకు అనకుండా అదుపు చేసుకున్నాడు.

అయితే అతనికి ఈ విషయం మీద ఆమె అభిప్రాయాలు ఇంకా తెలుసుకోవాలని ఉంది.

"నీకు దేవుడు ప్రత్యక్షమై ఒక వరం కోరుకోమంటే ఏమి కోరుకుంటావ్? " అని అడిగాడు.

"డబ్బు! బోలెడు డబ్బు కోరుకుంటాను" అంది కళ్లు మిలమిలలాడిస్తూ.

"దానికి దేవుడ్నెందుకు కష్టపెట్టటం.. నువ్వే సంపాదించుకోవచ్చుగా? "

"జీవితాంతం కష్టపడ్డా నాలాంటిది ఎంత సంపాదించగలదు? నాకు ఆ కాస్త చాలదు. చాలా కావాలి" అంది.

ఇంతలో ఏదో గుర్తుకు వచ్చినట్లు "నాకు ఎప్పటినుండో ఒక సందేహం సర్! మీలాగే అన్నీ ఉన్నవారికి దేవుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే ఏమి కోరుకుంటారు? " అని తన సందేహం వెలిబుచ్చింది.

"మిగిలిన వారి సంగతి నాకు తెలియదు. నేను మాత్రం నీకులానే బోలెడు డబ్బు కోరుకుంటాను" అన్నాడు మల్హోత్రా.

"పోండి సర్! మీరు నన్ను ఎగతాళి చేస్తున్నారు" అలిగినట్లు నటిస్తూ దూరంగా వెళ్ళిపోయిందామె.

'నేను నిజమే చెప్పాను' మనసులో అనుకున్నాడు మల్హోత్రా. 'ఇప్పుడు నాకు కావలసింది డబ్బే! నా కోసం కాదు. నామీద ఆధారపడ్డ నీలాంటి వారి కోసం' దూరంగా వెళ్తున్న సెక్రటరీని చూస్తూ అనుకున్నాడు మల్హోత్రా.

ఇంతలో అతనికి ఒక చిన్న ఆలోచన వచ్చింది. ఒక చిన్న ప్రార్థన చేయటం వలన తన సమస్యలు తీరుతాయంటే అది చేయటం వలన నష్టమేమిటి అని. అయితే అతని అహం అతని చేత ఆ పని చేయనివ్వలేదు.




"నేను అధికారంలోకి వచ్చింది నా కోసం కాదు.. పేద ప్రజలకు సాధ్యమైనంత సహాయం చేయటానికి. కానీ, అదే చేయలేకపోతున్నాను" ఆక్రోశంగా అన్నాడు మహేష్. అతను ఆ రాష్ట్రానికి ముఖ్యమంత్రి.

మహేష్ నలభై సంవత్సరాల రాజకీయ నాయకుడు. మిగిలిన రంగాల్లో సంగతేమోకానీ రాజకీయాల లెక్కల ప్రకారం అతనింకా యువకుడే. ముఖ్యమంత్రి పీఠమంటే ఎలాంటి ముళ్ళ కిరీటమో అతనికి ఇప్పుడిప్పుడే తెలుస్తోంది.

అతని మంత్రివర్గ సమావేశం ముగిసింది. వారిది కొత్తగా పెట్టిన పార్టీ. యువకులంతా కలిసి అవినీతికి వ్యతిరేకంగా ఉద్యమం చేసి ప్రజలను ఆకర్షించి అధికారంలోకి వచ్చారు. వారు అధికారంలోకి రాగలుగుతారని వారితో సహా ఎవరూ అనుకోలేదు. అందరూ కొత్తవారు కావటంతో ఇంకా రాజకీయాలకు అలవాటు పడలేదు. అతనితోపాటు మంత్రివర్గంలో ఉన్న మంత్రులందరూ అనుభవం లేనివారే! అందుకే మంత్రివర్గ సమావేశాల్లో సమాధానాల కంటే సమస్యలే బయటకు వస్తున్నాయి. తన సహచరులను ఏమీ అనుకోవటానికి లేదు. వాళ్ల పరిపాలనలో మెళకువలు నేర్చుకోవటానికి కాస్త సమయం పడుతుంది. ప్రతిపక్షాలు వారికి ఆ సమయాన్ని ఇవ్వటం లేదు.

అధికారంలోకి వచ్చిన మొదటి రోజు నుండే ఈ ప్రభుత్వం మీద దాడి మొదలయింది. ఏ చిన్న పని చేయబోయినా దానిమీద విమర్శలు తప్ప సహకరించే వారే కరువయ్యారు.

అసలే అతని ప్రభుత్వానికి పూర్తి మెజారిటీ లేదు. ప్రభుత్వంలో చేరకుండా బయటి నుండి పానకాలు అనే నాయకుడు మద్దతు ఇస్తున్నాడు. అతని గ్రూపులో ఏడుగురు ఎమ్మెల్యేలు ఉన్నారు. వారంతా ప్రభుత్వానికి మద్దతిస్తున్నట్లు నటిస్తూ తమ పనులు చేయించుకోటానికి ప్రయత్నిస్తున్నారు. అందుకుగాను ముఖ్యమంత్రి మీద విపరీతమైన ఒత్తిడి తెస్తున్నారు.

మరొక పక్క ఆశయాల పేరు చెప్పి అతనితోపాటు పార్టీలో చేరిన నరహరి చాప కింద నీరులా తయారయ్యాడు. ఇరవై మంది ఎమ్మెల్యేలతో ప్రత్యేక గ్రూపు కట్టాడు.

అందరూ కలిసి బండిని తలా ఒక వైపు లాగుతుంటే అది ఎటూ కదలటం లేదు.

అసహనంతో విసిగిపోతున్నాడు ముఖ్య మంత్రి. తన అసహనాన్ని ఆ రోజు ముఖ్య సలహాదారు ప్రభు ముందు వెల్ల డించాడు.

ముఖ్యమంత్రి చెప్తున్న సమస్యలు వింటున్న ప్రభు సన్నగా నవ్వాడు. అతను అనేక ప్రభుత్వాలలో పనిచేసిన అనుభవ జ్ఞుడు. ఏ ముఖ్యమంత్రి దగ్గర పనిచేస్తే ఆ ముఖ్యమంత్రికి విశ్వాసంగా ఉంటాడు. అందుకే ముఖ్యమంత్రులు మారినా అతను మారడు. అన్నీ విన్న అతను ప్రశాంతంగా "మనిషి ఏది సాధించాలన్నా ప్రాణం ఉంటేనే సాధ్యం. అలానే రాజ కీయ నాయకుడు ఏది సాధించాలన్నా అధికారం అవసరం. మిమ్మల్ని మీరు కాపాడుకుంటేనే మరొకరికి సహాయం చేయగలుగుతారు. కాపాడుకోవటం అంటే నా ఉద్దేశంలో అధికారం కాపాడుకోవటం అని. ప్రజలకు సాయపడాలంటే అధికారం కావాలి. అధికారం నిలబడాలంటే తప్పుడు మార్గంలోకి నడవాలి. ఇదొక విష వలయం"

"ఆ విషవలయాన్ని ఛేదించాలనే నేను రాజకీయాలలోకి వచ్చాను. కానీ ఏమీ చేయలేకపోతున్నాను" నిరాశగా అన్నాడు మహేష్.

"మార్పు ఆహ్వానించదగిందే! కానీ అది సహజ పరిణామంలో నెమ్మదిగా వస్తేనే నిలుస్తుంది. బలవంతంగా ఏదో మార్చాల నుకుంటే కుదరదు"

"ఎందుకు కుదరదు? ప్రపంచం ఎంత త్వరగా మారుతుందో మీకు తెలుసా? అంతకుముందు చరిత్ర వదిలెయ్యండి. గత రెండు వేల ఏళ్ల చరిత్ర తీసుకుంటే మనిషి మేధస్సు క్రీస్తు పుట్టిన నాటికి ఎలా ఉందో అది రెట్టింపు కావటానికి 1500 సంవత్సరాలు పట్టింది. ఆ తర్వాత కాలం గడిచే కొద్దీ మేధస్సు వృద్ధి అయ్యే కాలం తగ్గిపోతూ వస్తోంది. ప్రజాస్వామ్య రాజ్యాలు రావటం, ఉత్పత్తి రంగంలోకి యంత్రాలు రావటం, కరెంటు, పెట్రోలు లాంటి ఇంధనాలు కనిపెట్టటం, మోటరుకారు వినియోగంలోకి రావటంతో ఇంకా త్వరత్వరగా మానవమేధ ఎదుగు తోంది. మానవ మేధస్సు నిరంతరం అభి వృద్ధి చెందుతుండడమే కాదు, అది చాలా వేగంగా పెరుగుతోంది!"

"మీరు చెప్పింది నిజమే! మనిషి మేధస్సు ఎన్నో రెట్లు పెరిగింది. అయితే ఆ పెరిగిన మేధస్సుతో మనిషి సాధిం చింది ఏమిటి? భౌతిక సుఖాలు పెరి గాయి. అదే స్థాయిలో మానసిక అశాంతి పెరిగింది. భౌతికంగా ఎన్నో రెట్లు అభి వృద్ధి సాధించాడని చెప్పుకుంటున్న మనిషి నైతిక విలువల విషయంలో ఈ రెండు వేల సంవత్సరాలలో ఎంత ఎదిగాడో తెలుసా? ఏమీ ఎదగలేదు. ఇంకా చెప్పు కోవాలంటే దిగజారాడేమో కూడా! మేధ స్సునీ, నైతిక విలువలనూ సమాన స్థాయిలో వృద్ధి చేయనంతకాలం జరుగు తున్న అభివృద్ధి అంతా కొంతమంది వద్దే మురిగిపోతుంది" ప్రభు తన అనుభ వంతో చెప్పాడు.

"మరి మనమందరం కలిసి ఆ మార్పును తెచ్చే ప్రక్రియకు కనీసం మన వంతుగానైనా శ్రీకారం చుట్టవచ్చుగా? "

"అది అంత తేలిక కాదు. ఈ వ్యవస్థ కొన్నివర్గాల చేతుల్లో ఇరుక్కుపోయి ఉంది. ముఖ్యంగా రాజకీయాలు కొందరి గుప్పిట్లో ఉండిపోయాయి. ప్రస్తుతం జరు గుతున్నది రాజకీయ నాయకుల చేత, రాజకీయ నాయకుల కోసం కొ నసాగుతున్న నాటకం. దానిలోకి తమవారు కానివారిని అంత త్వరగా రాని వ్వరు. పొరపాటున మీలాంటి వారు ఎవ రైనా వస్తే అతన్ని కూడా తమలో ఒక

# అమెరికన్ కొరియర్ కంపెనీ!

ఏవైనా పుస్తకాలను తపాలాలో పబ్లిషర్ నుంచి తెప్పించుకోవడానికి మనం ఇష్టపడం. పోస్టల్ లేదా కొరియర్ పెట్టే ఖర్చును వృథా అనుకుంటాం తప్ప ఆ సేవలోని సౌలభ్యాన్ని విస్మరిస్తాం. అమెరికాలో వందేళ్ల క్రితం నుంచే కొరియర్‌కు ఖర్చు చేసే మనస్తత్వం ఉంది. నేడు అమెరికాలోని అతి పెద్ద కొరియర్ సంస్థ యునైటెడ్ పోస్టల్ సర్వీస్(యు.పి.ఎస్) ద్వారా సెల్ ఫోన్‌లాంటి చిన్న వస్తువు నుంచి ట్రిపుల్ డోర్ ఫ్రిజ్‌లాంటి పెద్ద వస్తువుని కూడా తెప్పించుకుంటున్నారు. యు.పి.ఎస్ వేర్ పేరుతో 1906లో సియాటెల్‌లో ఆరంభమై నేడు రెండువందల దేశాల్లో ఐదులక్షల ఉద్యోగులతో ఏడాదికి 500 కోట్ల డాలర్ల ఆదాయంగల సంస్థగా ఎదిగింది.



★ యు.పి.ఎస్‌కి గల ప్రత్యేక డెలివరీ వ్యాన్‌లు అన్నీ ఖాకీరంగులో ఉంటాయి. ఇందుకు కారణం దుమ్ముపడ్డా ఎక్కువ మాసిపోయినట్లు తెలియదు.

★ వారి ఉద్యోగుల సమవస్త్రాలు కూడా ఖాకీరంగే. అయితే ఒక్క జర్మనీలో మాత్రం ఆకుపచ్చరంగువి ధరిస్తారు. ఎందుకంటే నాజీ జర్మనీ పార్టీ వాళ్లంతా ఖాకీ దుస్తులే ధరించేవారట. అందుకే ఈ రంగును వాడరు.

★ యు.పి.ఎస్. అమెరికన్ తపాలా శాఖకు కూడా కొరియర్‌గా వ్యవహరిస్తూ, వాటి ఉత్తరాలను, పార్శిళ్లను కొన్ని చోట్ల డెలివరీ చేస్తోంది.

★ యు.పి.ఎస్‌కి ప్రత్యేక విమానాల సముదాయం ఉంది. అమెరికాలోని ఓ చోటు నుంచి మరోచోటుకు 24 గంటల్లో బట్వాడా చేయగలదు.

★ యూపీఎస్ ఓ సాఫ్ట్‌వేర్‌ను తయారు చేయించింది. దాని ప్రకారం ఆ కంపెనీ ట్రక్కులు వెళ్లే మార్గంలో ఎడమవైపు (మన దేశంలో కుడివైపు) తిరగడానికి ట్రాఫిక్‌లైట్ల వద్ద అవి ఆగనవసరం లేదు. అన్నీ కుడివైపు తిరిగే రూట్లల్లో ప్రయాణం చేయడం ద్వారా ఒక్క వాషింగ్టన్ డీసీలోనే ఏటా 51 వేల గేలన్ల పెట్రోల్‌ను ఆదా చేయగలుగుతోంది.

★ 1919లో ఈ కంపెనీ పేరు మర్చెంట్స్ పార్శిల్ డెలివరీ. తమ కంపెనీ దేశమంతటా సేవలు అందిస్తుందనే భావన కలిగించడానికి యునైటెడ్ అని, తాము చేసే వ్యాపారం తెలియజేసేందుకు పార్శిల్ అనీ, సేవను తెలియజేయడానికి సర్వీస్ అని మొత్తంగా యునైటెడ్ పార్శిల్ సర్వీస్ అనే పేరును ఎంచుకున్నారు.

డిగా కలుపుకునే వరకూ నిద్రపోరు"

"అదే నాకు ఆశ్చర్యం కలిగిస్తుంది. అవి నీతిపరులు అధికారంలో ఉన్నప్పుడు కూడా ఇన్ని గొడవలు జరగలేదు. నన్ను ఈ గద్దె మీద ఉంచటమే పాపమన్నట్లు అందరూ ప్రవర్తిస్తున్నారు"

"చెప్పాను కదా! మీరూ వారిలో ఒకరని నమ్మకం కలిగేదాకా అంతే!"

"క్షమించండి.. నేను ఏనాటికీ వారిలో ఒకడిని కాలేను"

"మరేమి చేస్తారు? "

"ప్రస్తుతం నాకేమీ తట్టటం లేదు. కానీ నాకు నమ్మకం ఉంది. ఆ దేవుడే నాకు దారి చూపిస్తాడు"

పెద్దగా నవ్వాడు ప్రభు. "మీకు దేవుడంటే అంత నమ్మకమా? "

"పూర్తిగా! మంచి చేయదలచుకున్న వారికి ఎవరి సాయం ఉన్నా లేకున్నా

దేవుని ఆశీర్వాదం మాత్రం ఉంటుందన్నది నా నమ్మకం. ఆయనే లేకపోతే ఇంత మంది ఉద్దండులను తట్టుకుని యువకుల మైన మేము అధికారంలోకి రావటం సాధ్యమయ్యే పనేనా? "

"అయితే ఎదుటివారిలో మార్పు తెమ్మని ఆ దేవుడ్నే ప్రార్థించండి"

"దేవుడు దేనినీ మార్చడు. మనం పూను కుంటే సహాయం చేస్తాడంతే"

"ఆ ప్రయత్నం చేయటం కంటే దేవుడ్నే నీ సహాయానికి తీసుకురావటం తేలికేమో" చర్చ ముగించి లేచాడు ప్రభు.

మహేష్ జీవితంలో అబ్బురపరచే మార్పులు అతి త్వరలో జరగబోతున్నా యని అప్పుడు వారిరువురికీ తెలియదు.




**"సా**రీ! ఈ ప్రాజెక్టు నేను చెయ్యలేను" అన్నాడు ఆదిత్య. అతను తెలుగు సినిమా లలో లీడింగ్ హీరో! ప్రస్తుతం సినిమా పరిశ్రమని ఏలుతున్న నటుల్లో ఒకడు. చేసిన సినిమాలన్నీ హిట్ అయిన అత్యంత అరుదైన హీరో!

"అదేంటి సర్! కథ బాగాలేదా? " అప్ప టిదాకా కథ చెప్పిన దర్శకుడు నిరుత్సా హంగా అడిగాడు.

"కథ బానే ఉంది. కాకపోతే నాకు నప్పదు. వేరే వారిని పెట్టి తియ్యండి"

"మీరు నటిస్తే చాలా గొప్ప సినిమా అవుతుంది సర్!" చావని ఆశతో అన్నాడు ఆ దర్శకుడు.

"నాకు తెలుసు. కానీ నా అభిమానులు నన్ను ఒక బిచ్చగాడి పాత్రలో చూడలే రండీ. ట్రెండును కూడా చూసుకోవాలి కదా!"

"కానీ, మీకు ఈ సినిమా ఎన్నో అవా ర్డులు తెచ్చి పెడుతుంది.. నేషనల్ అవార్డు రాదగ్గ కథ, పాత్ర"

వారిద్దరు ఆదిత్య ఆఫీసులో కూర్చుని కథాచర్చ చేసుకుంటున్నారు. ఎన్నో రోజుల ఎదురుచూపుల తరువాత ఆ దర్శ కుడికి ఈ అవకాశం లభించింది. అది ఇలా వృథా పోవటం అతనికి నిరుత్సా హంగా ఉంది.

ఇక ఆ సంభాషణ అంతటితో ఆపాలని నిర్ణయించుకున్న ఆదిత్య అనునయంగా చెప్పాడు. "చూడండి! నేను అభిమానుల కోసం నటిస్తాను. అవార్డుల కోసం కాదు. అందరికీ నచ్చే కథతో రండి. మళ్ళీ వింటాను. ఇది మిమ్మల్ని అవమానిం చటం కాదు. మీ కథని అవమానించటం అంతకంటే కాదు. నాకు ఇంతవరకు ఫ్లాప్ లేదు. ఆ ప్రత్యేకత కేవలం నేను సెలెక్ట్ చేసుకుంటున్న కథలవల్లే! దయచేసి నన్ను ఇబ్బంది పెట్టకండి"

నిట్టూర్చాడు ఆ దర్శకుడు.

"సరే సర్! మళ్ళీ ఇంకో కథతో వస్తాను. ప్రస్తుతానికి సెలవ్!" అంటూ లేచాడు.

"అలాగే! మీతో పనిచెయ్యటం నాకు ఎప్పుడూ ఇష్టమే! నాకు నప్పే కథతో రండి"

దర్శకుడు బయటకు వెళ్ళిపోయాడు.

అప్పటివరకు ఆదిత్యతోపాటు ఆసక్తిగా కథ వింటున్నాడు ఆఫీసు అటెండర్.

"ఏమోయ్! అతను చెప్పిన కథ ఎలా ఉంది? " అడిగాడు ఆదిత్య.

"ఛండాలంగా ఉంది సర్! మీకు సూట్

కాదు"

తృప్తిగా తల ఊపాడు ఆదిత్య. అదే అతను సినిమా ఒప్పుకుని ఇదే మాట అడిగి ఉంటే ఈ ప్రశ్నకు జవాబు- 'బ్రహ్మాండమైన హిట్ అవుతుంది' అని వచ్చేదని ఆదిత్యకు తెలియదు.

ఒకప్పుడు ఆదిత్య కూడా సినిమా రంగంలోకి ప్రవేశించటానికి అనేక తంటాలు పడినవాడే! ఇబ్బందులను ఎదుర్కొన్నవాడే!! అయితే ఒకసారి సినిమా పరిశ్రమలోకి ప్రవేశించాక అతని అదృష్టం కొద్దీ పెద్దగా కష్టపడనవసరం లేకుండానే అభివృద్ధిలోకి వచ్చాడు. హిట్ సినిమాలు ఇచ్చే హీరోకంటే ఇండస్ట్రీకి కావలసింది ఏముంటుంది? ఒక పెద్ద నిర్మాత తన కూతుర్ని ఇచ్చి పెళ్లి చేశాడు. అదృష్టం కూడా అతనికి తోడయింది. నటించిన సినిమాలన్నీ హిట్లయ్యాయి. నెమ్మదిగా చుట్టూ వందిమాగధులు చేరారు. సినిమాలు హిట్లయ్యే కొద్దీ కోటరీ సంఖ్య పెరగసాగింది. వారంతా కలిసి బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా ఒక ఇనుప చట్రం అతని చుట్టూ బిగించారు. అతను ఆనందంగా అందులో ఇరుక్కుపోయాడు. ప్రస్తుతం అతను ఆ చట్రానికి అలవాటుపడిపోయి అదే లోకం అనుకుంటున్నాడు. అతని సినిమాలు వరుసబెట్టి సక్సెస్ అవుతుండటంతో ఆ చట్రం ఇంకా పటిష్టం అవుతూ వస్తోంది.

ఒకసారి అతని సినిమాలు ఫ్లాప్ అవటం మొదలుపెడితే ఆటోమేటిగ్గా ఆ చట్రం సడలిపోతుంది. అతని చుట్టూ చేరిన వారు నెమ్మదిగా వెనుకంజ వేస్తారు. సినిమా పరిశ్రమకి ఎప్పుడూ ఒక సూపర్‌స్టార్ కావాలి. ఒకరు వెనుకంజ వేయగానే మరొక సూపర్ స్టార్‌ని ఇండస్ట్రీ తయారు చేస్తుంది.

అయితే ప్రస్తుతానికి సినిమా ఇండస్ట్రీలో ఆదిత్యకు ఎదురులేదు.

యక్షప్రశ్నలకు జవాబు చెప్పే సందర్భంలో యక్షుడు ధర్మరాజుని ఒక ప్రశ్న అడుగుతాడు 'ఈ సృష్టిలో అన్నిటికంటే విచిత్రమయినది ఏమిటి?' అని.

దానికి ధర్మరాజు ఇలా చెప్తాడు "మన కళ్ళ ముందు రోజూ అనేకమంది మరణిస్తుంటారు. ఆ మరణాలను చూస్తూ కూడా మానవుడు ఈ మృత్యువుకు తను అతీతుడన్నట్లు ప్రవర్తించటం కంటే విచిత్రం ఇంకేముంటుంది?"

అలాగే ఎందరో మహానటులు పుట్టారు. అందులో కొంతమంది స్టార్‌లయ్యారు. స్టార్‌లైనవారెవరూ ఆ స్థానంలో శాశ్వతంగా ఉండరు. కొంతకాలానికి స్టార్‌డమ్ పోగొట్టుకున్నారు. కానీ స్టార్‌గా ఉన్నంత కాలం ఆ స్టార్‌డమ్ ఏదో ఒక రోజు పోవచ్చన్న ఆలోచనే వారికి రాదు.

అదే సినిమా పరిశ్రమలోని వైచిత్రి.

ఇంతలో ఆదిత్య ఫోన్ మోగింది. ఎత్తే ముందు ఎవరా అని చూశాడు. అతని భార్య సుమ ఆ ఫోన్ చేస్తోంది.

"హాయ్ సుమా! ఎక్కడున్నావ్?" అన్నాడు ఆదిత్య ఫోన్ ఎత్తి.

"నేను గుడికి వచ్చాను. కారు చెడిపోయింది. ఇక్కడ ఇరుక్కుపోయాను. మీరెక్కడ ఉన్నారు? కారు పంపగలరా?" అడిగింది సుమ.

"దగ్గర్లోనే ఉన్నాను. కారు పంపటం ఎందుకు? నేనే వచ్చి పికప్ చేసుకుంటాను. అప్పటివరకు అక్కడే ఉండు" అని డ్రైవర్‌కి తాను వెళ్ళవలసిన గుడిపేరు చెప్పాడు.

కారు అటు తిరిగింది.

మరో పావుగంటలో కారు గుడి ముందు ఆగింది. "నేను బయటకు వస్తే జనాలు మీద పడతారు. తాకిడి తట్టుకోలేం! నువ్వెళ్ళి అమ్మగారిని తీసుకురా!"

అని డ్రైవర్ని గుడిలోకి పంపాడు.

ఆ గుడి ఒక చిన్నగుట్ట మీద ఉంది. డ్రైవర్ వెళ్ళి ఆమెని తీసుకురావటానికి కాస్త సమయం పడుతుంది. ఈ లోపు ఏమి చేయాలో అర్థంకాక ఏసీ కారులో విశ్రాంతిగా వెనక్కి వాలాడు అతను. స్పీకర్లో నుండి తన కొత్త సినిమా పాటలు వినిపిస్తున్నాయి.

ఇంతలో అతని దృష్టి గుడికి వెళ్ళే దారి మీద పడింది.

గుట్ట మీదికి వెళ్ళటానికి మెట్లున్నాయి. మెట్లకి అటు ఇటు కూర్చుని గుడి లోపలకు వెళ్ళే వారిని అడుక్కుంటున్నారు కొందరు బిచ్చగాళ్ళు.

ముఖ్యంగా ఆఖరి మెట్టుమీద కూర్చుని ఉన్నాడు ఒక వ్యక్తి. అతని జుట్టు జడలు కట్టి ఉంది. గడ్డం గుబురుగా పెరిగి ఉంది. ఆ గడ్డం నల్లగా ఉండబట్టి అతని వయసు ఎక్కువ ఉండదనుకోవాలి తప్ప అతని మొహంలో గడ్డం తప్ప ఇంకేమీ కనపడటంలేదు. అతని ఒంటి మీద ఉన్న దుస్తులు మురికిపట్టి పీలికలయి ఉన్నాయి. మామూలుగా అయితే అతన్ని ఒకసారి చూడగానే ఎవరైనా మొహం పక్కకి తిప్పుకుంటారు.

మధ్యమధ్యలో ఖళ్ళుఖళ్ళున దగ్గుతున్న అతన్ని చూస్తుంటే ఎవరికైనా అతని దగ్గరకు వెళ్ళాలంటే భయం గొలుపుతుంది. కానీ ఈ బిచ్చగాడు ఎందుకో అతన్ని ఆకర్షిస్తున్నాడు.

కాసేపటి క్రితం తను విన్న కథలో పాత్ర బిచ్చగాడు కావటం వలన కాబోలు అతనంటే ఏదో తెలియని కుతూహలం కలుగుతోంది. అతన్ని చూస్తున్న కొద్దీ





ఆదిత్యకి ఏవగింపు కలగటానికి బదులు జాలి ఎక్కువైంది. 'ఏ పరిస్థితుల ప్రభావాన అతను అలా తయారయ్యాడో' అని కుతూహలం కలిగినా, దానిని కనుక్కునే వీలు తనకు కుదరదని అతనికి తెలుసు.

ఒకసారి తనను ఆ పాత్రలో ఊహించుకున్నాడు ఆదిత్య. అంతే! అతని శరీరం జలదరించినట్లయింది. సినిమాలో అయినా సరే, తననుతాను ఆ ఆకారంలో ఊహించుకోలేకపోయాడు. ఇక తను అలా చేస్తే తన అభిమానులు ఏమైపోతారో అనుకున్న అతను ఆ కథను రిజెక్ట్ చేయటమనే తన నిర్ణయాన్ని మరొకసారి మనసులో సమర్థించుకున్నాడు.

ఇంతలో అతనికి ఇంకో ఆలోచన వచ్చింది. ఆ బిచ్చగాడిని ప్రస్తుత పరిస్థితుల నుండి బయట పడేసి ఆనందంగా జీవించేలా చేయవచ్చా? ఒకవేళ అలా చేయాలంటే అతనికి ఎంత డబ్బు ఇవ్వాలి? పదివేలు చాలా? లక్ష అయితే ఎక్కువవుతుందా? చిన్న కిళ్ళీ కొట్టు పెట్టుకుని గౌరవంగా బతకటానికి లక్ష చాలదూ? సరిపోదేమో! అతని ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే ఉన్నట్లు ఉంది... అని ఆదిత్య రకరకాల ఆలోచనలు చేశాడు.

అతను ఏ మాత్రం తెలివికలవాడయినా, ఆరోగ్యం సహకరిస్తే ఒక లక్ష రూపాయలతో అతని జీవితం బాగు చేయవచ్చని అనుకున్నాడతను చివరికి. కానీ అతనికి ఆ లక్ష ఎవరిస్తారు? పోనీ, తనే ఇస్తేనో! వెంటనే అతని అంతరాత్మ అతన్ని మొట్టికాయ వేసింది. 'నువ్వు మామూలు మనిషివి. ఎదుటి వారి జీవితాలు మార్చలేవు. అది దేవుడి పని. ఆ శక్తి ఉన్న ఆయన ఎవరినీ పట్టించుకోకుండా ఉంటే మధ్యలో నీకేమి సంబంధం? అంతగా జాలి వేస్తే పది రూపాయలు ఇవ్వు. అంతకంటే ఆ బిచ్చగాడు కూడా నీ నుండి ఏమీ ఆశించడు' అని తేల్చింది.

ఇంతలో అతని భార్య సుమ వచ్చి కారు ఎక్కింది. "ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు? " అంది, ఏదో ఆలోచనలలో మునిగిపోయినట్లు ఉన్న భర్తను చూసి.

కారు అక్కడి నుండి బయలుదేరింది.

"ఏమీలేదు" అన్నాడు ఆదిత్య. ఇంతలో ఏదో గుర్తుకు వచ్చినట్లు "నువ్వేంటి ఇవాళ

ఇక్కడికి వచ్చావ్? నాకు తెలిసి ఇవాళ ఏ పండుగా కాదే!" అన్నాడు.

"పండుగ అయితేనే గుడికి వెళ్తారా? నేను మీ కోసం వెళ్ళాను"

"నా కోసమా?" ఆశ్చర్యంగా అడిగాడ తను.

"అవును. రేపు మీ కొత్త సినిమా రిలీజ్ అవుతుందిగా. అందుకే దేవుడికి అభిషేకం చేయిద్దామని వచ్చాను"

"ఓహ్! థాంక్స్!!" ఆమెని ముద్దు పెట్టుకోవటానికి వంగుతూ చెప్పాడు.

"ఊరుకోండి" అతన్ని దూరం తోసేసిందామె. డ్రైవర్ని చూపిస్తూ "ఎవరైనా ఉన్నారని కూడా లేదు" అంది చిరుకోపంగా.

## కొత్తగాలి...

**చినుకు పడితే**
**నగర రాదారులు**
**వరద గోదారులు**

– పొనుగోటి నరసింహారావు,
దుబ్బాక, నల్గొండజిల్లా

"నీకేమన్నా కనిపించిందటోయ్!" అడిగాడు ఆదిత్య డ్రైవర్ని.

"లేదండి" ముసిముసిగా నవ్వుతూ చెప్పాడు డ్రైవర్.

"ఇదిగో ప్రసాదం.. కళ్ళకద్దుకుని తినండి" ఇద్దరికీ కొబ్బరిముక్క ఇచ్చింది సుమ.

"నాకు నా అభిమానుల ఆదరణ ఉంటే చాలు. మరే దేవుడి సహాయం అవసరం లేదు"

"అలా మాట్లాడకండి. దేవుడి గురించి తప్పుగా మాట్లాడకూడదు"

"నాకు ఆయన గురించి చాలా అనుమానాలున్నాయి. నీకు కనిపించినపుడు ఒకసారి నా దగ్గరకి పంపు. ఆ అనుమానాలన్నీ తీర్చుకోవాలి" అన్నాడు నవ్వుతూ.

"ఆయన కనిపిస్తే మీకే కనిపించాలి. దేవుడు తనని నమ్మని వారికే ఎక్కువగా కనిపించిన దాఖలాలున్నాయి" తనూ నవ్వుతూ అంది సుమ.

కారు వారి ఇంటివైపు దూసుకుపోయింది.

★ ★ ★

జోరున పడుతున్న వానజల్లు ఐమాక్స్ థియేటర్ అద్దాల మీద తెరలుతెరలుగా జారుతోంది.

నటులు కావాలని వచ్చి, అడ్డుకుంటున్న గార్డును ఛేదించలేక, స్టూడియో గేటు ముందు బిక్కమొహం పెట్టిన అమాయకుడిలా- బయటి చలిగాలి లోపలి అతిథుల దగ్గరకు చేరలేకపోతోంది.

బాగా పొద్దుపోయింది.

ఆదిత్య నటించిన సినిమా రేపు రిలీజ్ కాబోతుంది. ఆ సందర్భంగా సినీ పరిశ్రమలోని ప్రముఖులకు ఏర్పాటు చేసిన 'ప్రివ్యూ షో' అక్కడ జరుగుతోంది.

ఇపుడు జరుగుతున్న 'ప్రివ్యూ' తప్ప మిగిలిన షోలన్నీ పూర్తికావటంతో ఆ ప్రాంగణం దాదాపు నిర్మానుష్యంగా మారింది.

ఆదిత్య నటించిన సినిమా అంటే చాలా పెద్ద సినిమా. అందుకే ఈ ఈవెంట్ని కవర్ చెయ్యటానికి చాలామంది విలేకర్లు వేచి ఉన్నారు. ఎవరికి తప్పినా తమకు తప్పదన్నట్లు ప్రివ్యూ నుండి బయటకు వచ్చే ప్రముఖుల అభిప్రాయాలను రికార్డ్ చేసుకోవటానికి టి.వి. ఛానెళ్ళ కెమెరా మెన్లు బద్ధకంగా అక్కడే తచ్చట్లాడుతున్నారు.

ఇంతలో షో అయిపోయింది.

సినీ రంగానికి చెందిన అతిరథమహార

థులందరూ ఒకరొకరుగా బయటకు వస్తున్నారు. మనసులో ఏమి ఉన్నా మొహానికి నవ్వు పులుముకుని వస్తున్నారు. వస్తూ వస్తూ ఆదిత్యను గట్టిగా ఆలింగనం చేసుకుని మరీ తమ అభిప్రాయం తెలియచేస్తున్నారు. అతను అప్పటివరకు థియేటర్లో కూర్చుని ఉన్నా, అప్పుడే బయటకు వచ్చి అతిథులను కలుసుకోవటానికి అక్కడ నిలబడి ఉన్నాడు.

అందరిదీ ఒకే మాట- ఈ సినిమా తెలుగు సినీ చరిత్రలోనే అన్ని రికార్డులను బద్దలు కొట్టే చిత్రం అవుతుందని.

కిందకు దిగుతున్న అతిథులు వేచి ఉన్న టి.వి. ప్రతినిధులకు కూడా అదే చెప్తున్నారు.

"స్మాషింగ్ హిట్.." చెప్పింది ఒక తెలుగురాని హీరోయిన్.

"వంద కోట్లు వసూలు చేసే మొదటి తెలుగు సినిమా కాబోతుంది" అన్నాడు ఒక ప్రొడ్యూసర్.

"అద్భుతమైన సాంకేతిక విలువలు! చూసినంత సేపూ కళ్ళు తిప్పుకోనివ్వటం లేదు" అని కథ మీద కన్నా సాంకేతిక పరిజ్ఞానంపై ఎక్కువ ధ్యాస పెడతాడని పేరుపడ్డ యువ దర్శకుడు ప్రకటించేశాడు.

ఏ సినిమాకయినా విడుదలకు ముందు ఇలాంటి డైలాగులే వినిపిస్తాయి. పొగడ్తలు తప్ప ఏమీ వినిపించవు. ఏ సినిమాకయినా సూపర్‌హిట్ టాక్ వినిపిస్తుంది. విడుదలైన రెండు రోజులకు గుసగుసగా వినిపించటం మొదలుపెట్టిన పచ్చినిజాలు వారం తిరిగేసరికి బల్లగుద్ది శిలాక్షరాలవుతాయి.

సినిమా ఫ్లాప్ అని తేలేటప్పటికి ఆ సినిమా కోసం పనిచేసిన అందరూ మరో సినిమాకోసం బిజీగా పని చేసుకుంటూ ఉంటారు.

మీడియా రాబోయే సినిమాని పట్టించుకుంటుంది తప్ప ఇంతకుముందే వచ్చి ఫ్లాపయిన సినిమాని కాదు.

అలా ఫ్లాపయిన సినిమా నిశ్శబ్దంగా ఫేడవుట్ అయిపోతుంది.

అయితే ఆదిత్య నటించిన సినిమాకి అలాంటి పరిస్థితి ఎప్పుడూ ఎదురుకాలేదు.

విలేకరులందరికీ ఇప్పటికే ఈ సినిమా కనీవినీ ఎరుగని హిట్ కాబోతుందని ప్రొడ్యూసర్ చేస్తున్న ప్రచారంతో తల బొప్పికట్టి ఉంది.

అయినా ఇంతమంది ఏకగ్రీవంగా అంతగా మెచ్చుకుంటున్నారంటే, ఏదో ప్రత్యేకత ఉన్నట్లే అనుకుంటున్నారు విలేకరులు కూడా! కానీ సినిమా రిలీజ్ అయితే తప్ప అసలు రంగు తెలియదని వారికి అనుభవం నేర్పిన పాఠం.

చేతులు కట్టుకుని దూరంగా నిలబడి అందరూ చెప్పే మాటలు వింటున్నాడు ఆదిత్య. అందం, ప్రతిభ ఎంత ఉన్నా సినీ రంగంలో పైకి రావాలంటే అదృష్టం ఒకింత ఎక్కువే ఉండాలి. అన్నీ కలిసి వచ్చి అందలం ఎక్కినా.. గర్వంతో, అహంభావంతో తమ స్థానం పోగొట్టుకున్నవారు అనేకులు. ఆదిత్య మాత్రం ఎన్ని మెట్లు ఎక్కినా అణకువ వదలని వ్యక్తి. అతనికి తెలుసు- ఆ సినిమా హిట్ అయితే ఆనందించేవారికన్నా.. ఫ్లాప్ అయితే ఎగిరి గంతేసేవాళ్లే ఎక్కువమంది ఉంటారని.

ఏదేమయినా అతనికి మరొక విషయం కూడా తెలుసు- కచ్చితంగా ఆ సినిమా హిట్ అవుతుందని. అది అతని తలపొగరు కాదు, ఆత్మ విశ్వాసం.

నెమ్మదిగా హడావుడి తగ్గిపోయింది.

అందరూ వెళ్ళిపోయారు.

ఆదిత్య రావటం ఆలస్యం కావొచ్చన్న అభిప్రాయంతో అతని కుటుంబ సభ్యులు

ముందే వేరే కారులో ఇంటికెళ్ళిపోయారు.

అన్ని పనులూ ముగించుకుని అతను కూడా బయటకు నడవబోతుంటే హఠాత్తుగా తన ముందు మైకు ప్రత్యక్షమైంది. తలెత్తి చూసిన అతనికి బాగా పరిచయమున్న విలేకరి మాధవి కనిపించింది.

ఆమె ఎక్కువగా ఎంటర్‌టైన్‌మెంట్ విషయాలు కవర్ చేస్తుంటుంది. అందుకే ఆమెకు చాలాసార్లు అతన్ని ఇంటర్వ్యూ చేసిన అనుభవం ఉంది.

"ఏంటీ.. ఇంకా ఇక్కడే ఉన్నారు? " టైము చూసుకుంటూ అన్నాడు ఆదిత్య.

"మామూలుగా మీ ఇంటర్వ్యూ దొరకటమే గగనం. ఇంక ఈ సినిమా కూడా సూపర్‌హిట్ అయిందంటే మాలాంటి వారికి మీరెక్కడ దొరుకుతారు? అందుకని మినీ ఇంటర్వ్యూ ఇస్తారేమో అని"

"ఈ సమయంలోనా? " ఆశ్చర్యంగా అడిగాడు ఆదిత్య.

"మీకు ఆలస్యం అవుతుందనుకుంటే, మీతోపాటు కారులో వస్తూ రికార్డ్ చేస్తాను. మీరు ఇంటికి చేరేటప్పటికి ఇంటర్వ్యూ ముగిద్దాం. ప్లీజ్! కాదనకండి సర్!" బతిమాలుతూ అంది మాధవి.

"అంత బతిమిలాడి నన్ను ఎంబరాస్ చేయవద్దు. మీకు మా అవసరం ఎంత ఉందో, మాకు కూడా మీ అవసరం అంతే ఉంది. మీరే లేకపోతే మా విషయాలు ప్రజలకు ఎలా చేరతాయి? " అని రెండు క్షణాలు ఆలోచించి,

"నాతో కార్లో వచ్చి మళ్ళీ మీరు వెనక్కి రావాలి. ఇంత రాత్రిపూట ఇబ్బంది కాదా? " అన్నాడు.

"మా కెమెరామేన్ నాతో వున్నంతసేపూ నాకేమీ భయంలేదు సర్! మీరు 'ఊ...' అనండి చాలు. మిగతాది నేను చూసుకుంటాను" అంది మాధవి.

"మీ ఇష్టం" అంటూ భుజాలు ఎగరేశాడు ఆదిత్య.

కెమెరామేన్ వెళ్ళి డ్రైవర్ పక్కన కూర్చున్నాడు. వెనుక సీట్లో కూర్చున్న ఆదిత్య, మాధవి మధ్య జరుగుతున్న సంభాషణని కవర్ చెయ్యటం మొదలుపెట్టాడు.

మరుసటిరోజు విడుదల కాబోతున్న ఆదిత్య సినిమా గురించిన మాటలతో ఇంటర్వ్యూ మొదలయింది.

ఆ సినిమా నిర్మాణంలో యూనిట్ మొత్తం ఎంత కష్టపడిందీ, అందరి శ్రమనూ ప్రతిబింబిస్తూ సినిమా ఎంత బాగా వచ్చిందీ వివరించాడు ఆదిత్య.

తర్వాత ఆ ఇంటర్వ్యూ వ్యక్తిగత వివరాల వైపు మళ్ళింది.

"మీది లవ్ మ్యారేజా? అరేంజ్‌డ్ మ్యారేజా? "

"పెద్దలు కుదిర్చిన లవ్ మ్యారేజ్"

"మీ పిల్లలు ఏమి చదువుతున్నారు? "

చాలామంది హీరోలు అలాంటి వివరాలు చెప్పటానికి ఇష్టపడరు, తమ అసలు వయసు తెలిసిపోతుందని. కానీ ఆదిత్యకి అలాంటి శషభిషలేం లేవు. ఆ వివరాలు చెప్పాడు.

"వారికి సినిమాలలోకి వచ్చే ఉద్దేశం ఉందా? "

"ఆ విషయం నిర్ణయించుకునే వయసు వారికెక్కడ ఉందండీ? ఇంకా చిన్న పిల్లలు"

"సరే! ఆ విషయం వదిలి పెట్టండి. మీ సినిమా హిట్ కావాలని కోరుతూ నిర్మాత నిన్న రాష్ట్రంలోని అన్ని ప్రముఖ దేవాలయాల్లో పూజలు చేయించారు కదా! మీరెక్కడా పాల్గొన్నట్లు లేదే? !"

ఒక్కక్షణం మౌనంగా ఉన్నాడు ఆదిత్య. తరువాత నెమ్మదిగా "ఈ విషయం నేనెప్పుడూ ఎవరికీ చెప్పలేదు. నిజం చెప్పాలంటే నాకు దేవాలయాలకు వెళ్ళటం ఇష్టముండదు. అందుకే వెళ్ళలేదు" అన్నాడు.

"అదేం! మీరు దేవుడ్ని నమ్మరా? "

"ఎందుకు నమ్మాలి? " ఎదురు ప్రశ్నించాడు ఆదిత్య.

హఠాత్తుగా ప్రశ్న తనకు గురి పెట్టబడటంతో ఆమె తడబడింది. "అదేంటండి? అలా అడుగుతారు? అందరూ ఎందుకు నమ్ముతున్నారు? "

"స్వార్థంతో, భయంతో"

"భయంతోనా? "

"అవును. తమ కోరికలు తీరాలన్న స్వార్థంతో కొంతమంది నమ్ముతున్నారు. దేవుడ్ని పూజించకపోతే కీడు జరుగుతుందేమోనన్న భయంతో మిగిలినవారు నమ్ముతున్నారు"

"మరి మీకు స్వార్థం, భయం రెండూ లేవా? "

"నాకు స్వార్థాన్ని అధిగమించటానికి సరిపడే తృప్తి ఉంది. నిజంగా దేవుడే ఉంటే ఆయన్ని చూసి భయపడకూడదన్న ఇంగితం ఉంది"

కెమెరామేన్ తన కెమెరాను ఇరువురి వైపు తిప్పుతూ వారి హావభావాలు చిత్రీకరిస్తున్నాడు.

"ఇంతకీ మీ ఉద్దేశంలో దేవుడు ఉన్నాడంటారా? లేడంటారా? " అడిగింది మాధవి.

"యుగయుగాలుగా, తరతరాలుగా నలుగుతున్న ప్రశ్న ఇది. సమాధానం దొరకని ప్రహేళిక ఇది. దానికి సమాధానం చెప్పటానికి నేనెంతటివాడినండీ!"

"అయినా ప్రతి విషయంపట్ల మీరు చాలా స్పష్టమైన అవగాహనతో ఉంటారు కదా! అందుకే అడుగుతున్నాను. మీ అభిప్రాయం చెప్పండి? "

"దీనికి సమాధానం చెప్పేముందు నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడగవచ్చా? "

"ఇంటర్వ్యూ చేస్తోంది నేను"

నవ్వేశాడు ఆదిత్య. "మీ ప్రశ్నకి సమాధానం మీ చేతే చెప్పించాలని తప్ప మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని కాదు"

"సరే అడగండి"

"మీకెంతమంది పిల్లలు? "

"ఇద్దరు"

"పిల్లలకి ఇవ్వటానికి చాక్లెట్ కొనాలనుకున్నారనుకోండి. ఒకరికి కొంటారా? ఇద్దరికీ కొంటారా? "

"ఇద్దరికీ కొంటాను"

"మరి ఈ ప్రపంచానికంతా దేవుడు తండ్రిలాంటి వాడయితే లోకంలో ఇన్ని అసమానతలెందుకు? "

"అదేం పోలికండీ! చాక్లెట్ అయితే సమంగా పంచగలం కానీ పిల్లల తెలివితేటలు, బుద్ధులు సమంగా పంచలేంగా? ఒకరు బాగా చదివి జిల్లాకలెక్టర్ కావచ్చు మరొకరు చదువు రాక బిల్లుకలెక్టర్ కూడా కాలేక పోవచ్చు" అతని మాటతో ఏకీభవించనట్లు అంది మాధవి.

"నిజమే! దేవుడనేవాడు ఉన్నట్లయితే ఈ తెలివితేటలు, జ్ఞానం కూడా ఆయన ఇచ్చేవే కదా! మరి ఒకరికి ఎక్కువ, ఇంకొకరికి తక్కువ ఎందుకు ఇవ్వాలి? "

"ఏమోనండి? మీ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పలేను. ఆస్తికులు, నాస్తికులు.. ఎవరి వాదన విన్నపుడు వారే కరెక్టనిపిస్తారు"

## కొత్తగాలి...



**అర్ధాంగి**
**రిజర్వేషన్లో గెలిచింది!**
**భర్తకి**
**ఉపాధి దొరికింది!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

"నేనే కరెక్టని చెప్పను. తప్పయితే సవరించుకోవటానికి సిద్ధంగా ఉన్నాను. మీరే ఆలోచించండి.. నిజంగా దేవుడు ఉంటే లోకంలో ఇంత ఆకలి ఎందుకుండాలి? అనారోగ్యం ఎందుకుండాలి? అసమానతలు ఎందుకుండాలి? ఇవన్నీ పూర్వజన్మలో చేసిన పాపఫలం అంటే నమ్మటానికి సిద్ధంగా లేను. ఒకవేళ అదే నిజం అనుకున్నా.. మనుషులు ఇన్ని పాపాలు చేస్తుంటే చూస్తూ ఊరుకుని, తరువాత జన్మలో శిక్షలు వేయటం న్యాయమెలా అవుతుంది? "

తన తల తిరిగిపోతున్నట్లు రెండుచేతుల మధ్యా తల పట్టుకుంది మాధవి. "ఏదో సినిమా కబుర్లు చెప్పుకుని పొట్ట పోసుకునే చిన్న జర్నలిస్టును నేను. నన్ను అనవసరంగా ఈ చర్చలోకి లాగకండి"

మళ్లీ నవ్వేశాడు ఆదిత్య. "నేను దేవుడిని తప్పు పట్టటం లేదు. చేతకానివాడు అంటున్నానంతే!"

"వ్వాట్? " పెద్దగా కేక పెడుతూ అంది మాధవి.

"చేతకాని వాడా..? "

"అవును. చేతకానివాడే! ఒక మంచి గృహిణి తన ఇంటిని చక్కదిద్దుకునేటంత నేర్పు కూడా ఆయనకి లేదు. ఒక మంచి వ్యాపారవేత్త వేలమంది ఉద్యోగులను ఎలా క్రమశిక్షణలో పెడతాడో చూసి నేర్చుకునే తెలివి లేదు. అన్నిటికీ మించి ఈ లోకాన్ని మరింత అందంగా, ఆహ్లాదంగా, బాధ్యతగా నిర్వహించాలన్న తపన లేదు. అందుకే నేను గుడికి వెళ్లను"

"దేవుడు కాక ఈ ప్రపంచాన్ని ఎవరు నడపాలంటారు? మీరయితే ఈ ప్రపంచాన్ని ఇంతకంటే మెరుగ్గా నిర్వహిస్తారా? "

"అనుమానం ఎందుకు? నూరుశాతం ఇప్పుడు ఈ ప్రపంచం నిర్వహించబడుతున్న తీరుకంటే బాగా నిర్వహిస్తాను" అంటున్న ఆదిత్య మాటల మధ్య అతని ఇల్లు వచ్చింది.

అందరూ కారు దిగారు.

"వీరిద్దరినీ ఇంటి దగ్గర డ్రాప్ చేసి నువు మీ ఇంటికి వెళ్ళు" తన కారు డ్రైవర్‌తో చెప్పాడు ఆదిత్య.

"అయ్యో! వద్దండీ.. మేము వెళ్ళగలం" అంది మాధవి.

"అలా మిమ్మల్ని ఒంటరిగా వదిలెయ్యటం ఆ దేవుడు చేసేపని. ఆదిత్య చేసే పనికాదు" అని నవ్వుతూ లోపలికెళ్లాడు.

★ ★ ★

తెల్లవారింది.

అయినా ఇంకా బద్ధకం వదలక కళ్ళు తెరవకుండా మంచం మీదే అటూ ఇటూ దొర్లుతున్నాడు ఆదిత్య.

ఇంతలో తనని ఎవరో తట్టినట్లనిపించి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. ఎదురుగా ఎవరో పరిచయం లేని వ్యక్తి నిలబడి ఉన్నాడు.

"హేయ్! ఎవరు నువ్వు? " తన పడక గదిలో కొత్తవ్యక్తిని చూసేటప్పటికి కలిగిన ఆశ్చర్యం నుండి తేరుకోలేక కేక వేసినట్లు అడిగాడు ఆదిత్య.

ఎదుటి వ్యక్తి ఏమాత్రం అలజడి లేకుండా "నాపేరు సహదేవుడు" అన్నాడు.

"నేను అడుగుతున్నది నీ పేరు కాదు. అసలు ఇక్కడకు ఎలా వచ్చావని? " గొంతులో కోపం ఉట్టిపడుతుంటే అన్నాడు ఆదిత్య.

ఇంతలో ఏదో అనుమానం వచ్చి అటూ ఇటూ చూశాడు. మంచంపైన తన పక్కన ఉండవలసిన సుమ లేదు. దాంతో అతని ఆందోళన మరింత ఎక్కువయింది.

అతని అనుమానం అర్థమైనట్లు "ఆమెను ఎవరూ ఎత్తుకుపోలేదు. నిద్రలేచి బయటకు వెళ్ళిందంతే!" చెప్పాడు సహదేవుడు.

ఎదుటివ్యక్తి మాట, ప్రవర్తన ప్రశాంతంగా ఉండటంతో ఆందోళన తగ్గించుకున్న ఆదిత్య లేచి కూర్చున్నాడు. "మా ఆవిడేమన్నా నిన్ను కొత్తగా పనిలోకి తీసుకుందా? " సహదేవుడ్ని పరీక్షగా చూస్తూ అడిగాడు.

ఆదిత్యకి ఎదుటి వ్యక్తిని చూస్తుంటే గట్టిగా కోప్పడాలనిపించటంలేదు. నల్లని జుట్టు నున్నగా దువ్వి ఉంది. పైన లాల్చీ, కింద పైజమా- తెల్లగా, వదులుగా వేలాడుతున్నాయి.

"లేదు. నన్నెవరూ పనిలోకి తీసుకోలేదు. నేనే వచ్చాను" క్లుప్తంగా చెప్పాడతను.

"మరి ఇలా అనుమతి లేకుండా లోపలకు ఎలా రాగలిగావ్? "

"నేను ఎక్కడికైనా వస్తాను. నన్ను దేవుడు పంపాడు"

"దేవుడా? ఆ పేరెప్పుడూ వినలేదే? ఎవరాయన? "

"దేవుడంటే నిజం దేవుడు" చేయి పైకి చూపిస్తూ చెప్పాడు అతను.

మొదటిసారి ఆదిత్యకి అనుమానం వచ్చింది, తనేమైనా పిచ్చోడితో మాట్లాడుతున్నానా? అని.

అతని మనసులో మాట అర్థమైనట్లు సహదేవుడు నవ్వి "నేను పిచ్చివాడిని కాదు.. అబద్ధం చెప్పటం లేదు. నిజంగా దేవుడు పంపితే వచ్చినవాడినే!" అన్నాడు.

అతని మాటలు విన్న ఆదిత్యకి ఇంకా నమ్మకం కలుగలేదు. 'అనుమానం లేదు, ఇతను పిచ్చివాడే' అనుకున్నాడు.

అందుకే కంగారు అణచుకుంటూ "సుబ్బయ్యా!" అని కేక పెట్టాడు.

సుబ్బయ్య అతని ఇంట్లో పనివాడు.

పరుగెత్తుకుంటూ వచ్చిన సుబ్బయ్యకి సహదేవుడ్ని చూపిస్తూ "ఇతన్ని బయటికి తీసుకువెళ్ళు" అన్నాడు ఆదిత్య.

ఆదిత్య చేత్తో చూపిస్తున్న వైపు చూసిన సుబ్బయ్యకి అక్కడ ఎవరూ కనపడలేదు. ఏమి జరుగుతుందో అర్థంకాక బిత్తరచూపులు చూస్తూ నిలబడ్డాడు సుబ్బయ్య.

"అతన్ని బెదరకొట్టకు. నేను ఎవరికీ కనపడను, నీకుతప్ప. అంతేకాదు, నా మాటలు కూడా ఎవరికీ వినపడవు" మళ్లీ చెప్పాడు సహదేవుడు.

"ఎందుకు స్వామీ! నాకే ఈ అదృష్టం కల్పించారు? " వ్యంగ్యంగా అడిగాడు ఆదిత్య.

"చెప్తాను, ముందు అతన్ని బయటకు పంపు"

గాలిలోకి చూస్తూ మాట్లాడుతున్న ఆదిత్యను విచిత్రంగా చూస్తూవుండిపోయాడు సుబ్బయ్య. సినిమా రిలీజ్ రోజు ఆదిత్య అతిగా స్పందించటం మామూలే! ఈరోజు అది మరీ శృతిమించినట్లు కనిపిస్తోంది. ఏమి చెయ్యాలో అర్థంకాక అలాగే నిలబడిపోయాడు సుబ్బయ్య.

జరుగుతున్న సంఘటన కల కాదని నిర్ధారణ చేసుకోవటానికన్నట్లు తనను తాను గట్టిగా గిచ్చి చూసుకున్నాడు ఆదిత్య. చురుక్కుమంది. అతను మెల్లగా సుబ్బయ్య వైపు తిరిగి "త్వరగా కాఫీ పట్టుకురా!" అన్నాడు.

ఇంతలో ఏదో గుర్తుకు వచ్చినట్లు "రెండు కప్పులు" అని చెప్పాడు.

బయటకు నడవబోతున్న సుబ్బయ్య మళ్ళీ ఒకసారి చుట్టూ గదినంతా పరీక్షగా చూసి, అక్కడ ఎవరూ లేరని కన్ఫర్మ్ చేసుకుని వెళ్ళిపోయాడు.

ఆదిత్యకి ఇంకా అయోమయంగానే ఉంది. దేవుడేమిటో.. తన దగ్గరికి ఇతన్ని పంపడమేమిటో.. అతనికి ఏమీ అర్థం కావటం లేదు.

అతని అసహనాన్ని ఇంకా పెంచుతూ, "నేను కాఫీ తాగను" దగ్గరలోని కుర్చీలో

కూర్చుంటూ అన్నాడు సహదేవుడు.

"మరేమి తాగుతారు? "

"నేనేమీ తాగను. నాకు ఆకలి వేయదు. నేను నీకోసం వచ్చాను. నువు లేచి బయలుదేరితే బయటకు వెళ్దాం"

"బయటికంటే ఎక్కడికి? "

"నీ ఇష్టం వచ్చిన చోటుకే వెళ్దాం"

"ఇంతకీ దేవుడు మిమ్మల్ని నా దగ్గరికి ఎందుకు పంపాడు? "

"ఈ లోకాన్ని నువ్వెలా మారుస్తావో చూసి, నేర్చుకు రమ్మని పంపారు"

"మీరేదో జోక్ చేస్తున్నారు. నేను లోకాన్ని మార్చటం ఏంటండీ!"

"రాత్రి అన్నావట కదా! ఒక ఛాన్సిస్తే ఈ లోకాన్ని దేవుడి పరిపాలన కంటే బాగా నడిపి చూపిస్తానని. అందుకే నీకు ఒక ఛాన్సిచ్చి, ఏమి చేస్తావో చూసి రమ్మని పంపారు"

"ఓహో! టీవీ ఛానెల్ నుండి వచ్చారన్న మాట. రాత్రి మాధవి చేసిన ఇంటర్వ్యూ చూసి వచ్చుంటారు! అవునా? "

"కాదు, నేను అసత్యం చెప్పను. దేవుడి దగ్గర నుండే వచ్చాను"

ఇంతలో సుబ్బయ్య రెండు కాఫీ కప్పులు పట్టుకు వచ్చాడు.

ఇంకా గాలితో చర్చని కొనసాగిస్తున్న ఆదిత్యని చూసి గట్టిగా నిట్టూర్చాడు సుబ్బయ్య.

ఒక కాఫీ కప్పు ఆదిత్యకి ఇచ్చి రెండో దాన్ని ఏమి చెయ్యాలో అర్థం కానట్లు పట్టుకుని నిలబడ్డాడు. అతని చేతులు వణుకుతుండటంతో కప్పు, సాసర్ కొట్టుకుని 'టకటక' శబ్దం వస్తోంది.

సహదేవుడి వైపు చూశాడు ఆదిత్య.

వద్దన్నట్లు తల అడ్డంగా ఊపాడు సహదేవుడు.

"దానిని నువ్వేతాగు" రెండో కప్పు చూపిస్తూ అన్నాడు ఆదిత్య.

సుబ్బయ్య చేతిలోని కప్పు చేస్తున్న శబ్దం ఇంకా ఎక్కువయింది. అయోమయంగా చూస్తూ భయం భయంగా ఆ కప్పు అలాగే పట్టుకుని బయటకు నడిచాడతడు.

ఆదిత్య మంచం మీద నుండి లేవకుండా కాఫీ సిప్ చేస్తూ "అయితే నిజంగా ఆ దేవుడే మిమ్మల్ని పంపాడంటారూ!" అన్నాడు.

"ఇంకా అనుమానం పోలేదా? "

"నేను అంత త్వరగా దేనినీ నమ్మను"

"రుజువు లేనిదే నువు దేనినీ నమ్మవు కదూ!" సాలోచనగా అన్నాడు సహదేవుడు.

"నిజంగా మీరు సహ'దేవుడే' అయితే రుజువు చెయ్యటం ఎంతసేపు చెప్పండి? " 'దేవుడే' అన్న మాటను ఒత్తి పలుకుతూ అన్నాడు ఆదిత్య.

ఆదిత్య పడుకుని ఉన్న మంచం పక్కనే ఒక టేబుల్ ఉంది. దాని మీద ఆ రోజు దినపత్రికలు పెట్టి ఉన్నాయి. అందులో ఒక దినపత్రిక తీసి వెనుక పేజీ చూశాడు సహదేవుడు. ఆ రోజు రిలీజవుతున్న ఆదిత్య నటించిన సినిమా తాలూకా ప్రకటన ఉంది.

"వీళ్ళు ఎవరు? " ఆ ప్రకటనలోని ఫొటోలను చూపిస్తూ అడిగాడు సహదేవుడు.

"హీరోయిన్, ప్రొడ్యూసర్, డైరెక్టర్.." చెప్పాడు ఆదిత్య.

"వారిలో ఎవరో ఒకరికి ఫోన్ చెయ్!"

"ఎందుకు? "

"చెయ్యి.. చెప్తాను"

"హీరోయిన్ నిద్ర లేచిందో లేదో తెలియదు. ప్రొడ్యూసర్ టెన్షన్‌తో నిద్రపోయాడో లేదో తెలియదు. అందుకని డైరెక్టర్‌కి చేస్తాను" నవ్వుతూ అని ఫోన్ డయల్ చేసి సహదేవుడి వైపు ప్రశ్నార్థకంగా 'తర్వాత ఏమిటి? ' అన్నట్లు

చూశాడు.

"అతని జేబులో నుండి చేతికి వచ్చిన నోటు తియ్యమను"

ఆదిత్య డైరెక్టర్‌తో అదే చెప్పాడు.

"దాని నెంబర్ చెప్పమను..."

అవతల పక్కనుండి డైరెక్టర్ నెంబర్ చెప్తున్నట్లున్నాడు. దానిని నోట్ చేసుకోవటానికి పెన్ను కోసం వెతుకుతున్నాడు ఆదిత్య.

"ఏమిటి వెతుకుతున్నావ్?"

"పెన్ను.."

"అక్కరలేదు. నీ అరచెయ్యి చూసుకో"

అరచెయ్యి చూసుకున్న ఆదిత్యకి అక్కడ ఒక నెంబర్ కనిపించింది. మరోసారి డైరెక్టర్‌ని నోటు నెంబర్ చెప్పమని, దానిని అరచేతిలో రాసుకోబోయాడు. కానీ ఆశ్చర్యం! అది తన చేతిలో ఉన్న నెంబరే!

ఆదిత్య అదెలా జరిగిందో అర్థంకాక నిజంగా ఆశ్చర్యపోయాడు.

"ఇప్పటికయినా నమ్మినట్లేనా?" అడిగాడు సహదేవుడు.

"ఇలాంటి ట్రిక్కులు ఇంద్రజాలికులు కూడా చేస్తారు"

విసుగ్గా తల అడ్డంగా ఊపాడు సహదేవుడు. "నువు నీ సమయాన్ని వృథా చేసుకుంటున్నావు. దేవుడు నీకు అపూర్వమయిన అవకాశం ఇచ్చాడు. దానిని ఉపయోగించుకుని నువు చేయాలనుకున్నది చేసి చూపించు" అన్నాడు.

ఆదిత్య మరి రెట్టించకుండా గబగబా తయారయి బయలుదేరాడు.

"ఇంత ఉదయాన్నే ఎక్కడికి వెళ్తున్నారు? ఇవాళ షూటింగ్ కూడా లేదుగా!" ఎప్పుడూ లేనిది అంత పొద్దున్నే బయటకు బయలుదేరిన భర్తను అడిగింది సుమ.

"నా సినిమా రిలీజ్ అవుతోందిగా! థియేటర్లో జనాల రెస్పాన్స్ చూసి వస్తాను" అని ఆమె రియాక్షన్‌కోసం ఆగకుండా

## 'చతుర'లో రెండో నవల



పుట్టగంటి గోపీకృష్ణ

గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని కొల్లూరులో 48 ఏళ్ల క్రితం జన్మించాను. సిండికేటు బ్యాంకులో ఉద్యోగం. ప్రస్తుతం డెప్యుటేషన్ మీద కడపలోని ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంకులో జనరల్ మేనేజర్‌గా వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాను.

ఇంతకుముందు 'పులిజూదం' నవల 'చతుర' జనవరి 2012 సంచికలో ప్రచురితమైంది. ఇప్పటి వరకు మొత్తం పది నవలలు రాశాను.

ఏ కళకయినా పరమావధి పదిమంది ఆదరణ పొందడం. కథ, నవలా సాహిత్యం ఏ రూపంలో ఉన్నప్పటికీ ఎక్కువమందిని చదివింపజేస్తేనే దాని ప్రథమ ధ్యేయం నెరవేరినట్లని నేను భావిస్తాను. అందుకే విషయం గంభీరమైనదైనా చదివించేందుకు కథనంలో సరళత్వాన్ని పాటించాను.

మృగ్యమైపోతున్న జీవజాతులకు ఇస్తున్న ప్రాధాన్యం, లుప్తమైపోతున్న మానవ విలువలకు ఇవ్వడంలేదన్న ఆందోళనతో రాసిన ఈ నవల ఎంతవరకు సఫలీకృతమయిందో పాఠకులే చెప్పాలి.

చిరునామా :
పుట్టగంటి గోపీకృష్ణ
ఫ్లాట్ నెం 205,
ద్వారక అపార్ట్‌మెంట్స్,
హిమాలయ హాస్పిటల్ ఎదురు,
యర్రముక్కపల్లి,
కడప - 516001

అక్కడ నుండి బయటపడ్డాడు ఆదిత్య.

అతన్ని అనుసరించాడు సహదేవుడు.

బ్రేక్‌ఫాస్ట్ కూడా చేయకుండా, డ్రైవర్నీ వద్దని, ఒంటరిగా బయటికెళ్తున్న ఆదిత్యని వింతగా చూస్తూండిపోయింది సుమ.

ఆదిత్యతో పాటే బయటకు వచ్చిన సహదేవుడు కారు ఎక్కాడు.

అతను తన పక్కన నడుస్తున్నా, కారు ఎక్కినా ఎవరూ అతన్ని గుర్తించకపోవటం మరొకసారి గమనించాడు ఆదిత్య.

కారు ముందుకు కదిలింది. "ఇప్పుడు చెప్పండి. మీరు ఎవరికీ ఎందుకు కనపడటంలేదు? " అడిగాడు ఆదిత్య.

"వారికి నా అవసరం కానీ, నాకు వారి అవసరం కానీ లేదు. అందుకే నేను వారికి కనపడటంలేదు"

"నాకూ మీ అవసరం కానీ, మీ దేవుడి అవసరం కానీ లేదు. ఆ సంగతి నేనెప్పుడూ దాచుకోలేదు. చెప్తూనే ఉన్నాను. మరి నాకెందుకు కనపడుతున్నారు? "

"ఇప్పుడు నేను వచ్చింది నీకు నా అవసరం ఉండి కాదు. దేవుడికి నీ అవసరం ఏర్పడింది. నీ మాటలు విన్న ఆయనకి, నిజంగా నువు ఈ ప్రపంచాన్ని తనకంటే బాగా నడపగలవేమో చూడాలనిపించింది"

"అప్పుడు ఆయనే రావచ్చు కదా!"

"ఆయనకు ఎలాంటి భేషజాలూ లేవు. నిన్ను నీవు నిరూపించుకుంటే ఆయనే వస్తాడు"

"ఓహ్! అయితే దేవుడు నిజంగా ఉన్నాడన్నమాట! అలా అయితే నిన్న నేను వేసిన ప్రశ్నలకు సమాధానం చెప్పండి. ఎందుకీ ఆకలి? అనారోగ్యం? అసమానతలు? " సాలోచనగా అన్నాడు ఆదిత్య.

"నీ సందేహాలన్నీ తీర్చటానికి నేను దేవుడ్ని కాదు. ఆయన పంపగా వచ్చిన సహాయకుడిని మాత్రమే!"

"మిమ్మల్ని మీరు అలా చెప్పుకుంటున్నా, మీరు నాలాంటి సామాన్యులయితే అయి ఉండరు. అలా అయితే దేవుడు తన తరపున పంపటానికి మిమ్మల్ని ఎన్నుకోడుగా! మీకు తెలిసిన సమాధానమే చెప్పండి"

"సరే, ప్రయత్నిస్తాను. అడుగు"

"ఈ లోకంలో ఆకలి, అసమానతలు ఎందుకుండాలి? దేవుడు వాటిని ఎందుకు పరిష్కరించడు? "

"దేవుడు అందరినీ సమంగానే సృష్టించాడు. ప్రతి జీవికీ ఆహారం సంపాదించుకునే శక్తి ఇచ్చాడు. సోమరులకు తప్ప ఆకలితో ఉండవలసిన అవసరం ఎవరికీ లేదు. అలాగే అసమానతలన్నీ మీరు సృష్టించుకున్నవే!"

"కాదనటం లేదు. మేము పొరపాట్లు చేస్తున్నాం. సరి చేయవలసిన బాధ్యత ఆయనకు లేదా? "

"ప్రతి మనిషి జీవితంలోకి చొచ్చుకు వచ్చి, దాని గతి మార్చటం ఆయనవల్ల కూడా కాదు. అందుకే ఆ పని చేస్తానన్న నిన్ను చూసి ముచ్చటపడ్డాడు"

"మొత్తానికి ఆయన్ని భలే సమర్థిస్తున్నారు. మీరు సరయిన అసిస్టెంటే! పేరు కూడా మీ పనికి సరిపోయేట్లు భలే పెట్టుకున్నారు!"

"వ్యర్థ ప్రసంగాలు ఆపి, పనిలోకి దిగితే బాగుంటుంది"

"అయితే నేను అడిగినట్లు ఒకరోజు నాకు అధికారం ఇస్తానన్నారా మీ దేవుడు? "

"అది చాలా ప్రమాదకరం. తెలిసీ తెలియక నువు పొరపాటు చేస్తే విలయానికి కారణం అవవచ్చు అందుకే ముందుగా ఏదో ఒకవ్యక్తి జీవితం మీద నీ ప్రయోగం చేయమన్నారు. ఒకే ఒకసారి ఈ శక్తిని ఉపయోగించి నువు కోరుకున్న వ్యక్తికి నువు కోరుకునే మార్పు ప్రసాదించమన్నారు. అది అతని జీవితాన్ని ఎలా

మారుస్తుందో మనిద్దరం గమనిద్దాం. అతని జీవితం నిజంగా మెరుగుపడిందని భావిస్తే, మిగిలినవారి విషయంలో కూడా నీ పద్ధతినే దేవుడు పాటిస్తాడు"

"మొత్తానికి ఒకేఒక్క ఛాన్సు ఇస్తానంటారు. అంతేనా? "

"అవును"

"తమ పదవులు వదులుకోవటానికి రాజకీయ నాయకులకు ఎందుకంత బాధో ఇంతకుముందు అర్ధమయ్యేది కాదు. ఆఖరికి దేవుడు కూడా ఒక్కరోజు తన పదవి వదులుకోవటానికి ఇష్టపడటం లేదంటే.. నిజంగా పదవిలో ఏదో మత్తు ఉంది"

"దేవుడ్ని వెటకారం చెయ్యకు. నిన్ను నీవు నిరూపించుకున్న మరుక్షణం నిన్నే దేవుడ్ని చెయ్యటానికి కూడా ఆయన సంకోచించడు" కాస్త కోపంగా చెప్పాడు సహదేవుడు.

ఆదిత్య ఏదో వాదించబోయాడు. కానీ అప్పటికే కారు బిజీగా ఉండే సెంటర్లోకి ప్రవేశించింది. ట్రాఫిక్ లైటు ఎర్రగా మారటంతో వారు ప్రయాణిస్తున్న కారు నాలుగురోడ్ల కూడలిలో ఆగింది. కారు నాలుగు వైపులా నల్లటి అద్దాలు బిగించి ఉండటంతో ఎవరూ ఆదిత్యని గుర్తుపట్టలేదు.

ఆదిత్య తన టార్గెట్‌గా ఎవరిని ఎంచుకోవాలా అని ఆలోచిస్తున్నాడు. ఆ మేలేదో తన వారికో, తనకి తెలిసిన వారికో చేస్తే.. అందరూ తనని స్వార్ధపరుడనుకునే అవకాశం ఉంది. అందుకే ఆ వ్యక్తి పూర్తి అపరిచితుడయితే బాగుంటుందన్న నిర్ణయానికి అతను వచ్చాడు.

అతని ఆలోచనలను భగ్నం చేస్తూ సహదేవుడు కల్పించుకున్నాడు. "అనవసరపు ఆలోచనలు మాని చేయవలసిన పని చూడు" రెట్టించాడు సహదేవుడు.

"అదే ఆలోచిస్తున్నాను.. మీరిచ్చిన మంత్రాన్ని ఎవరిమీద ప్రయోగించాలా అని" మంత్రం వేస్తున్నట్లు చెయ్యి ఊపుతూ అన్నాడు ఆదిత్య.

ఇంతలో సిగ్నల్ క్లియర్ కావటంతో కారు మరలా బయలుదేరింది.

"కారుని పక్కకు తీసి ఆపు. దానిని నడిపే హడావుడిలో ఆలోచనలేమి వస్తయ్!" సలహా చెప్పాడు సహదేవుడు.

"ఆ పనే చెయ్యాలి" అంటున్న ఆదిత్యకి నిన్న తనభార్యని తీసుకురావటానికి వెళ్లిన గుడి కనిపించింది. దాని ఆవరణ విశాలంగా కారు ఆపటానికి అనువుగా ఉంటుందనిపించి కారు అటు నడిపి, గుడి బయట ఆపాడు.

గుడికి ఎదురుగా రోడ్డుకి మరొక వైపున పెద్ద పార్కు ఉంది. అక్కడ మార్నింగ్ వాకర్స్ హడావుడి ఇంకా తగ్గలేదు. రోడ్డుకి రెండు వైపులా పెద్ద పెద్ద హోర్డింగుల మీద అందమయిన ప్రకటనలు కళ్ళని ఆకర్షిస్తున్నాయి. గుడిలో నుండి మంత్రాలు వినిపిస్తున్నాయి.

"నేను ఎవర్నికైనా మేలు చేయవచ్చు కదా!"

"భేషుగ్గా!"

ఆదిత్య దృష్టి దేవాలయం మెట్ల దగ్గర కూర్చుని అడుక్కుంటున్న బిచ్చగాడిమీద పడింది. నేల మీద గోనె పట్టా పరచుకుని

## కొత్తగాలి...

**నాటి భారతంలో**
**ఒక్కడే కీచకుడు**
**నేటి భారతంలో**
**అడుగడుగునా కీచకులే!**

– మేరెడ్డి యాదగిరిరెడ్డి,
నల్గొండ

దాని మీద కూర్చున్నాడు అతను. తన వృత్తికి చిహ్నలు అన్నట్లు కాసిని నాణేలు పట్టా మీద పరిచాడు. గుడిలోకి వెళ్ళే భక్తులు వేస్తున్న డబ్బుల్ని ఎప్పటికప్పుడు పట్టా పొరల మధ్యకి తోస్తున్నాడు. అతడి గడ్డం పెరిగి ఉంది. జుట్టు తైల సంస్కారం లేక ఎర్రగా మారింది. అతని దుస్తులు మాసిపోయి చీలికలు పీలికలయి ఉన్నాయి.

ఠక్కున ఆదిత్యకి అతన్ని నిన్న తన కారులో నుండి చాలాసేపు పరిశీలించిన విషయం గుర్తుకు వచ్చింది. అప్పుడు ఇతనికి సహాయం చేయాలన్న ఆలోచన రావటం కూడా గుర్తుకు వచ్చింది.

వెంటనే నిర్ణయం తీసుకున్నాడు ఆదిత్య. తన వేలు ఆ బిచ్చగాడి వైపు చూపించి "అతనికి సహాయం చేద్దాం" అన్నాడు.

"ఏమి చేస్తావ్? "

"నిన్న నేను దేవుడ్ని వ్యతిరేకించటానికి మూడు కారణాలు చెప్పాను. ఆకలి, అనారోగ్యం, అసమానతలు. అతనికి అవి మూడూ లేకుండా చేస్తాను"

"అదే ఎలా చేస్తావని అడుగుతున్నా"

"ముందు డబ్బు ఇస్తాను. దాని ద్వారా అతని ఆకలి సమస్య తీరుతుంది"

"తర్వాత? "

"తర్వాత కాసింత ఆరోగ్యం, మరికొంత తెలివితేటలు ఇస్తాను. దానితో అతని జీవితం ఎలా మారుతుందో మీరే చూద్దురు"

సహదేవుడు ఏమీ మాట్లాడలేదు. "నీ ఇష్టం" అని మాత్రం అన్నాడు.

"సరే! ఇక తేలవలసిన మరో విషయం డబ్బు ఎంత ఇవ్వాలి? " అని తనలో తను అనుకుంటున్నట్లు పైకే అన్నాడు ఆదిత్య.

"ఇంత డబ్బు కంటే ఎక్కువ ఇవ్వకూడదని మీకేమైనా హద్దు ఉందా? " అని సహదేవుడిని అడిగాడు తనే మళ్లీ.

"అదేమీ లేదు"

ఆదిత్య సీరియస్‌గా ఆలోచించసాగాడు- ఆ బిచ్చగాడికి ఎంత డబ్బు ఇస్తే సరిపోతుందా.. అని.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? " అడిగాడు సహదేవుడు.

"కౌన్ బనేగా కరోడ్‌పతి ప్రోగ్రామ్‌లో అమితాబ్‌లాగా నన్ను లోపల లోపల ఆలోచించుకోనివ్వరా.. ఏంటి? ఏమిటి ఆలోచిస్తున్నావని వెంటబడతారే? "

"సరే! అయితే నీ ఇష్టం వచ్చినంతసేపు ఆలోచించుకో!" నిష్ఠూరంగా అన్నాడు సహదేవుడు.

"మీరు మళ్ళీ 'ఫీల్' అవకండి. వాడికి ఎంత ఇస్తే సరిపోతుందా? అని ఆలోచిస్తున్నాను" అని ఒక నిమిషం ఆగి, తుది నిర్ణయానికి వచ్చినట్లు తల ఊపి, "వాడికి ఒక లక్ష ఇద్దామండీ" అన్నాడు ఆదిత్య.

"అంతేనా? సరిపోతుందా? "

"అబ్బో! అదే ఎక్కువ. అతి సర్వత్రా వర్జయేత్.. అన్నారుగా!"

"బాగా ఆలోచించుకో! తరువాత మార్చుకోవటం కుదరదు"

"నెలల తరబడి తిండికి మొహం వాచి ఉన్నవాడికి ఒక్కసారిగా పంచభక్ష్య పరమాన్నాలు పెడితే పొట్ట పగిలి ఛస్తాడు. లక్ష చాలు"

"సరే! ఆ లక్ష ఎక్కడి నుండి సంపాదిద్దామో.. చెప్పు" అన్నాడు సహదేవుడు.

"సంపాదించటమేమిటి? "

"దేవుడయినా డబ్బు ఎక్కడినుండి తెస్తాడు? నువ్వు చెప్పిన వాడికి ఇవ్వాలంటే మరెక్కడి నుండయినా తియ్యాల్సిందే"

"అదేంటి దేవుడు కూడా డబ్బు పుట్టించలేడా? "

"అలా పుట్టించే వీలే ఉంటే కుబేరుడి దగ్గర అప్పుచేసి ఏడుకొండల మీద ఎందుకు ఇరుక్కుపోతాడు? "

"దేవుడు ఇంత 'వీక్' అనుకోలేదే!"

"మీ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ చెప్పలా- పదార్థాన్ని సృష్టించలేము, నాశనం చెయ్యలేము.. అని. మరి పదార్థాల్నే సృష్టించలేనప్పుడు డబ్బెలా సృష్టించగలం? "

"మరేం చెయ్యాలి? "

"మార్గం మీరే ఏర్పరుచుకున్నారుగా! బెగ్, బారో, స్టీల్! అని"

ఈలోపు ఆదిత్య చుట్టూ పరికించి చూశాడు. రోడ్డుపక్కన ఉన్న హోర్డింగుల్లో అత్యంత ఆకర్షణీయంగా కనిపిస్తోంది స్కైలైన్ ఎయిర్‌లైన్స్ వారి ప్రకటన. ఆదిత్యకి కూడా ఆ ఎయిర్‌లైన్స్‌కి చెందిన విమానాలలో ప్రయాణం చేయడమంటే భలే ఇష్టం. అందమయిన ఎయిర్‌హోస్టెస్‌లు ఆకర్షణీయమైన యూనిఫాం ధరించి నమ్రతగా స్వాగతం పలుకుతుంటే స్వర్గానికి బెత్తెడు కింద ఉన్నట్లుంటుంది. దాని ఛైర్మన్ మల్హోత్రాని అపర కుబేరుడని అందరూ చెప్పుకుంటూ ఉంటారు. ఈరోజు స్విట్జర్లాండ్‌లో స్కీయింగ్ చేస్తూ కనిపిస్తే, మరుసటి రోజు వెనిస్‌లో బోటు షికారు చేస్తూ కనిపిస్తాడు. అతని గురించి విన్న ప్రతిసారీ 'పుడితే వచ్చే జన్మలో అలా పుట్టాలి' అనుకుంటూ ఉంటాడు ఆదిత్య. అలాంటి మల్హోత్రాకి లక్ష రూపాయలన్నది హోటల్లో వెయిటర్‌కి ఇచ్చే టిప్పులాంటిదని ఆదిత్య అభిప్రాయం.

అందుకే ఆదిత్య ఆ హోర్డింగ్‌వైపు చెయ్యి చూపించాడు. "అక్కడ తగ్గించి, ఇక్కడ పెంచాలి" అన్నాడు బిచ్చగాడిని చూపిస్తూ.

"బాగా ఆలోచించుకున్నావా ఆదిత్యా? " ఆఖరి అవకాశం ఇస్తున్నట్లు అడిగాడు సహదేవుడు.

"కన్ఫ్యూజ్ చెయ్యకండి. ఒక అట్టడుగు వర్గపు మనిషికి సాయం చేస్తున్నాం. అత్యంత ధనవంతుడి నుండి కొంత తీసుకుంటున్నాం. ఇందులో అంత ఆలోచించవలసింది ఏముంది? ఇలా ప్రతి పనికి మీనమేషాలు లెక్కపెట్టబట్టే మీ దేవుడికి ఇలాంటి చిన్న చిన్న సాయాలు చేసే తీరిక కూడా లేకుండా పోతోంది"

మరి మాట్లాడకుండా కళ్ళు మూసుకుని ఏవో నాలుగు మంత్రాలు చదివాడు సహదేవుడు. తరువాత తనవైపు ఆశ్చర్యంగా చూస్తున్న ఆదిత్యను ఉద్దేశించి "అయిపోయింది" అన్నాడు.

"వెరీగుడ్! ఈ పని మాత్రం త్వరగానే చేశారు. ఇక మిగిలింది అతనికి కాస్త ఆరోగ్యం, తెలివితేటలు ఇవ్వడమే. అప్పుడే ఆ డబ్బు అతనికి ఉపయోగపడుతుంది"

"అవి కూడా ఎక్కడ నుండి తగ్గించాలో నువ్వే నిర్ణయించు"

"అదొకటి ఉంది కదూ!" అని మళ్ళీ చుట్టూ పరికించి చూశాడు. రోడ్డు మధ్య ఫ్లైఓవర్ కట్టడానికి గోతులు తవ్వుతున్నారు. బారికేడ్లు పెట్టి ట్రాఫిక్‌ని పక్కకి పంపుతున్నారు. బారికేడ్ల మీద ఆ పనులు చేస్తున్న ఇంజినీరింగ్ కంపెనీ పేరు ప్రముఖంగా రాసి ఉంది.

పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ అనేది దేశంలో పెద్ద ఇంజినీరింగ్ కంపెనీ. ఎన్నో ప్రతిష్టాత్మక ప్రాజెక్టులు చేపట్టి విజయవంతంగా పూర్తి చేసింది. ఈ మధ్య ఆ కంపెనీ పేరు అన్ని పేపర్లలోనూ ఎక్కువగా కనిపిస్తోంది. కారణం దాని ఫౌండర్ ప్రెసిడెంట్ అనారోగ్యంతో ఉన్నారన్న వార్తలు.

ఆ కంపెనీ ప్రెసిడెంట్ పేరు ప్రకాష్ సింగ్. వయోవృద్ధుడు. ప్రస్తుతం అనారోగ్యంతో ఆసుపత్రిలో ఉన్నాడు. ఆ కంపెనీ పేరు చూడగానే ఆ వివరాలన్నీ ఫ్లాష్ లాగా ఆదిత్య బుర్రలో తిరిగాయి.

"ఆ కంపెనీ ప్రెసిడెంట్ ప్రకాష్ సింగ్ ఆరోగ్యం కొంత తగ్గించి ఇతనికి ఇద్దాము" అన్నాడు ఆదిత్య.

ఆశ్చర్యపోయాడు సహదేవుడు. "ఆయన ఇప్పటికే అనారోగ్యంతో బాధపడుతున్నాడు. ఆయన ఆరోగ్యం చెడగొడతావా? " సందేహంగా అన్నాడు.

"అందుకే చెప్తున్నాను. ఆయన తన జీవితాన్ని సంపూర్తిగా జీవించాడు. ఇంకెంత కాలం బతుకుతాడు చెప్పండి? అయినా దేశంలోనే గొప్ప డాక్టర్ల పర్యవేక్షణలో ఉన్నాడు. ఆయనకి కాస్త అనారోగ్యం పెరిగినా ఏమీ కాదు. అదే ఇతనికి ఆరోగ్యం సరిగ్గా లేకపోతే మనం డబ్బిచ్చి ఏమి లాభం? " అన్నాడు ఆదిత్య ఖళ్ళు ఖళ్ళుమని దగ్గుతున్న బిచ్చగాడిని జాలిగా చూస్తూ!

"నేను నీకు అడ్డు చెప్పటానికి రాలేదు. నిర్ణయం నీదే! అమలు చెయ్యటమే నా వంతు. చెప్పు! చెయ్యమంటావా? "

"చెయ్యండి"

మరి కొన్ని క్షణాల్లో ఆ పని కూడా పూర్తి చేశాడు సహదేవుడు.

"ఇక మిగిలింది ఇతనికి కొంచెం జ్ఞానం కలిగించాలి. సర్వ అసమానతలకూ మూలం అజ్ఞానం అన్నది నా నమ్మకం."

"మరి అదెక్కడ నుండి తెస్తావ్? నీది కొంచెం ఇవ్వరాదూ!"

"అక్కర్లేదు. నాకంటే తెలివిగల వారు ఈ ప్రపంచంలో చాలా మంది ఉన్నారు"

"ఎవరో వాళ్ళు? "

"ఈ మధ్య మా రాష్ట్రంలో అత్యంత తెలివితేటలు కలిగిన వ్యక్తిగా పేరుపొందింది ఎవరో తెలుసా? "

"ఎవరు? "

"మా రాష్ట్ర ముఖ్యమంత్రి మహేష్! అతని దగ్గరున్న అపారమయిన తెలివితేటల్లో కొంత ఇతనికి సరఫరా చెయ్యండి"

ఈసారి ఏ కామెంటూ లేకుండా పని పూర్తి చేశాడు సహదేవుడు.

"అయిపోయిందా? " అడిగాడు ఆదిత్య.

"ఆహా! అయిపోయింది"

"ఇంత సులభమా? మరి ఇన్ని శక్తులు ఉంచుకుని ఉపయోగించుకోకుండా దాచుకుంటే ఎవరికి లాభం? ..."

వారిద్దరూ మాట్లాడుకుంటుండగానే బిచ్చగాడు దేనినో చేతిలో పట్టుకుని గోనె పట్టా మడతల మధ్యకి తొయ్యటం కనిపించింది.

ఆదిత్య తల తిప్పి సహదేవుడి వైపు చూశాడు. సహదేవుడు కూడా అతనికి దొరికింది డబ్బే అన్నట్లు తల ఆడించాడు.

"తర్వాత మన ప్రోగ్రాం ఏంటి గురువుగారూ! వచ్చిన పని అయిపోయిందిగా? " అన్నాడు ఆదిత్య.

"పనెక్కడ పూర్తయింది? ఇప్పుడే మొదలయింది. ఇక నుండి ఇతన్ని అనుసరిస్తూ, నువ్విచ్చిన డబ్బు వలన అతని జీవితం ఎంత మెరుగయిందో చూడవద్దూ? "

"మెరుగుకాక ఛస్తుందటండీ! దానికోసం మన పనులు మానుకుని వాడి వెంట పడాలా? ఇప్పటికే నా పనులెన్నో పెండింగులో పడిపోయాయి"

"ఏమిటి నీ పనులు? నువు నటించిన సినిమా చూసి జనాలు ఎలా చప్పట్లు కొడుతున్నారో చూసుకోవటమేగా? "

"మీరు కూడా వ్యంగ్య బాణాలు విసురుతున్నారే!" నవ్వుతూ అన్నాడు ఆదిత్య.

"మరే! నీ మాటలు చూస్తే అలాగే అనాలనిపిస్తుంది. నాలుగు రోజులు ఆడే సినిమాలో నటించిన నీకే తీరిక ఉండదు. సృష్టినంతా చూసుకోవలసిన భగవంతుడికి మాత్రం పనేముంటుంది అంటావ్!"

ఆదిత్య ఏమీ సమాధానం చెప్పలేదు.

ఇంతలో బిచ్చగాడు తన బిచాణా ఎత్తుతున్నట్లు అక్కడ నుండి లేచాడు.

"మనం అతడిని ఎలా అనుసరించాలి గురువుగారూ? అతడేమో కాలి నడకన వెళ్తాడు. మనమేమో కారులో.."

"నువ్వు కూడా కారుదిగి బయటకు రా!" అన్నాడు సహదేవుడు తను కారు దిగుతూ.

"నేనా? కిందకు దిగటమా? నేను కిందకి దిగితే జనమంతా చుట్టూ మూగుతారు. మనం ఎటూ వెళ్ళలేం"

"దిగవయ్యా ముందు" అంటూ ఆదిత్య చెయ్యి పట్టుకుని బలవంతంగా కారు దించాడు సహదేవుడు. "ఇక పద, అతన్ని అనుసరిద్దాం" అంటూ ముందుకి కదిలాడు.

ఆదిత్యకి అతన్ని అనుసరించక తప్పలేదు.

అయితే ఆదిత్యని ఆశ్చర్యపరుస్తూ రోడ్డు మీద నడుస్తున్న వ్యక్తులెవరూ తనని గుర్తుపట్టిన సూచనలేమీ కనపడలేదు. అతని పక్కగా నడుచుకుంటూ వెళ్తున్న వ్యక్తులు కూడా ఏమాత్రం పట్టించుకోకుండా వెళ్ళిపోతున్నారు.

"ఏమిటీ వింత? నగరం నడిబొడ్డున నన్ను గుర్తించకపోవటమా? " ఆశ్చర్యంగా అన్నాడు ఆదిత్య.

"నీకే ఇలా ఉంటే.. ఆ సర్వాంతర్యామిని పట్టించుకోకుండా ఇన్ని కోట్ల మంది జనం ఇలా తిరుగుతుంటే, ఆయనకు ఎలా ఉండాలి? "

"మీరు ప్రతిదానికీ ఆయనతో నాకు పోలిక పెట్టకండి. అంతగా ఆయనకు గుర్తింపు కావాలంటే ఏదైనా గుడికి వెళ్ళమనండి. భక్తులతో కిటకిటలాడుతుంటయ్!"

"అలా అయితే నువ్వు మాత్రం రోడ్డు మీద గుర్తింపు కోరుకోవటం ఎందుకు? నిన్ను కావాలనుకున్న వారు థియేటర్‌కి వస్తారు. నువ్వు కూడా అక్కడకు వెళ్ళు"

"వెళ్తాను లెండి. అయినా నా ఫాలోయింగ్ గురించి మీకు తెలియదు. నేను ఎక్కడికి వెళ్ళినా గుంపులు గుంపులుగా ఎగబడతారు. అలాంటిది, ఇలా జరుగుతుందంటే.. మీరే ఏదో చేశారు" నిష్ఠూరంగా అన్నాడు ఆదిత్య.

"అంత బెంగ వద్దులే! ఇప్పుడు నువ్వు కూడా నాలాగే ఎవరికీ కనపడటం లేదు. అందుకే ఎవరూ నీ ఉనికిని గుర్తించటం లేదు. ఇక నిర్భయంగా పద" అంటూ ఆదిత్యని తీసుకుని బిచ్చగాడిని అనుసరించాడు సహదేవుడు.




**అ**ప్పటిదాకా బిచ్చగాడిగా ఉన్న వ్యక్తి పేరు 'నారిగాడు'. అసలు పేరు బహుశా నారాయణ అయ్యుండవచ్చు. అతనికి ఊహ తెలిసిన దగ్గర నుండి అందరూ అతన్ని పిలిచే పేరు మాత్రం నారిగాడే!

నారిగాడికి తను ఈ వృత్తిలోకి ఎలా వచ్చాడో గుర్తులేదు. ఎన్నిసార్లు ఎంత ఆలోచించినా తనని ఎవరూ పెంచినట్లు అతనికి గుర్తు వచ్చేది కాదు.

ఎలా గుర్తు వస్తుంది? కన్నతల్లి అతడ్ని పసిగుడ్డుగా ఉన్నపుడే యాభై రూపాయలకు అమ్మేసింది. ఏ పెంటకుప్పలోనో పారేయకుండా అమ్మకానికి పెట్టటం ద్వారా ఆమె పరోక్షంగా అతడికి మరో జన్మనిచ్చింది.

కొనుక్కున్న స్త్రీ ఆ పసివాడిని మండు టెండల్లో మాడుస్తూ జనాలకి ప్రదర్శించి అడుక్కునేది. 'వ్యాపారంలో ఎప్పుడూ పెట్టిన పెట్టుబడే కీలకం' అనే సూత్రాన్ని బాగా ఒంటపట్టిచ్చుకున్నందువలన ఆ పసివాడు బతికి ఉండటానికి అవసరమయిన పోషణ మాత్రమే జరిపేది. దాని వలన ఇంకో లాభం కూడా ఉంది. పసివాడు ఎంత బరువు తక్కువ ఉంటే ఎత్తుకుని తిరగటం అంత తేలిక.

తరువాత పసివాడి వయసు పెరిగింది. వయసుతో పాటు వాడు ఎదగటం మొదలు పెట్టాడు. వాడు పెరిగేకొద్దీ ఆమెకు వాడిని చంకనేసుకుని తిరగటం కష్టం అయింది. కొన్నాళ్ళు వాడిని చెప్పుల్లేకుండా నడిపిస్తూ సానుభూతి సంపాదించే ప్రయత్నం చేసింది. సానుభూతి పెరిగేకొద్దీ రాలే డబ్బు పెరుగుతుందని ఆమెకి తెలుసు.

వాడికి నాలుగేళ్ళు వచ్చేటప్పటికి ఇక ఏ రకంగానూ పిల్లవాడి ఉపయోగం కనపడక వాడిని ఒక గుడ్డితాతకు అయిదు వందలకు అమ్మింది.

ఆ విధంగా నాలుగేళ్ల పసివాడు అప్పటి దాకా ఆమెకు ఉపయోగపడటమే కాకుండా వాడి మీద ఆమె పెట్టిన పెట్టుబడిని పదిరెట్లు పెంచి ఇచ్చాడు.

నడవటం పూర్తిగా రాకముందే నడుస్తున్న రైల్లో గుడ్డితాత కర్ర పట్టుకుని అతనికి దారి చూపించే బాధ్యత నారిగాడి నెత్తి మీద పడింది. అసలు తనెవరో.. తనకీ, ఆ ముసలి తాతకీ సంబంధం ఏమిటో తెలియకుండానే ఆ డ్యూటీలో ఇమిడిపోయాడు వాడు. ముసలివ్యక్తిని అందరూ 'తాత' అంటుంటే తనూ 'తాత' అని పిలవటం మొదలుపెట్టాడు.

నారిగాడికి తను చేస్తున్న పని నిరాసక్తంగా తోచేది. వచ్చిన నాలుగు పాటల్ని మార్చి మార్చి కర్ణకఠోరంగా పాడే తాతకి జనాలు డబ్బులు వేసేది పాటలోని మాధుర్యానికి కాదనీ, అతన్ని త్వరగా తమ నుండి దూరంగా తరిమెయ్యటానికనీ నెమ్మది నెమ్మదిగా అర్థమయ్యింది.

ఆ ముసలి తాత గొంతే కాదు, మనసు కూడా మొద్దుబారి చాలా రోజులయింది. చిన్న పిల్లవాడన్న కనికరం నారిగాడి మీద అసలు ఉండేది కాదు. మాటమాటకీ నెత్తిన మొట్టికాయలు వేస్తూనే ఉండేవాడు. వాడికి ముసలి తాత పెట్టే తిండి కంటే మొట్టికాయలు తినటమే ఎక్కువయింది. అయినా ఆ ముసలి తాతను వదలాలన్న ఆలోచన పదేళ్ళ వయసుకి కానీ రాలేదు నారిగాడికి.

ఈలోపు వాడు తను చేసే పనిలో చాలా సులువులు నేర్చుకోవటం మొదలు పెట్టాడు. అందంగా, ముద్దుగా ఉన్న చిన్న పిల్లలు ఎక్కువగా ఉన్న బోగీల్లో అవసరానికి మించి వారి దగ్గర తచ్చాట్లాడితే, ఆ పిల్లల తల్లిదండ్రులు ఎంతో కొంత తప్పకుండా విదిలిస్తారన్నది వాడు కనిపెట్టిన మొదటి సూత్రం. అమ్మాయిలకు బీటు కొట్టే యువకులు ఆడపిల్లల సానుభూతి సంపాదించటానికి ఒకింత ఎక్కువే ఇస్తారన్నది రెండో సూత్రం. అలాగే ఎవరైనా తింటున్నప్పుడు వారి ముందు నిలబడి తదేకంగా చూస్తే ఈ దరిద్రాన్ని తప్పించుకోవటానికైనా కాసింత రాలుస్తారన్నది మూడో సూత్రం.

ఇలాంటి సూత్రాలనెన్నిటినో నారిగాడు తన స్వానుభవంతో నేర్చుకున్నాడు. ఎన్ని నేర్చుకున్నా ముసలితాతను మెప్పించే నేర్పు మాత్రం ఒంటబట్టించుకోలేకపోయాడు. ఆ ముసలోడు వచ్చిన డబ్బులో పైసా కూడా నారిగాడికి వదలకుండా అన్నీ తనే దాచుకునేవాడు.

నారిగాడికి తల్లి, తండ్రీ ఎలాగూ తెలి





యదు. ఉన్న ఒక్క తాత తనంటే ఎందుకు విరుచుకుపడతాడో అర్థమయ్యేది కాదు. ఇంతలో అతనికి తాతలు రెండు రకాలని తెలిసింది. ఒకరు అమ్మకు నాన్న, మరొకరు నాన్నకు నాన్న. ఈ తాత తన కెలాంటి తాతో తెలుసుకోవాలని అతన్నే అడిగాడు నారిగాడు.

"నిన్ను సొమ్ములిచ్చి కొనుక్కున్న తాత నిరా!" నోరు జారి చెప్పాడు ఆ గుడ్డితాత.

ఎలాగూ రహస్యం తెలిసి పోయిందను కున్న తర్వాత పూర్తిగా వివరించాడు. "ఒరేయ్! మనం సంపాదించే డబ్బులో నీకు పైసా కూడా రాల్చకుండా మొత్తం నేనే దాసుకునేది ఎందుకో తెలుసా? ఇవాళ కాకపోతే రేపు నువ్వు నా దగ్గర నుండి ఎళ్ళిపోతావని తెలుసు. అప్పుడు మళ్ళీ నీలాంటోడిని కొనుక్కోవాలంటే కావ లసింది డబ్బేరా!"

దానితో రెండు విషయాలు అర్థమ య్యాయి నారిగాడికి. తామిద్దరిదీ డబ్బు సంబంధమే తప్ప రక్త సంబంధం కాదనీ, తను బానిసలాగా ఇంకా ముసలాడి కింద పడి ఉండటానికి కారణం తన చేతకానిత నమే తప్ప మరేమీ కాదనీ.

తను ఎప్పుడు వెళ్ళిపోయినా మరో దారి ఏర్పాటు చేసుకోవటానికి కావలసిన వన రులు ముసలోడి దగ్గర చాలానే ఉన్నాయి.

మరి తనెందుకు ఇంకా ఈ చూరు పట్టు కుని వేలాడుతున్నాడు?

ఆ ఆలోచన వచ్చిన వెంటనే అతను రైలెక్కాడు.

నగరానికి చేరిన అతనికి రైల్వేస్టేషన్ మినీ ప్రపంచంలా అనిపించింది. అక్కడ తనలాంటివారు చాలామంది ఉన్నారు.

హఠాత్తుగా వచ్చిన స్వేచ్ఛ అతనికి ఆనందాన్నిచ్చింది. సంపాదించిన నాలుగు డబ్బులు బీడీలు తగలెయ్యటానికి వాడగ లిగే తెగింపు వచ్చింది. వైట్‌నర్ ఫ్లూయిడ్ వాసన పీల్చి లోకాన్ని మరచిపోగలిగే విశృంఖలత వచ్చింది. పాతికేళ్ళు రాకుం డానే ఊపిరితిత్తులకు రంధ్రాలు పడి ఆయాసంతో ఎగశ్వాస వస్తున్నా పట్టించు కోని వైరాగ్యం వచ్చింది.

ఆరోగ్యం మరీ దిగజారుతుండటంతో అతను రైల్వే స్టేషన్ వాతావరణం నుండి బయటపడి నగరంలోని గుడి దగ్గరకు వచ్చాడు. అప్పటినుండి అదే అతని అడ్డా.

ఇక్కడ అంతా బానే ఉందికానీ, ఆ ఏరియా బిచ్చగాళ్ళని కంట్రోల్ చేసే శంకర్ రౌడీయిజం బాగా ఎక్కువగా ఉం ది. వాడు అడిగినంత మొత్తం రోజువారీ చెల్లిస్తేనే ఏ బిచ్చగాడయినా అక్కడ బతికి బట్టకట్టగలుగుతాడు. అయినా నారిగాడిది ఎవరికీ ఎదురు తిరిగే మనస్తత్వం కాకపో వటంతో అతను పెద్ద ఇబ్బందులు లేకుం డానే రోజులు లాక్కొస్తున్నాడు.

ఈరోజు జరిగిన సంఘటనని నారిగాడు అసలు నమ్మలేకపోతున్నాడు.

అప్పటివరకు లేని ఒక నోట్లకట్ట తటా లున వచ్చి తన పక్కన పడింది. అన్నీ కొత్త వెయ్యి రూపాయలు ఉన్న నోట్ల కట్ట అది. అసలు అతను అప్పటివరకు వెయ్యి రూపాయల నోటు చేతితో పట్టుకు చూడటం ఇదే మొదటిసారి. అలాంటిది కట్ట కట్ట వచ్చి పక్కన పడింది. పోనీ ఎవ రయినా పోగొట్టుకున్నారా అంటే.. ఆ డబ్బుల కట్ట తనకి దొరికినప్పుడు దరిదా పుల్లో మనుషులెవరూ లేరు. చటుక్కున పక్కన ఉన్న మిగతా బిచ్చగాళ్ళు దానిని చూసేలోపు ఆ నోట్లకట్టని గోనెపట్టా కిందకి తోసేశాడు నారిగాడు.

దడదడలాడే గుండెలను అదుపులో పెట్టుకోవటానికి చేస్తున్న అతని ప్రయత్నం ఫలించటంలేదు. భయంతో చెమటలు పడుతున్నాయి. ఎప్పుడు ఎవరు

వచ్చి ఆ డబ్బు నాదే అని లాక్కుపోతారో అన్న సందేహం మొదలయింది. అటూ ఇటూ చూశాడు. ఎవరూ తనని పట్టించుకోవటంలేదు. మిగిలిన బిచ్చగాళ్ళు కూడా ఎవరి పనిలో వారు ఉన్నారు. కాసేపటి క్రితం వరకూ ఇబ్బంది పెట్టిన దగ్గు ఇప్పుడు కాస్త నెమ్మదించింది. అతని మెదడు కూడా పట్టిన తుప్పు వదిలినట్లయి చురుగ్గా ఆలోచిస్తోంది.

ప్రస్తుతం అతని ముందు ఉన్న లక్ష్యం ఒక్కటే- ఆ డబ్బు ఎవరికీ కనబడకుండా దాచాలి. దానిని ఏమి చేయాలన్నది తరువాత విషయం.

అందుకే ముందు కింద పరచి ఉన్న గోనెపట్టాని మడతలు పెట్టి అందులో డబ్బు కట్ట పెట్టి దానిని చంకలో పెట్టుకుని బయలుదేరాడు.

అర్ధాంతరంగా లేస్తున్న నారిగాడిని చూసి "ఏంది? అప్పుడే లేస్తుండావ్?" అడిగాడు పక్కనున్న మరో బిచ్చగాడు.

"దగ్గెక్కువవుతోంది మావా! ఇంక కూసోలేను"

ఆశ్చర్యంగా చూశాడతను. నిజానికి నారిగాడి దగ్గు ఇంతకు ముందు కంటే ఇప్పుడు బాగా తగ్గింది. బాగా దగ్గుతున్నప్పుడు కూడా అతనెప్పుడూ అడుక్కోవటం ఆపలేదు. "సరే! పోయిరా" ఆనందం బయట పడకుండా దాచుకోవటానికి ప్రయత్నిస్తూ అన్నాడతను. 'వీడు త్వరగా వెళ్ళిపోతే ఆ కలెక్షన్ కూడా తనకే వస్తుంది' అనేది అతని ఆనందం.

నారిగాడు అక్కడి నుండి బయల్దేరాడు.

నడుస్తూ కాస్త ముందుకు వెళ్ళగానే ఒక పబ్లిక్ టాయిలెట్ కనిపించింది. దాని లోపలకు వెళ్ళి తలుపు వేసుకున్నాడతను. గోనెపట్టా మడతలలోని చిల్లర నాణాలు, చిన్న చిన్న నోట్లు నిక్కరు జేబులోకి తోశాడు. తరువాత ఒకసారి వెయ్యి రూపాయల నోట్ల కట్టని కనులారా చూసుకున్నాడు. అతనికి ఇంకా తనకి పట్టిన అదృష్టాన్ని నమ్మబుద్ధి కావటంలేదు. ఆ కట్టలో నుండి ఒక నోటు మాత్రం విడిగా తీసి నిక్కరు జేబులో పెట్టుకుని మిగిలిన కట్టను జాగ్రత్తగా నడుముకు కట్టుకున్నాడు. అప్పటికి అతనికి కాస్త ధైర్యం వచ్చింది. 'హమ్మయ్య!' అనుకుంటూ ఆ టాయిలెట్ నుండి బయటికొచ్చాడతను.

ప్రస్తుతానికి సమస్య తాత్కాలికంగా తీరినా పూర్తిగా తొలగిపోలేదు. ఎన్ని రోజులని ఇలా డబ్బు నడుముకు కట్టుకుని తిరగగలడు? తన దగ్గర అంత డబ్బు ఉందని ఎవరికయినా తెలిస్తే దానిని జాగ్రత్త చేయటం చాలా కష్టం అవుతుంది. అందులో తన చుట్టూ ఉండే మనుషులకు ఇది చాలా పెద్ద మొత్తం.

ఇంత చిన్నకట్ట దాయటానికే తనకి ఇంత కష్టమవుతుంటే, మరి కోట్ల డబ్బు ఉన్నవాళ్ళు ఎలా దాచుకుంటారో.. అతనికి అర్థం కాలేదు. 'బహుశా బ్యాంకుల్లో దాచుకుంటారేమో!' అనుకున్నాడతను. వెంటనే తను కూడా ఈ డబ్బు బ్యాంకులో దాచుకుంటే ఎలా ఉంటుందన్న ఆలోచన వచ్చింది. కానీ ఇంద్రభవనాల్లాంటి ఆ భవంతులు, వాటి ముందు తుపాకులు పట్టుకుని నిలబడి ఉండే సెక్యూరిటీ

## కొత్తగాలి...

**వరాల వర్షాలు**
**పిదప**
**పన్నుల పిడుగులు!**

– మాధవీ సనారా,
అనకాపల్లి

సిబ్బందీ గుర్తుకు వచ్చి అతని ఆలోచన అంతటితో ఆగిపోయింది. అసలు తనను ఆ బ్యాంకుల్లోకి అడుగు కూడా పెట్టని స్తారా? కష్టపడి లోపలకు వెళ్ళగలిగినా తన దగ్గర అంత డబ్బు చూడగానే, 'అది నీకెక్కడిది?' అని ప్రశ్నించే పోలీసులు గుర్తుకు రాగానే ఒక్కసారిగా భయంతో అతని శరీరం వణికింది. ఇంతలో అతనికి ఇంకొక అనుమానం వచ్చింది. తన అవ తారం చూసిన ఎవర్నికైనా అంత డబ్బు తన దగ్గర ఉందంటే నమ్మబుద్ధి కాదు. అప్పుడయినా పోలీసులకు అప్పచెప్తారు.

ఇలా రకరకాల అనుమానాలతో సతమ తమవుతూ నడుస్తున్న అతనికి దారి పక్కన చాయ్ దుకాణం కనిపించింది.

అక్కడకెళ్ళి "ఒక చాయ్ ఇయ్యన్నా" అన్నాడు.

"పైసలిచ్చి టోకెన్ తీసుకురా!" క్యాష్ కౌంటర్ వైపు చూపించి చెప్పాడు దుకాణంలోని వ్యక్తి.

కౌంటర్ వైపు నడిచాడు నారిగాడు.

జేబులో నుండి వెయ్యినోటు తీసి కౌంటర్‌లోని వ్యక్తికిచ్చి "ఒక చాయ్" అన్నాడు.

అంత పెద్ద నోటు చూసి ఉలిక్కిపడ్డాడు కౌంటర్లోని వ్యక్తి. అసలే దొంగనోట్లు వాడుకలో ఉన్నాయని అందరూ అనుకుం టున్నారు. ఈ అడుక్కునే వాడి దగ్గరకు అంత పెద్ద నోటు ఎలా వచ్చిందో అర్థం కాలేదు అతనికి.

ఆ నోటు తీసుకుని అటు ఇటు తిప్పి చూశాడు. అతనికి అందులో ఏ లోపం కనపడలేదు. అయినా "ఎక్కడిదిరా ఈ నోటు? నీ దగ్గరకి ఎలా వచ్చింది?" దబా యిస్తున్నట్లు నారిగాడ్ని అడిగాడు.

నారిగాడికి కూడా ఇప్పుడిప్పుడే కాస్త తెలివి తేటలు అబ్బుతున్నాయి. అందుకే అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పకుండా "ఎందుకన్నా? అదేమన్నా దొంగనోటా?" అని అడిగాడు.

కౌంటర్లోని వ్యక్తి నోటు వెనక్కి ఇచ్చేస్తూ, "మీరంటే దొరల్రా! వెయ్యి నోట్లు జేబులో పెట్టుకుని తిరుగుతారు. మా దగ్గర చిల్లర ఉండొద్దూ!" అన్నాడు.

ఎదురు చెప్పకుండా ఆ నోటు వెనక్కి తీసుకుని తన దగ్గర ఉన్న చిల్లర నాణాలు ఇచ్చి టోకెన్ తీసుకున్నాడు నారిగాడు. తరువాత చాయ్ తాగుతూ తన ఆలో చనలు కొనసాగించాడు. నిజంగా చాయ్ దుకాణం వాడి దగ్గర చిల్లర లేక తన నోటు వెనక్కి ఇచ్చాడా? ఏమో? దొంగనో టయితే అదేమాట చెప్పేవాడుగా! అలా చెప్పలేదంటే అది మంచి నోటే! కాకపోతే తన అవతారం చూసిన ఎవర్నికైనా తన దగ్గర అంత పెద్ద నోటు చూస్తే అను మానం వచ్చి తీరుతుంది. అందుకే ముందు ఈ దరిద్రపు అవతారం నుండి బయట పడాలి. ఈ వేషం డబ్బు అడు క్కోవటానికి ఉపయోగపడుతుంది తప్ప ఖర్చు పెట్టటానికి కాదు. అందుకే ముందు కొత్తబట్టలు కొనుక్కోవాలని అనుకున్నాడ తను.

ఆలోచనల మధ్య చాయ్ తాగటం పూర్తి చేశాడు నారిగాడు. గ్లాసు పక్కన పెట్టి ముందుకు కదిలిన అతనికి రోడ్డు పక్కన ఫుట్‌పాత్ మీద హ్యాంగర్లకు వేలా డదీసిన షర్టులు, ప్యాంటులు కనిపిం చాయి. అవి పరిశీలించి చూద్దామని, వాటిని అందుకోబోతుంటే అప్పటిదాకా ఎక్కడున్నాడో పరిగెత్తుకుంటూ వచ్చాడు షాపు కుర్రాడు. రావటమే కాదు "చెయ్యి తియ్!" అంటూ పెద్దగా అరిచాడు కూడా!

"కొనుక్కోటానికి సామీ!" నిష్ఠూరంగా అన్నాడు నారిగాడు.

"డబ్బులున్నయ్యా?" అనుమానంగా అడిగాడతను.





వెయ్యి నోటు చూపించాడు నారిగాడు.

"సరే! అయితే ఏది కావాలో చెప్పు. నేనే చూపిస్తాను. నువ్వు పట్టుకుంటే బట్టలన్నీ మాసిపోతాయి" అంటూ దగ్గరికొచ్చాడు.

నారిగాడు మాట్లాడకుండా కొన్ని బట్టలు ఎంపిక చేసుకున్నాడు.

అతనికి నచ్చిన బట్టలు కవరులో పెట్టి అతనికిచ్చి, అతనిచ్చిన వెయ్యి నోటు తీసుకుని లోపల కూర్చుని ఉన్న సేట్‌కి ఇచ్చాడు ఆ కుర్రాడు.

ఆ సేటు వెయ్యి నోటునీ, బయట నిలబడి ఉన్న నారిగాడినీ మార్చి మార్చి చూసి తరువాత దానిని శల్యపరీక్షకి గురిచేసి ఏదో మెషిన్లో పెట్టి చెక్‌చేసి సంతృప్తి చెందిన తరువాత మిగిలిన చిల్లర ఇచ్చాడు.

నారిగాడు ఆ బట్టలు, చిల్లర తీసుకుని అక్కడకు దగ్గరలో ఉన్న పార్కులోకి నడిచాడు. కాస్త మరుగు ఉన్న ప్రదేశానికి వెళ్ళి కొత్తబట్టలు వేసుకుని బయటకు వచ్చాడు.

ఇప్పుడతనికి కాస్త ధైర్యం వచ్చింది. నలుగురిలోకి వెళ్లవచ్చున్న ఆత్మవిశ్వాసం వచ్చింది. అక్కడ ఆగి ఉన్న కారు అద్దంలో తనను తాను చూసుకున్నాడు. బట్టలు మారటం తప్ప తన రూపం పెద్దగా మారలేదని అప్పుడతనికి అర్థమైంది. పెరిగిన గడ్డం, అట్టలు కట్టిన జుట్టు అసహ్యంగా కనిపించాయి. వాటిని తొలగించుకోవటానికి ఏ ఖరీదయిన సెలూన్ వాడూ తనను దగ్గరకు రానివ్వడని అతనికి తెలుసు.

అతనికి ఆ రోడ్డు చివర మలుపు దగ్గర ఫుట్‌పాత్ మీద చిన్న కుర్చీ పెట్టుకుని కూర్చునే వ్యక్తి గుర్తుకు వచ్చాడు. వచ్చిన వారిని వచ్చినట్లు ఆ కుర్చీలో కూర్చోబెట్టి వారి చేతికే ఒక అద్దం ఇచ్చి చకచకా కటింగ్ చేసి పంపటం అతని స్పెషాలిటీ.

తనకు తెలియకుండానే అడుగులు అటు పడుతుంటే ముందుకు నడిచాడు నారిగాడు.

★ ★ ★

"అతనిలో మార్పు చూశారా? ఎంత

## థాచర్ చతురోక్తులు



ఈ ఏడాది ఏప్రిల్ 8న మరణించిన కన్జర్వేటివ్ పార్టీ నాయకురాలు, ఒకప్పటి బ్రిటన్ ప్రధానమంత్రి మార్గరెట్ థాచర్ వివిధ సందర్భాలలో పేల్చిన చతురోక్తులు కొన్ని..

### స్త్రీల ఆధిక్యం!

మార్గరెట్ థాచర్ బ్రిటన్‌కు తొలి మహిళా ప్రధానిగా ఉన్నప్పటికీ ఆమెను స్త్రీవాదిగా పరిగణించేవారు కాదు. కానీ ఆమె మాటల్లో అక్కడక్కడా స్త్రీవాద ధోరణులు ఎంత హాస్యస్ఫోరకంగా, వ్యంగ్య వైభవంతో కన్పిస్తాయో చూడండి.



'ఓ పురుషుడిని మొదటిసారి చూడగానే పది సెకండ్ల వ్యవధిలోనే నేనతనిపైన ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకుంటాను. ఆ అభిప్రాయాన్ని ఇక మార్చుకోవడమనేది జరగదు. ఎందుకంటే మగాళ్లలో మార్పు దాదాపుగా ఉండదు. ఇక వారి ఆధిక్యత గురించి పరిశీలిస్తే అందులో డొల్లతనమే ఎక్కువ. పుంజు ఎంత గట్టిగా కొక్కొరొక్కో అని కూసినా, గుడ్లను పెట్టేది మాత్రం పెట్ట అనే సంగతిని విస్మరించకూడదు'

త్వరగా వచ్చిందో? " అన్నాడు ఆదిత్య.

"చూస్తున్నాను" క్లుప్తంగా అన్నాడు సహదేవుడు.

"అంత త్వరగా అలా మారతాడని ఊహించలేదు కదూ! అంతా డబ్బు మహిమ. చూడండి.. తన జీవితాన్ని ఎంత చక్కగా ప్లాన్ చేసుకుంటున్నాడో"

"ప్లానింగంటే దేనికి? చాయ్ తాగటానికీ, జుట్టు కత్తిరించుకోవటానికా? "

"అంత వ్యంగ్యం వద్దులెండి. ఇప్పుడే కదా..అతను తన దగ్గర ఉన్న డబ్బు గొప్పతనం తెలుసుకోవటం మొదలుపెట్టాడు. ఇక ముందు ముందు చూడండి. సమాజంలో ఒక గౌరవప్రదమయిన వ్యక్తిగా ఎలా మారతాడో? "

"అదీ చూద్దాం!"

"ప్రతి విషయానికీ అంత అనుమానం ఏంటండీ! అసలు మీ సందేహం ఏమిటి? అతను మారడనా? మారలేడనా? "

"కేవలం డబ్బే మనిషిని 'మంచి' మనిషిగా మారుస్తుందంటే నాకు అనుమానమే! ఐనా చూద్దాం, ఏం జరుగుతుందో"

"అంతా బానే జరుగుతోంది. మీకేమీ అనుమానం వద్దు. కాకపోతే నేనే ఒక పొరపాటు చేశాను"

"ఏమిటది? " ఆదిత్య చేసిన పొరపాటేమిటా అని ఆశ్చర్యంగా అడిగాడు సహదేవుడు.

"వెయ్యి నోటు ఇవ్వటం వలన చూడండి అతను ఎంత ఇబ్బంది పడుతున్నాడో! పైగా అంత పెద్ద నోటు అతని దగ్గర ఉండటంతో అందరూ అనుమానపడుతున్నారు కూడా!"

"నిజమే! అర్ధరూపాయి బిళ్లలివ్వవలసింది. ఆటోలో పెట్టుకు తిరిగేవాడు"

"మీకు నిజంగానే వెటకారం ఒకింత ఎక్కువలానే ఉందండీ"

"నిజం చెప్తే అలాగే ఉంటుంది. ఇలా ఎంతసేపు ఇక్కడ నిలబడి ఆ నారిగాడి కేశ ఖండనాన్ని వీక్షిస్తాము? లొకేషన్ మారుద్దామా? "

"మా సినిమా భాష మీకు కూడా బానే అబ్బిందే!"

"పక్కన ఉంది మరి ప్రఖ్యాత కథానాయకుడు కదా!"

ఆదిత్య ఓరగా చూశాడు.

సహదేవుడు అదేమీ పట్టించుకోలేదు.

"చెప్పండి.. ఎక్కడకు వెళ్దాం"

"ఆ లక్ష ఎక్కడి నుండి తెచ్చావో అక్కడకు వెళ్దాం"

నవ్వాడు ఆదిత్య. "మీ అనుమానాలు చూస్తుంటే నాకు నవ్వొస్తుందండీ. మన లక్ష వాళ్ళకి అసలు లెక్కలోకి రాదండీ బాబూ!"

"అదే చూద్దాం"

"మిమ్మల్ని ఒప్పించటం చాలా కష్టమండీ! సరే, పదండి. అయితే ఒక చిన్న మనవి"

"ఏమిటి? "

"ఆ వెళ్ళేదేదో నా సినిమా ఆడుతున్న థియేటర్ మీదుగా వెళ్దాం. ఈపాటికి ఒక షో అయిపోయి ఉంటుంది. అభిమానుల స్పందన చూద్దాం"

నిట్టూర్చి "సరే, పద!" అన్నాడు సహదేవుడు.

★ ★ ★

ఆదిత్య కొత్త సినిమా ఆడుతున్న థియేటర్ అది.

అప్పుడే షో అయిపోయింది. ప్రేక్షకులు బయటకు వస్తున్నారు.

థియేటర్లో నుండి బయటకు వస్తున్న జనాలకి ఎదురుగా నిలబడి మైకు వాళ్ళ ముందుకు పెడుతున్నాడు ఒక రిపోర్టర్.

లోపలి నుండి వస్తున్నవారు బయటికొస్తూ మైకు ముందుకు రాగానే 'సూపర్', 'వంద రోజులు', 'అదుర్స్', 'రెం

డువందల రోజులు', 'కేక', 'రికార్డులు బద్దలే', 'సిల్వర్ జూబ్లీ!' అంటున్నారు.

నిర్వికారంగా దీనినంతా రికార్డు చేస్తున్నాడు కెమెరామేన్.

జరుగుతున్న తతంగాన్నంతా దూరంగా నిలబడి ఆదిత్య, సహదేవుడు మౌనంగా చూస్తున్నారు.

తన సినిమా మీద వెల్లువెత్తుతున్న పొగడ్తలను వింటున్న ఆదిత్య మొహం అదొక రకమైన తన్మయత్వంతో వెలిగిపోతోంది.

అతని స్థితి చూసిన సహదేవుడు "నేనో మాట అడుగుతా.. ఏమీ అనుకోవుగా? " అని ఆదిత్యని కుదుపుతూ అడిగాడు.

"అడగండి" మైకం నుండి తేరుకుంటూ అన్నాడు ఆదిత్య.

"సినిమా అంటే అనేక రంగాల కలయిక అని చెప్తారు కదా! దానిని అందంగా తీర్చిదిద్దటంలో ఎందరో కళాకారులు, టెక్నీషియన్లు పాలుపంచుకుంటున్నారు కదా! మరి హిట్టయిన సినిమా గొప్ప అంతా హీరోలూ, డైరెక్టర్లూ తీసేసుకుంటే, మిగిలినవారి పరిస్థితి ఏమిటి? "

"మీకు సినిమాల మీద ఇంత పరిజ్ఞానం ఉందనుకోలేదండీ"

"అడిగిన దానికి సమాధానం చెప్పవయ్యా!"

"హిట్లలోనే కాదు, ఫ్లాపుల్లో కూడా ఎఫెక్టయ్యేది హీరోలూ, డైరెక్టర్లే కదండీ! మిగిలిన టెక్నీషియన్ల మార్కెట్, సినిమా జయాపజయాలతో సంబంధం లేకుండా సాగిపోతుంటుంది. మాలాంటి వారు సినిమా హిట్టు, ఫ్లాపులతో సంబంధం లేదంటే కుదరదు. సినిమా హిట్టయితే గొప్పంతా నాదనాలి. అదే ఫ్లాపయితే భారమంతా ఎవరో ఒకరి మీద తోసెయ్యాలి. అదే సినిమా జీవితం"

"ఇంకోమాట! ఆ థియేటర్ నుండి బయటకు వస్తున్నవారు చెప్తున్న మాటలన్నీ నిజాలని నువ్వు నమ్ముతున్నావా? "

"మరీ అంత అమాయకంగా కనిపిస్తున్నానటండీ" అన్నాడు ఆదిత్య.

"మరి అవన్నీ నిజాలు కావని తెలిసి కూడా ఆ మాటలు వింటూ అంత ఆనందిస్తావెందుకు? "

ఈసారి ఒళ్ళు మండింది ఆదిత్యకి. "ఏమీ ఎరగనట్లు, అదేదో కొత్త విషయమన్నట్లు నన్ను నిలదీస్తారే! మీ దేవుడు రోజూ చేస్తున్నది ఏమిటి? సుప్రభాతం, మంగళహారతి, సహస్ర నామాలు, పవళింపు సేవల పేరుతో పొగిడించుకుంటున్న పొగడ్తలన్నీ నిజంగా జనాలు మనస్ఫూర్తిగా చేస్తున్నవేనని ఆయన నమ్ముతున్నాడా? అసలు ఆ చదువుతున్న స్తోత్రాలకి అర్థం ఎంతమందికి తెలుసంటారు? మరి ఆయనెందుకు పొగడ్తలని అంతగా ఎంకరేజ్ చెయ్యటం? మేమేదో సామాన్య మానవులం. కాస్త పొగడ్తలకి కక్కుర్తిపడితే తప్పా! అదే ఆయన చేస్తే రైటా? " అని గడగడా కడిగేశాడు.

"ఆ దేవుడు తనని పొగడమని మిమ్మల్ని అడిగాడటయ్యా? మీకున్న పైత్యాలన్నిటినీ ఆయనకు ఆపాదించుకుని, ఎంతగా పొగిడితే అంతగా మీ కోరికలు తీరతాయన్న నమ్మకంతో మీరు చేస్తున్న పనులు తప్ప ఆయనకి ఇవన్నీ పట్టవు"

"నేను చెప్పేదీ అదేనండీ! వాళ్ళని పొగడమని నేను అడిగానా? టి.వి. లో కనిపించాలన్న ఆత్రుతతో వాళ్లలా మాట్లాడుతున్నారని తెలుసు. అంతమాత్రాన వారి పొగడ్తలు వినకుండా చెవులు మూసుకుని కూర్చోవాల్సిన అవసరం నాకు లేదు"

కాస్త వెనక్కి తగ్గిన సహదేవుడు టాపిక్ మారుస్తూ "ఇంతకీ నీ సినిమా హిట్టేనా? " అని అడిగాడు.

"ఎవరు అవునన్నా, కాదన్నా సినిమా

సూపర్ హిట్ అయి తీరుతుంది. ఎవరూ ఆపలేరు"

"మరింకేం! అంత ఆత్మవిశ్వాసం ఉన్నప్పుడు ఇక్కడ సమయం వృథా చేసుకోవటం ఎందుకు? మన తరువాత గమ్యానికి పోదాం పద"

"ఏమిటీ! ఇక్కడి నుండి ముంబయి దాకా నడిపిస్తారా? "

"అక్కరలేదులేవయ్యా!" అంటూ ఆదిత్య చేతిని అందుకున్నాడు సహదేవుడు. మరు క్షణం ఇద్దరూ అంతర్ధానమయ్యారు.




మల్హోత్రా ముంబయిలోని తన ఇరవై ఒక్క అంతస్తుల కార్పొరేట్ ఆఫీసు ముందు కారు దిగాడు.

అతనితోపాటు మరొక పక్క నుండి కారు దిగుతున్న అందాలభామ 'ఆంచల్'. ఆమె ఆ సంవత్సరం మిస్ యూనివర్స్ పోటీలో వెంట్రుకవాసిలో కిరీటం కోల్పోయింది.

ఆమెభుజం మీద చెయ్యి వేసి నవ్వుతూ బిల్డింగ్ లోపలకు అడుగు పెట్టిన అతన్ని డెస్క్ వెనుక నుండి విష్ చేసింది రిసెప్షనిస్ట్. ఆమె మల్హోత్రాతో కలిసి విదేశాలకు వెళ్లి, విమాన ప్రయాణంలో అతనితో చర్చ చేసిన యువతి. ప్రస్తుతం అతని ప్రిఫరెన్సులు మారిపోవటంతో ఆమె రిసెప్షన్‌లో కూర్చుని ఉంది.

కనీసం బదులు ఇవ్వకుండా ముందుకు కదిలిపోతున్న వ్యక్తీ, విమానంలో వస్తూ తనతో క్లోజ్‌గా కబుర్లు చెప్పిన వ్యక్తీ ఒకరేనంటే ఆమెకి నమ్మబుద్ధి కాలేదు.

కంపెనీ ఛైర్మన్‌కోసం కేటాయించిన లిఫ్ట్‌లో ఆంచల్‌తో కలిసి ఎక్కాడు మల్హోత్రా. తరువాత ఇరవై ఒకటో అంతస్తు చేరుకోవటానికి బటన్ నొక్కాడు.

"మీ ఆఫీసు ఎందుకంత ఎత్తున పెట్టుకున్నారు? కింద అంతస్తుల్లో అయితే వీలుగా ఉండేది కదా!" అంది ఆంచల్.

"అంతకంటే పైన బిల్డింగ్ లేదు కాబట్టి అక్కడే ఆగవలసి వచ్చింది. నేను ఒకరి కింద ఉండటం నాకు నచ్చదు" చెప్పాడు మల్హోత్రా.

మామూలుగానే ఎయిర్‌లైన్స్ సంస్థలు అంతర్గత సమస్యలు ఎన్ని ఉన్నా పైకి మాత్రం పటాటోపం ప్రదర్శించటానికి ప్రాముఖ్యం ఇస్తాయి. స్కైలైన్ సంస్థ విషయంలో ఇది ఒకింత ఎక్కువే!

మల్హోత్రాకి జీవితాన్ని అనుభవించటమంటే ఇష్టం. తనది అనుకున్నది ఏదయినా 'ది బెస్ట్'గా ఉండాలనుకుంటాడు. దానికి ఎంత ఖర్చు అయినా వెనుకాడడు. ఇంతకుముందు అతను అనేక వ్యాపారాలు చేసేవాడు. అదృష్టమేమో కానీ ఎందులో అడుగుపెట్టినా బాగా కలిసి వచ్చింది.

అలాంటి రోజుల్లో ఎయిర్‌లైన్స్ రంగంలోకి ప్రైవేట్ యాజమాన్యాలను అనుమతిస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వచ్చాయి.

విమానయాన రంగం అయితే తను కోరుకున్న జీవన విధానానికి దగ్గరగా ఉంటుందనుకున్న మల్హోత్రా ఎగిరి గంతేసి అందులోకి దూకాడు.

చాలామంది సన్నిహితులు అతన్ని వారించారు. పైకి కనబడే లాభాలు ఆ రంగంలో నిజంగా రావనీ, కోరికోరి తలనొప్పులు సృష్టించుకోవద్దనీ సలహా ఇచ్చారు.

అయినా వారి మాటలు మల్హోత్రా పట్టించుకోలేదు.

పూర్తిగా వ్యాపారంలోకి దిగాక తెలిసింది తన దగ్గర ఉన్న పెట్టుబడి విమానాలను నడపటానికి ఏ మూలకూ సరిపోదని. అలా అని అతను వెనుకడుగు వేయలేదు. అతని స్వభావం అందుకు అంగీకరించదు.

విమానయానసంస్థ నడపాలంటే స్వంత విమానాలే ఉండాల్సిన అవసరం లేదు. అవి అద్దెకు దొరుకుతాయని తెలిసింది. అద్దెకు తెచ్చే విమానాలకు ముందు కొద్దిమొత్తం అడ్వాన్స్ చెల్లిస్తే చాలనీ.. ఆ అడ్వాన్సునూ బ్యాంకులు ఇచ్చే అప్పుల ద్వారా సమకూర్చుకోవచ్చనీ తెలిసింది. దానితో తన దగ్గరున్న ఆఖరి పైసా వరకు పెట్టుబడిగా పెట్టి, మిగిలింది అప్పులు తెచ్చి ఆ సంస్థను మొదలు పెట్టాడు.

పెట్టిన కొత్తలో అతని స్కైలైన్ సంస్థ దూసుకు పోయింది. అప్పటి వరకు ప్రభుత్వ ఆధ్వర్యంలో ఇష్టారాజ్యంగా నడుస్తున్న ఏకైక ఎయిర్‌లైన్స్ సంస్థకి నిజమయిన పోటీ అంటే ఏమిటో తెలియజేసింది. ప్రజలంతా అతని స్కైలైన్ విమానాల్లో ప్రయాణించటానికి ఇష్టపడసాగారు.

అయితే అందరి కంటే ఎత్తున ఉండాలన్న అతని పట్టుదలే అతని పాలిట శాపమైంది. అవసరం లేకపోయినా లాభాలు రాని రూట్లలో కూడా విమానాలు నడపాలని నిర్ణయించుకున్నాడు. దానికిగానూ ఎక్కువ డబ్బు వెచ్చించి మరిన్ని విమానాలు అద్దెకు తీసుకోవలసి వచ్చింది. ఇంకొక వైపు రోజురోజూకూ పెరుగుతున్న ఇంధన ధరలు లాభాలను తగ్గిస్తూ వచ్చాయి. అయినా మల్హోత్రా వెరవలేదు. నష్టాలు వస్తున్నా తన విమానాలను స్థాయి తగ్గకుండా కొనసాగిస్తూనే వచ్చాడు. ఒకసారి పోటీ నుండి ప్రత్యర్థులను పక్కకు తోసేస్తే తనకు తోచింది చెయ్యవచ్చనుకున్నాడు. కానీ అతను అనుకున్నట్టు జరగలేదు.

మరికొన్ని విమానయాన సంస్థలు చౌక ధరలకు ప్రయాణికులను చేరవేస్తామన్న ప్రచారంతో ముందుకు వచ్చాయి. కొన్ని సౌకర్యాలు తగ్గించి ప్రజలకు అందుబాటు ధరల్లో ప్రయాణం అలవాటు చేయసాగాయి. వాటి పోటీ తట్టుకోవటానికి నష్టమయినా స్కైలైన్ సంస్థ కూడా తన ధరలను తగ్గించక తప్పలేదు.

రోజులు గడుస్తున్న కొద్దీ బ్యాంకుల నుండి తీసుకున్న అప్పులకు వాయిదాలు కట్టటానికి కూడా ఇబ్బంది పడవలసిన పరిస్థితి దాపురించింది. దానితో బ్యాంకులు మరిన్ని రుణాలు ఇచ్చేందుకు నిరాకరించాయి. మరో దారి లేక పెట్టుబడుల కోసం విదేశీ ఆర్థిక సంస్థలను ఆశ్రయించక తప్పలేదు. పేరున్న విదేశీ సంస్థలు పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు రాకపోవటంతో ఎక్కువ వడ్డీలకు ఊరూ పేరూ లేని సంస్థల దగ్గర అప్పులు చేశాడు. ఆ అప్పులకు గ్యారంటీలుగా మరిన్ని ఆస్తులు తాకట్టు పెట్టాడు. ఇంతా చేసి అతని సంస్థల్లో పెట్టుబడులు పెట్టిన విదేశీ కంపెనీలు మనీ లాండరింగ్ కేసుల్లో చిక్కుకోవటంతో, సంబంధం లేకపోయినా ఇతని కంపెనీల మీద కూడా ఎంక్వయిరీ ప్రారంభించారు.

నిన్నటిదాకా అప్పులిస్తామని వెంటపడ్డ బ్యాంకులు ఇప్పుడేమో తమ డబ్బు తిరిగి ఇవ్వమని పీడిస్తున్నాయి. ఇంకా పెట్టుబడులు పెడతామన్న విదేశీ పెట్టుబడిదారులు వెనకడుగు వేస్తున్నారు.

అవసరం లేనప్పుడు గొడుగు అరువు ఇచ్చి, వాన మొదలు కాగానే దాన్ని వెనక్కి ఇమ్మని వెంటబడటమే బ్యాంకుల లక్షణమని తెలిసివచ్చింది.

## దానికే కొంప మునిగిందా?

ప్రపంచకప్ సెమీఫైనల్ లో జర్మనీతో తలపడి బ్రిటన్ 1990లో జాతీయక్రీడ ఫుట్ బాల్ లో ఓడిపోయింది. దీని గురించి ప్రధాని థాచర్ తో మంత్రివర్గ సహచరుడైన కెన్నెత్ క్లార్క్ 'ఈ సంగతి మీకు ఏమాత్రం ఆందోళన



కలిగించడం లేదా?' అని ప్రశ్నించాడు.

దానికామె నవ్వుతూ 'కేవలం ఓ క్రీడలో జర్మనీ విజయం సాధించినందుకు మనం కొంప మునిగిపోయినట్లు భయపడాలా? ఈ శతాబ్దం పూర్వార్ధంలోనే జర్మనీని మనం రెండు ప్రపంచ యుద్ధాల్లోనూ ఘోరంగా ఓడించిన సంగతిని మరచిపోయారా?' అంది. ఆమె సమయస్ఫూర్తికి, చతురతకు మంత్రివర్యులంతా పకాలున నవ్వేశారు.

అయినా అతను చెక్కు చెదరలేదు. తన కేమీ ఇబ్బంది లేదన్నట్లే ఉన్నాడు. ప్రపంచవ్యాప్తంగా ఏ పెద్ద ఈవెంట్ జరిగినా అక్కడ ప్రత్యక్షమవుతాడు.

అతని డిక్షనరీలో మారేదంటూ ఏదన్నా ఉందంటే, అది అతని పక్కన నడిచే అందగత్తెల పేర్లే!

లిఫ్ట్ ఇరవై ఒకటో అంతస్తు చేరుకుంది.

"కమాన్ డియర్" అంటూ ఆంచల్ ని తన ఆఫీసులోకి ఆహ్వానించాడు మల్హోత్రా.

ఆంచల్ ఇంతవరకు జీవితంలో అంత పోష్ గా ఫర్నిష్ అయిన ఆఫీసు గదిని చూడలేదు.

కళ్లు విప్పార్చుకుని అన్ని వైపులా చూస్తున్న ఆమెనే గమనిస్తున్న మల్హోత్రా ఛాతీ సైజు రెండంగుళాలు పెరిగింది. ఆ గదిలోకి మొదటిసారి అడుగు పెట్టినవారి కళ్లలో కనపడే ఆశ్చర్యం ముందు, ఆ గదిని డెకరేట్ చెయ్యటానికి ఖర్చు చేసిన ఒకటిన్నర కోట్ల రూపాయలు చాలా తక్కువనిపిస్తుంది.

ఆంచల్ నడుము మీద చెయ్యి వేసి ఆ గదిలోనే ఉన్న సోఫావైపు నడిపించాడు మల్హోత్రా. ఇద్దరూ అందులో కూర్చున్న తరువాత ఆమెను దగ్గరకు లాక్కుని మెడ వంపులో తన తల పెట్టి పెర్ఫ్యూమ్ వాసనని గాఢంగా పీల్చాడు. తరువాత మత్తైన ఆ సువాసనకి చిత్తై, ఆమె మొహం మీదకు వాలబోతుంటే ఇంటర్ కామ్ రింగయ్యింది.

ఆమెను విడిచిపెట్టి విసుగ్గా ఫోన్ అందుకున్నాడు.

"సర్! కంపెనీ సెక్రటరీ దిలీప్ మిమ్మల్ని అర్జంటుగా కలవాలంటున్నారు" చెప్పింది అతని సెక్రటరీ.

"గంట ఆగి రమ్మను. ఈలోపు నన్ను డిస్టర్బ్ చేయవద్దు.." ఆంచల్ మొహం మీద నుండి చూపులు, నడుము మీద నుండి చేతులు తీయకుండా, కటువుగా చెప్పి ఫోన్ పెట్టేశాడు. ఆ కంపెనీలో అతని మాటే వేదం. అతను చేసిందే శాసనం. అతనికి ఎదురు చెప్పే ధైర్యం ఎవరికీ లేదు.

ఈ గంటలో అతను వెలగబెట్టే రాచకార్యాలేమిటో అందరికీ తెలుసు. అయినా ఎవరూ మాట్లాడరు. ఎందుకంటే అతనికి ఎదురు చెప్పిన వారెవరూ ఆ కంపెనీలో మనలేరు. అయితే ఎప్పుడూ జరగనిది ఆరోజు జరిగింది.

ఆశ్చర్యంగా మళ్లీ ఫోన్ మోగింది.

విసుగ్గా తల విదిలించాడు మల్హోత్రా. మరోసారి అతని చేతివేళ్లు ఆంచల్ నడుము మీద పట్టు తప్పాయి.

విసుక్కుంటూ మళ్లీ ఫోన్ అందుకున్నాడు.

"ఏమిటి? " విసుగునంతా గొంతులో ప్రతిఫలింపచేస్తూ అడిగాడు.

"ఎమర్జెన్సీ అట సర్! మిమ్మల్ని అర్జెంటుగా కలవాలట" చెప్పింది సెక్రటరీ.

అతనికి కోపం తెప్పిస్తున్నానన్న భయం ఆమె గొంతులో వణుకులా ప్రతిఫలించింది. ఆ వణుకు గమనించిన అతనికి సగం కోపం తగ్గటమే కాక, తృప్తి కూడా కలిగింది. అందుకే పెద్దగా రెట్టించకుండా "సరే! పంపు" అన్నాడు.

మల్హోత్రా సోఫా నుండి లేచి విశాలమయిన టేబుల్ వెనక ఉన్న చైర్లో కూర్చున్నాడు.

పరుగెత్తుతున్నట్లు లోపలకు వచ్చాడు దిలీప్. అతని మొహంలో ఆందోళన చూస్తుంటే విషయం గంభీరమైనదే అనిపిస్తోంది.

మల్హోత్రా కూర్చోమనటంతో ఎదురు కుర్చీలో కూర్చున్నాడు.

"చెప్పు, ఏమిటింత హడావుడి? "

"మన బ్యాంకు ఎకౌంట్లు ఫ్రీజ్ చేశారు సర్"

"అదేమిటి? ఎవరు చేశారు? ఎందుకు చేశారు? "

"మన కంపెనీ మీద పెట్టిన 'ఫెమా' కేసులో ప్రభుత్వానికి రుజువులు దొరికాయంట. అందుకే కోర్టు ద్వారా ఈ చర్య తీసుకున్నారు"

"మన కంపెనీలో లొసుగులు ఉన్నాయా? " ఆశ్చర్యంగా అడిగాడు మల్హోత్రా.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. అతను వ్యాపారంలో తప్పుడు మార్గాలను ప్రోత్సహించడు.

"మనకు తెలిసి మనమేమీ తప్పులు చెయ్యలేదు"

"మరి మన లాయర్లేం చేస్తున్నారు? "

"వాళ్ల ప్రయత్నం వాళ్లు చేస్తున్నారు"

"వాళ్లున్నది ప్రయత్నం చెయ్యటానికి కాదు. లక్షల్లో ఫీజు తీసుకుంటున్నప్పుడు రిజల్ట్స్ చూపించాలి"

దిలీప్ ఏ కామెంటూ చేయకుండా మౌనంగా ఉండిపోయాడు.

"మన కంపెనీలో పెట్టుబడి పెట్టిన వాడు తప్పుడు మార్గాల్లో పెట్టుబడి పెట్టాడని రుజువయితే.. వాళ్లని పట్టుకోమనండి. నామీద పడితే నేనేమి చేస్తాను? "

"వాళ్లు విదేశీయులు. వారి ప్రభుత్వానికి వారి పేర్లు సూచించటం తప్ప మన ప్రభుత్వశాఖలు వారినేమీ చెయ్యలేవు"

"అందుకని ఎవడో ఒకడిని బలి పశువును చేస్తారా? " విసుగ్గా అన్నాడు మల్హోత్రా.

"చట్టం అలా ఉంది సర్!"

"ఉంటే ఉండనివ్వండి. అయినా ఇవన్నీ ముందే ఊహించినవేగా? మనకి ప్రతి రోజూ ప్రయాణికుల ద్వారా వచ్చే ఆదాయం ఉంటుంది కదా! ప్రస్తుతానికి మన అవసరాలన్నీ ఆ ఆదాయం నుండే జరపండి"

"ఆ ఎకౌంట్లో నుండి పైసా కూడా రిలీజ్ చేయటానికి బ్యాంకర్లు ఒప్పుకోవటం లేదు"

"అదేమిటి? "

"వాళ్లకి రావలసిన అప్పు వాయిదాలు మనం కట్టలేదు కదా! ఆ బాకీ డబ్బులు ఈ ఎకౌంట్లో నుండి తీసుకుంటారంట"

"వచ్చిన ఆదాయం అంతా వాళ్లు తీసేసుకుంటే మన విమానాలు నడిచేదెట్లా? "

"నేనూ అదే అన్నాను సర్! కానీ నా మాట వాళ్లు పట్టించుకోవడం లేదు"

"బంగారు గుడ్లు పెట్టే బాతును కోసిన అత్యాశాపరుడి కథ చిన్నప్పుడు చదువుకున్నాం. అలాగే చిన్న చిన్న వాయిదాల కోసం మన సంస్థను మూలబడేటట్లు చేస్తే



మనతో పాటు వారూ మునుగుతారు. అప్పుడు మొత్తం బాకీ రద్దు చేసుకోవలసి ఉంటుంది. ఆ మాత్రం ఇంగితం కూడా ఆ బ్యాంకర్లకు ఉన్నట్లు లేదు. లేదూ.. వారికి ఈ విషయం వివరించి చెప్పటంలో మనం విఫలమయ్యాం అనుకోవాలి. ఏది కరెక్టో మీరే చెప్పండి" కోపంగా అన్నాడు మల్హోత్రా.

దిలీప్ మరలా మౌనంగా ఉండిపోయాడు.

"మిమ్మల్ని అపాయింట్ చేసుకున్నది సమస్యలకు సమాధానం చూపిస్తారని. అంతే తప్ప సమస్య రాగానే నా దగ్గరకు పరిగెత్తుకు రావటానికి కాదు"

"అది చెప్పటానికే వచ్చాను సర్! అన్ని బ్యాంకులవాళ్లూ కలిసి మీటింగ్ పెట్టారు. మనకిచ్చిన అప్పులకు కట్టవలసిన వాయిదాలు పేరుకు పోవటంతో వారు భయపడి పోయారు. ఆ సమావేశానికి మనల్ని



టుగా తీర్చకపోతే మన విమానాలు ఎయిర్‌పోర్ట్‌లో దిగటానికి పర్మిషన్ ఇవ్వ మంటున్నారు"

"ఇంకా? "

"ఉద్యోగులకు మూడు నె

కూడా పిలిచారు. ఆ సమావేశాన్ని మీరైతేనే హ్యాండిల్ చేయగలరు. మీరు దానికి వెళ్లకపోతే వారికి ఇష్టమొచ్చిన నిర్ణ యాలు తీసుకునే అవకాశం ఉంది. అందుకే మీరు వెళ్లి ఎలా అయినా వారిని కన్విన్స్ చేసి మన ఆదాయాన్ని లోన్‌లకు జమ వేసుకోవద్దని ఒప్పించగలగాలి"

"ఎప్పుడు ఆ మీటింగ్? "

"ఇంకొక గంటలో"

"సరే! నేను వెళ్తాను"

"మీకు కావలసిన వివరాలన్నీ ఈ ఫోల్డ ర్‌లో ఉన్నాయి. బ్రీఫ్ చెయ్యమంటారా? "

"అక్కర్లేదు" అని, "అయిపోయిందా? చెప్పవలసింది ఇంకేమన్నా ఉందా? " అన్నాడు నిశ్చలంగా.

"ఎయిర్‌పోర్ట్ అథారిటీ వాళ్లకు కట్టవల సిన బిల్లులు పేరుకు పోయాయి. అర్జం

లలుగా జీతాలు కూడా ఇవ్వలేదు. వాళ్లు సమ్మె నోటీసు ఇచ్చారు"

"అవును! అలా జరగకుండా ఉండవల సింది. వాళ్ల జీతాలకు కావలసిన డబ్బు ఏర్పాటు చేశాను. నా వ్యక్తిగత ఖాతాలో ఉన్న డబ్బు వారి జీతాలకు సరిపోతుంది. అందులో నుండి డబ్బు తీసి వారికి జీతాలు చెల్లించండి" బ్రీఫ్ కేస్ నుండి తన చెక్ బుక్ తీస్తూ అన్నాడు మల్హోత్రా.

"ఎయిర్‌లైన్స్ లాంటి సంస్థల్లో వినియో గదారులకు అందించే సేవలే ప్రధానం. అలాంటి సేవలు అందించటానికి ఉద్యోగు లే ప్రధాన వనరులు. వారిని దూరం చేసు కుంటే సంస్థ మనుగడే కష్టమవుతుంది.

అందుకే బ్యాంకుల కంటే ముందు మన ఉద్యోగుల బాకీలు తీర్చటమే ప్రధానం. చెక్కు తయారుచెయ్యండి" అన్నాడు మల్హోత్రా.

దిలీప్ వెంటనే స్పందించాడు. "నాకు తెలుసు సర్! మీరు ఏదో ఒక ఏర్పాటు చేయగలరు. అందుకే ఉద్యోగ సంఘాలతో మాట్లాడి వారు సమ్మెకు వెళ్ళకుండా ఆపాను. అతి కష్టం మీద వారు ఈ రోజు వరకూ ఆగారు. ఇప్పుడు వారికి ఇవ్వవల సిన పేమెంట్ ఇచ్చేస్తే ప్రస్తుతానికి ఒక బాధ తప్పుతుంది"

"చెక్కు ఎంతకి రాయమంటారు? "

దిలీప్ తన లాప్‌టాప్‌లో చూసి అమౌంట్ చెప్తే ఆ మొత్తానికి చెక్కు రాసి ఇచ్చాడు మల్హోత్రా.

ఆంచల్ సోఫాలో నుండి లేచి వీరి దగ్గ రకు వచ్చింది.

మల్హోత్రా చెక్కు మీద వేసిన సంఖ్య చూసిన ఆమెకు కళ్ళు తిరిగినంత పన యింది. ఆ డబ్బు పెట్టి ఒక భారీ బడ్జెట్ సినిమా తీయవచ్చు. అన్ని సమస్యల మధ్య కూడా వ్యక్తిగత ఖాతాలో అంత పెద్ద మొత్తం సమకూర్చగలిగిన అతని సామర్థ్యం చూసి ఆమెకు ఈర్ష్య కలిగింది.

దిలీప్ మాత్రం ఆంచల్ తన పక్కన నిలబడ్డా కళ్ళెత్తి ఆమెవైపు చూడకుండా జాగ్రత్త పడ్డాడు. తన లిమిట్స్ ఏమిటో అతనికి బాగా తెలుసు.

మల్హోత్రాకి సినీ రంగంలో కూడా చాలా మంది పరిచయస్థులు ఉన్నారు. వారి ద్వారా తనకి సినిమా ఛాన్స్ ఇప్పిస్తాడన్న ఆశతో ఆంచల్ అతని చుట్టూ తిరుగు తోంది. అయితే అతనే ఇన్ని సమస్యల మధ్య ఉన్నాడన్న విషయం ఆమెకి ఇప్పుడే తెలిసింది.

చెక్కు తీసుకున్న దిలీప్ బయటకు వెళ్ళి పోయాడు.

మల్హోత్రా ఏదో ఆలోచిస్తున్నట్లు తన కుర్చీలో నుండి కదలకుండా ఉండిపో యాడు.

ఆంచల్ నెమ్మదిగా నడుచుకుంటూ మల్హోత్రా దగ్గరకు వచ్చింది.

వెనుక నుండి వచ్చి తన భుజాల మీద మసాజ్ చేస్తున్న ఆంచల్‌ని అభావంగా చూశాడు మల్హోత్రా. "ఆంచల్, ఆట ఆడ వలసిన సమయం ఆసన్నమయింది. కానీ నీతో కాదు.. బ్యాంకర్లతో! ఆ పని అయ్యాక మరలా కలుద్దాం!" సీట్లో నుండి లేస్తూ అన్నాడు.

★ ★ ★

బ్యాంకర్లతో మల్హోత్రా సమావేశం జరు గుతోంది.

చర్చలు మొదలయి గంటలు గడు స్తున్నా ఎవరూ మెట్టు దిగలేదు. వాయి దాల ప్రకారం బకాయిలు కట్టవలసిందేనని బ్యాంకర్లూ, ప్రస్తుతం కట్టే పరిస్థితి లేదు కాబట్టి చెల్లింపులు వాయిదా వెయ్యాలని మల్హోత్రా.. ఎవరి పట్టు వారు వీడటం లేదు.

"నాకు ఒక విషయం అర్థం కావటం లేదు. ఇంతకాలం నేను వద్దన్నా అప్పులు తీసుకోమని నా చుట్టూ తిరిగారు. ఇప్పుడు నేను కొద్దిగా కష్టాల్లో ఉన్నానని తెలియ గానే డబ్బు అంతా ఒక్కసారిగా కట్ట మంటే, ఎక్కడనుండి పుట్టిస్తాను? " సమా వేశంలో ఉన్న బ్యాంకర్లను ఉద్దేశించి అన్నాడు మల్హోత్రా. అతని స్వరంలో ఏ మాత్రం తొట్రుబాటు కానీ, తడబాటు కానీ లేదు. ఎప్పటిలానే అదే అతిశయం, అదే హుందాతనం.

"మాకు రావలసిన వాయిదాలు కట్టి నంత కాలం మీరెన్ని కష్టాల్లో ఉన్నా మేము పట్టించుకోము. కానీ మాకు రావ లసిన డబ్బే కట్టలేనప్పుడు మేము ఎన్ని రోజులని చూస్తూ వుండగలం? మేము కూడా మా యాజమాన్యాలకు సమాధానం

చెప్పుకోవాలి కదా!" అన్నాడు ఒక బ్యాంకర్.

"ఏదో ఒకటి చేసి మా బాకీలు తీర్చేయండి. కావాలంటే కొత్త లోన్‌లు మళ్ళీ ఇస్తాం" మరొక బ్యాంకర్ ఆశ చూపాడు.

"పెళ్ళయితే కానీ పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితే కానీ పెళ్ళి అవదన్నట్లు ఉంది మీరు చెప్పేది. అయినా నా దగ్గర డబ్బే ఉండి ఉంటే మీ చేత ఇన్నిసార్లు అడిగించుకోవలసిన అవసరం ఉండదు కదా! నేను మిమ్మల్ని స్నేహితులుగా భావించాను తప్ప వడ్డీలకు డబ్బులిచ్చే కాబూలీ వ్యాపారస్థులుగా భావించలేదు. అవసరాల్లో ఉపయోగపడనివాడు నిజమయిన స్నేహితుడు అవడు. చెప్పండి, అవునంటారా? కాదంటారా? " మల్హోత్రా అందరినీ ఉద్దేశించి ప్రశ్నించాడు.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

ఆ హాలులో గాఢమయిన నిశ్శబ్దం పరుచుకుంది.

అతను చెప్పిన మాటలు విన్నట్లు 'ఊ' కొట్టినా ఏ ప్రమాదం ముంచుకొస్తుందో అన్నట్లు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

మల్హోత్రా మళ్ళీ మాట్లాడటం ప్రారంభించాడు. "మీ అందరి సహకారంతోనే స్కైలైన్ సంస్థ ఎదిగింది. ఇప్పుడది కొన్ని సమస్యల్లో చిక్కుకుంది. తన మనుగడ కోసం పోరాడుతోంది. ఇలాంటి సమయంలో ఇస్తున్న ఆక్సిజన్ కూడా కట్ చేస్తామంటున్నారు. ఇది కార్పొరేట్ హత్య. మీరు నా స్నేహితులయితే... నన్నూ, నా సంస్థనూ ఈ కష్టాల్లో కొద్దిగా ఆదుకోండి. అలాకాదూ, నిఖార్సయిన వడ్డీ వ్యాపారస్థులమే అనుకుంటే ఇక మాట్లాడుకోవటానికి ఏమి మిగిలింది? మీ ఇష్టం వచ్చిన చర్య మీరు తీసుకోండి. స్కైలైన్ సంస్థను మూతబడేటట్లు చేయటం ద్వారా లక్షలాది మంది ప్రజలకు ఉపయోగపడే సేవలను వారికి దూరం చేస్తున్నారు.

# రహస్యాలకో వెబ్‌సైట్




లక్షల విషయాలపై ఉన్న వెబ్‌సైట్లలో కొన్ని ప్రత్యేకమైనవి ఉన్నాయి. 'పోస్ట్ సీక్రెట్' అనే వెబ్‌సైట్‌ను ఫ్రేంక్ వారెన్ సృష్టించాడు. గుప్తంగా ఉంటూ పది మందితో రహస్యాలను పంచుకునే అవకాశం కల్పించడానికి ఆరంభించాడు. దీనికోసం ఇంట్లో తయారు చేసుకున్న పోస్ట్‌కార్డ్ మీద రాసి స్కాన్ చేసి దాన్ని సైట్లో పెట్టాలి.



ఎలాంటి రహస్యాన్నైనా దానిమీద రాయవచ్చు. కాకపోతే అది నిజమై ఉండాలనే నియమాన్ని పాటించాలి. లైంగికపరమైన తప్పులు, నేరాలు, తీరని రహస్య కోరికలు, సిగ్గుపడే అలవాట్లు, కలలు, ఆశలు మొదలైనవి ఇందులో అనేకమంది జనవరి 1, 2005 నుంచి పోస్ట్ చేస్తున్నారు. 2007కే ఆ సైట్లోకి ఇలాంటి 2500 పోస్ట్‌కార్డులు ఎక్కాయి. ప్రతి ఆదివారం కనీసం పదింటిని ఇందులో అప్‌డేట్ చేస్తుంటారు. ఎక్కువగా అమెరికన్స్ నుంచి వచ్చినవే ఇందులో పోస్ట్ చేయబడ్డాయి. దీంట్లో పాఠకుల కామెంట్స్‌ని ఇవ్వరు. అందువల్ల రహస్యాలను పోస్ట్ చేసేవారు ఇబ్బందికి గురై పంపరని భయం. ఇంతవరకూ ఎనభైవేల మంది ఇందులోకి తమ రహస్యాలను ఎక్కించారు. 'మై సీక్రెట్' పేర వారెన్ డిసెంబర్ 2011లో ఎన్నిక చేసిన కొన్ని రహస్యాలను వారెన్ పుస్తకంగా ప్రచురించాడు. అమెరికాలోని మహిళా విద్యార్థుల టాప్‌టెన్ ఫేవరెట్ వెబ్‌సైట్లలో ఇది ఒకటి. ఈ సైట్‌ని అమెరికన్ సామాజిక వేత్తలు తరచూ ఉదహరిస్తుంటారు. తప్పు ఒప్పుకోలు పుస్తకాలను అమెరికన్స్ బాగా ఇష్టపడతారు. కాబట్టి దీన్ని కూడా ఆదరించడంలో ఆశ్చర్యం లేదు!

# చతుర ప్రవేశిక

## సెప్టెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఆదిత్య భార్య పేరు?
జ.
2. మహేష్ సలహాదారు?
జ.
3. నారిగాడికి దొరికిన డబ్బు ఎంత?
 జ.
4. మల్హోత్రా ఏ కంపెనీ అధినేత?
 జ.
5. ప్రకాష్ సింగ్ కొడుకు?
 జ.
6. ఆదిత్య వద్దకు వచ్చిన దేవదూత?
జ.
7. నారిగాడికి గది ఇచ్చింది?
జ.
8. ఆదిత్యను ఇంటర్వ్యూ చేసింది?
జ.
9. మార్గరెట్ థాచర్ ఏ దేశస్థురాలు?
 జ.
10. పరుగుపందెంలో గెలిచింది?
 జ.

పంపినవారి పేరు: ------------------

------------------వయసు (   )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్:          ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

దానిని ఏ ప్రభుత్వం కానీ, కోర్టు కానీ సమర్థించదు. మీ తుది నిర్ణయం నా మీద, నా సంస్థ మీదా మోయలేని భారం మోపటమే అయితే ఆ చర్యలను లీగల్‌గా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉన్నాను" బెదిరింపు స్వరంతో చెప్పాడు.

అందరూ ఆలోచనలో పడ్డారు.

ఎట్టకేలకు వారిలో ఒక వ్యక్తి ధైర్యం చేసి అతని మనసులో మాట బయటకు చెప్పాడు. "మీ వ్యక్తిగత ఆస్తులు అమ్మి కొంత అప్పు తీర్చవచ్చు కదా?"

"నా వ్యక్తిగత ఆస్తులు మీకేమైనా తాకట్టు పెట్టానా?" గంభీరంగా ప్రశ్నించాడు మల్హోత్రా.

"లేదనుకోండి! అయినా అప్పులు చేసింది మీరే కదా! తీర్చటం మీ నైతిక బాధ్యత కాదా?"

"నైతిక బాధ్యతా?" ఆశ్చర్యంగా అడిగాడతను. "ఏ విధంగా బాధ్యుడ్ని? అప్పు నేను చెయ్యలేదు. నా సంస్థ చేసింది. రెంటికీ హస్తిమశకాంతరం ఉంది"

"మేము మాట్లాడుతున్నది లీగల్‌గా కాదు.. మోరల్‌గా.."

"మీరు బ్యాంకు తరఫున ఇచ్చిన అప్పులు వసూలు కాకపోతే, మీ ఆస్తులు అమ్మి బ్యాంకు నష్టం తీరుస్తారా?"

ఎవరూ మాట్లాడలేదు. కాసేపు ఆ హాలంతా నిశ్శబ్దం ఆవరించింది.

అతన్ని వాదనలో గెలవటం అంత తేలిక కాదని వారికి అర్థమైంది.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ మల్హోత్రా మళ్ళీ మాట్లాడటం మొదలు పెట్టాడు. "మీ దగ్గర తీసుకున్న డబ్బు నేను నా స్వప్రయోజనాలకి వాడుకోలేదు. చట్టపరంగా అన్ని పర్మిషన్లూ ఉన్న ఒక వ్యాపారంలో పెట్టాను. పెట్టుబడి పెట్టినపుడు లాభాలు వస్తాయనే అనుకున్నాం. మీరూ నమ్మారు. అప్పుడు మీలో ఒకరు కూడా ఇది లాభాలు వచ్చే వ్యాపారం కాదని

నాతో చెప్పారా? లాభాలు వస్తే అసలు సమస్యే ఉండకపోను, ఇప్పుడు నష్టాలు వచ్చాయి. నన్నేం చేయమంటారు? ఇక నా వ్యక్తిగత ఆస్తులంటారా.. వాటికి, మీ అప్పులకీ ఏ సంబంధమూ లేదు. కావాలంటే కోర్టులోనే తేల్చుకుందాం" ఎదురు తిరుగుతున్నట్లు మాట్లాడాడతను.

అతను అంత ధైర్యంగా బెదిరించినట్లు మాట్లాడటంతో కలకలం రేగింది.

ఒక రకంగా మల్హోత్రా చెప్పిన ప్రతి మాటా సరయినదే! అదీకాక ఎవరి వాదన సరయినదో తేల్చుకోవటానికి కోర్టుకు వెళ్తే అది తేలటానికి ఎన్ని సంవత్సరాలు పడుతుందో ఎవరికీ తెలియదు.

అందుకే ఒక సీనియర్ అధికారి కలగ చేసుకున్నాడు. "కోర్టులకు వెళ్ళటం ద్వారా ఎవరికీ ఉపయోగం ఉండదు. అలా చేయ దలచుకుంటే అసలు ఈ సమావేశం ఏర్పాటు చేసుకోవలసిన అవసరమే లేదు. మనలో మనమే ఏదో ఒకటి పరిష్కరించుకుందాం" అంటూ రెండు వర్గాలకూ సర్దిచెప్పే ప్రయత్నం చేశాడు.

మల్హోత్రాకి తన బెదిరింపులు పనిచేశాయని అర్థమైంది. వ్యాపార సమావేశాల్లో తనని ఎవరూ గెలవలేరన్న ధీమా అతనికి ఉండేది. ఇప్పుడు అది మరింత ఎక్కువయింది.

"మేము అడిగినట్లు డబ్బు ఇవ్వటానికి మీరు సిద్ధంగా లేరు కాబట్టి, మీరే ఏమి చేయదలచుకున్నారో, మీ ప్రపోజల్ ఏమిటో చెప్పండి" ఇంకో బ్యాంకర్ ఓడిపోయిన స్వరంతో బలహీనంగా అన్నాడు.

"మొత్తం అప్పులన్నీ తిరగరాయండి. నా లాభాల్లో వాటా పంచుకున్నట్లే నష్టాల్లో కూడా వాటా పంచుకోండి. వడ్డీలు తగ్గించండి. అలాగే మాకు వచ్చే ఆదాయం నుండి కాక లాభాల్లో నుండి మాత్రమే అప్పులు తీర్చటానికి అనుమతించండి" వరుసగా చెప్పాడు మల్హోత్రా.

"కుదరదు" అన్నారు ఒకరిద్దరు.

కానీ అనుభవజ్ఞులయిన అధికారులకు మరో మార్గం లేదని ముందే తెలుసు. అందుకే చివరి వరకూ వారేమీ మాట్లాడలేదు. తప్పక ఒకరి తరువాత ఒకరు దిగి వచ్చారు. ఇంకా మొండికేస్తే అసలుకే మోసం రావచ్చు. అందుకే మల్హోత్రా మెడలు వంచి డబ్బు వసూలు చేయాలని వచ్చిన అందరూ తామే తలలు వాలుస్తున్నారు.

మల్హోత్రా మనసులో నవ్వుకున్నాడు.

వీళ్ళతో ఏదో ఒక పరిష్కారం సెటిల్ అయితే తరువాత మిగిలిన విషయాల మీద దృష్టి పెట్టవచ్చు. అన్నిట్లోకి ముఖ్యం డబ్బేకదా అని అనుకున్నాడతను.

అందరూ తన దారిలోకి వస్తున్నారు అనుకుంటున్న సమయంలో ఒక బ్యాంకర్ జేబులో ఫోను మోగింది.

అతను ఆ కాల్ మాట్లాడి తలెత్తి అందరివైపూ చూసి "ఫ్రెండ్స్.." అన్నాడు.

తమలో తాము మాట్లాడుకుంటున్న అందరూ ఆగి కుతూహలంగా అతనివైపు చూశారు.

"ఇప్పటివరకు మనం చర్చిస్తున్న విషయాల తలరాత మార్చే సంఘటన ఒకటి జరిగింది" నిదానంగా చెప్పాడతను.

అంతా కుతూహలంగా అతనివైపే చూస్తున్నారు. అయినా 'ఏమిటి?' అని ఎవరూ అడగలేదు.

"స్కైలైన్ విమానాలు మూలపడ్డాయి" ఎవరూ అడగకపోయినా అతనే చెప్తున్నాడు.

ఉలిక్కిపడ్డాడు మల్హోత్రా.

"పైలెట్లు, ఉద్యోగులు అందరూ మెరుపు సమ్మెకు దిగారు. ఇక ఈ సంస్థ నడవదు. ఇవాళ కాకపోతే రేపు సంస్థ 'లాకౌట్' ప్రకటించక తప్పదు. ఇప్పటివరకు మనం

చేస్తున్న చర్చలన్నీ అర్థరహితం. ఈయన షరతులు నేను అంగీకరించను. మా బ్యాంకు ఈ విషయం కోర్టులోనే తేల్చుకుంటుంది" చెప్పి కుర్చీలో నుండి లేచాడతను.

అదిరిపడి మల్హోత్రా తను కూడా లేచి నిలబడ్డాడు. "ఏమిటి మీరు మాట్లాడుతోంది? ఆ విషయం ఎవరు చెప్పారు? అవన్నీ పుకార్లే" సర్ది చెప్తున్నట్లు అన్నాడతను.

"ఒకరు చెప్పేది ఏముంది మిస్టర్ మల్హోత్రా! అన్ని బిజినెస్ టి.వి. ఛానెళ్ళలో ఇదే వార్త వస్తోందంట. కాకపోతే ఆ విషయం ఇంకా మీకు తెలియలేదంటేనే మీ కంపెనీ మీద మీకెంత పట్టు ఉందో అర్థం అవుతోంది" అన్నాడతను.

అప్పటివరకు తన పక్షాన ముగుస్తుందనుకున్న సమావేశం ఇలా అర్ధాంతరంగా ఎదురుతిరగటంతో ఖిన్నుడయ్యాడు మల్హోత్రా. రెండుగంటల క్రితం తను ఈ సమావేశానికి వచ్చేవరకు బాగున్న సిచుయేషన్ ఇలా ఎందుకు అయిందో అతనికి అర్థం కాలేదు.

వారిని ఆపుదామని అతను చేస్తున్న ప్రయత్నాలు ఫలించలేదు.

మరికొన్ని క్షణాల్లో అతను అక్కడ ఉండగానే అందరూ హాలు నుండి వెళ్ళిపోయారు.

ఖాళీ అయిన హాలు నుండి వడివడిగా బయటకు వచ్చి తన కారు ఎక్కాడు మల్హోత్రా.

★ ★ ★

మల్హోత్రా అంత కోపంగా ఉండటం కానీ, అతని నోటివెంట అన్ని తిట్లు రావటం కానీ ఇంతకుముందు ఎవరూ వినలేదు.

ఎవరూ ఎదురు మాట్లాడకుండా అతని అరుపులన్నీ భరిస్తున్నారు.

అతని ఎదురుగా కంపెనీ సెక్రటరీ దిలీప్, మరికొందరు ముఖ్యమయిన అధికారులు నిలబడి ఉన్నారు.

"రెండుగంటలు, కేవలం రెండుగంటలు నేను లేకపోతే కంపెనీని ముంచేస్తారా? అసలెందుకిలా జరిగింది? "

"మనం ఉద్యోగస్థుల జీతాల చెల్లింపులకని ఇచ్చిన చెక్కు బౌన్స్ అయింది. దానితో వారు ఒక్కసారిగా ఉద్రేకానికి లోనయ్యారు. జీతాలు అందుకునే ఆఖరి అవకాశం కూడా పోయిందనుకున్నారు. మోసపోయామన్న భావంతో రెచ్చిపోయారు. ఇక తప్పదని సమ్మెకు దిగారు. ఎక్కడి విమానాలు అక్కడే ఆగిపోయాయి. ప్రయాణికులందరూ విమానాశ్రయాల్లో పడిగాపులు కాస్తున్నారు. ఈలోపు మనం 'లాకౌట్' ప్రకటించామన్న వార్త మార్కెట్లో పాకిపోయింది. దానితో ఉద్యోగులు మరింత రెచ్చిపోయారు. మన షేరు ధర నిమిష నిమిషానికీ పతనమవుతోంది" గుక్క తిప్పుకోకుండా సమాధానం చెప్పాడు దిలీప్.

"ఇంత జరుగుతుంటే మరి మీరేం చేస్తున్నారు? " కళ్ళు ఎర్రబడుతుంటే అడిగాడు మల్హోత్రా.

సమాధానం చెప్పటానికి వణికాడు దిలీప్. "పరిస్థితులు ఎంత త్వరగా మారిపోయాయంటే.. మాకు ఆలోచించుకునే సమయం లేకుండాపోయింది" తడబడుతూ చెప్పాడు.

"సరే! ఇప్పుడయినా మించిపోయింది లేదు. ఉద్యోగుల ప్రతినిధులను పిలవండి. నేను మాట్లాడతాను"

అందరూ బయటకు పరుగెత్తారు. మరొక అరగంటలో ఉద్యోగస్థుల తరపున వాళ్ళ లీడర్ వచ్చాడు. అతను కూడా ఆ సంస్థలో చాలారోజుల నుండి పనిచేస్తున్నాడు. నిజాయితీగా పనిచేసే ఉద్యోగి.

"ఇన్నాళ్ళూ అందరం కలిసి నడుపుకు





వస్తున్న సంస్థని ఇలా కూల్చేయటానికి మీకు మనసెలా వచ్చింది? " సూటిగా అడిగాడు మల్హోత్రా.

"ఒక నెల సర్దుకున్నాం సార్! రెండో నెల కూడా భరించాం! మేము పనిచేస్తున్నది లాభాల కోసం కాదు, జీతాల కోసం. సంస్థ నష్టాల్లో ఉందని మాకూ తెలుసు. కానీ, లాభాలు వచ్చినపుడే జీతాలు ఇస్తామంటే మేము ఏమి కావాలి? అడగ్గా అడగ్గా ఇవాళ ఇస్తామన్నారు. కష్టాలు తీరుతాయని అందరం సంతోషించాం. అదీ జరగలేదు. ఎందుకంటే బ్యాంకులో చెక్కు రిజెక్ట్ అయిందన్నారు. మా స్థానంలో మీరుండి ఆలోచించండి. నాలుగు నెలలు జీతాలు రాకపోతే ఏ ఉద్యోగి పరిస్థితి అయినా ఎలా ఉంటుందో మీరు ఊహించలేరు. అప్పులిచ్చి వెంటబడుతున్నవారిని తప్పించుకుని తిరగలేక సిగ్గుతో తలలు వాల్చుకుంటున్నాం. మీరిచ్చే జీతాల కోసం ఇళ్ళ దగ్గర ఎదురు చూస్తున్న మా కుటుంబ సభ్యుల పరిస్థితి ఏమిటి? ఎక్కువ జీతాలు వచ్చే వాడికి ఎక్కువ ఖర్చులు ఉంటాయి తప్ప మిగిలేదేమీ ఉండదు. మా బాధలు ఎవరికి చెప్పుకోవాలి? అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాం. నిజమే! ఫలితం బాధాకరమే! అయినా తప్పలేదు" చెప్పాడు యూనియన్ లీడర్.

మల్హోత్రాకి కూడా అతని వాదన సబబే అనిపించింది. "నేను మిమ్మల్ని తప్పు పట్టను. కానీ ఇన్ని రోజులు వేచి ఉన్న మీరు మరొక రెండు రోజులు ఆగలేకపోయారా? సమస్య మనలో మనం పరిష్కరించుకునేవాళ్ళం" సామరస్యంగా అన్నాడు.

"సంస్థ చెక్కు రిటర్న్ అవటాన్ని అర్థం చేసుకోగలం. కానీ మీ వ్యక్తిగత ఖాతాలోని చెక్కు కూడా రిటర్న్ అయిందని తెలిశాక వేచివుండటంలో అర్థం లేదనిపించింది"

"అసలు చెక్కు బౌన్స్ కావటమేమిటి? బ్యాలెన్స్ చూసుకునే ఇచ్చానే" అంటూ బ్యాంకుకి ఫోన్ చేశాడు.

అది అతని వ్యక్తిగత ఖాతా మెయింటెయిన్ అవుతున్న బ్యాంక్.

అవతలవైపు బ్యాంక్ మేనేజర్ నమ్రతగా "యస్ సర్! వాట్ కెన్ ఐ డు ఫర్ యు సర్!" అన్నాడు.

"ఇంకేంచేస్తావ్? చెయ్యవలసినదంతా చేశావుగా! నా ఎకౌంట్లో చెక్కు ఎలా బౌన్స్ అయింది? ఎందుకయింది? "

"బ్యాలెన్స్ తగ్గింది సర్"

"ఎంత తగ్గింది? "

"లక్ష రూపాయలు"

"అదెలా సాధ్యం? మీరు పంపిన స్టేట్‌మెంట్లో బ్యాలెన్స్ చూసే నేను చెక్ ఇష్యూ చేశాను"

"ఏమో సర్! ప్రస్తుతం మీ ఎకౌంట్లో చెక్కు పాస్ చేయటానికి అవసరమైన మొత్తం కంటే బ్యాలెన్స్ లక్ష తగ్గింది. మీకు కావాలంటే మళ్ళీ స్టేట్‌మెంట్ పంపిస్తాను"

"అదంతా పక్కన పెట్టండి. లక్ష రూపాయలు బ్యాలెన్స్ తగ్గిందని 30 కోట్ల రూపాయల చెక్కు రిటర్న్ చేస్తారా? అదీ ఈ మల్హోత్రా ఎకౌంట్లో" కోపంగా అన్నాడు.

"మామూలు పరిస్థితుల్లో అయితే చెయ్యం సర్! కానీ ఉదయం నుండి మీ ఒక్కొక్క ఎకౌంట్ మీదా కోర్టునుండి అటాచ్‌మెంట్ ఆర్డర్స్ వస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో బ్యాలెన్స్ లేకుండా చెక్కు పాస్ చేస్తే అది మా తలకి చుట్టుకుంటుంది" కామ్‌గా చెప్పాడు ఆ మేనేజర్.

'చావు కబురు చల్లగా చెప్పటమనే ఈ కళాత్మక ప్రక్రియను వీళ్ళెక్కడ ప్రాక్టీస్ చేస్తారో' అనుకున్నాడు మల్హోత్రా. చివరకు కాసేపు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి

నట్లు తల విదిలించి "సరే! అయితే ఒక పని చెయ్యండి.. ఆ తక్కువయిన లక్ష ఇప్పుడే క్యాష్ పంపిస్తాను. చెక్కు పాస్ చేయండి"

"కుదరదు సర్!"

"మీరు ఎవరితో మాట్లాడుతున్నారో తెలుసా? ఈ చెక్కు పాస్ చెయ్యకుండా ఆపటం వలన కొన్ని వందల మంది ఉద్యోగుల జీతాలు ఆగిపోతున్నాయి. దయచేసి ఆ చెక్కును పాస్ చేయండి" కోపాన్ని గొంతులో దిగమింగుకుని ప్రశాంతంగా చెప్పాడు మల్హోత్రా.

"మీ పరిస్థితులు నేను అర్థం చేసుకోగలను. కానీ అయామ్ హెల్ప్‌లెస్. మీ అభ్యర్థన కుదరదు సర్!"

"ఏం? " టాపు లేచిపోయేటట్లు అరిచాడు మల్హోత్రా.

"జస్ట్ పది నిమిషాల క్రితం ఈ ఎకౌంట్ మీద కూడా ఎటాచ్‌మెంట్ ఆర్డర్ వచ్చింది సర్. ఇప్పుడు బ్యాలెన్స్ ఉన్నా ఆ చెక్కును పాస్ చెయ్యలేను" మల్హోత్రా అరుపులను పట్టించుకోకుండా చెప్పాడు మేనేజర్.

"షిట్" విసురుగా అంటూ ఫోన్ పెట్టేశాడు మల్హోత్రా.

ఎదురుగా కూర్చుని ఉన్న యూనియన్ లీడర్‌కి మల్హోత్రా పరిస్థితి అర్థం అయింది. ఒక్కొక్కసారి అంతే! మేరునగం లాంటి మనిషికి కూడా మంచినీరు దొరకని పరిస్థితి దాపురించవచ్చు. అందుకే అతను కుర్చీలో నుండి లేచి మౌనంగా బయటకు వెళ్ళిపోయాడు.

ఈసారి మల్హోత్రాకి వెళ్ళిపోతున్న ఆ యూనియన్ లీడర్ని ఆపాలని అనిపించలేదు. ఆపి చేయగలిగింది ఏమీ లేదన్నట్లు నిర్వికారంగా ఉండిపోయాడు అతను. అతనికెందుకో ఆ సమయంలో మహాభారతంలోని కర్ణుడు గుర్తుకువచ్చాడు.

యుద్ధరంగంలో దుర్యోధనుడికి ఇచ్చిన మాటను నిలబెట్టుకుని అర్జునుడ్ని వధించే అవకాశం వచ్చినపుడు, ఆఖరి నిమిషంలో ప్రయోగించవలసిన మంత్రాలు గుర్తుకు రాక అతని అస్త్ర శస్త్రాలు పనిచేయలేదు. జీవితాంతం కష్టపడి సంపాదించుకున్న ఆయుధాలు అవసరానికి ఉపయోగపడక పోవటంతో నిస్సహాయుడిగా మారిపోయాడు.

తనూ అంతేనా? తనకున్న పరిచయాలు, పలుకుబడీ తనను ఈ సమస్యల నుండి బయటపడెయ్యలేవా?

ఏదో ఆలోచన వచ్చినట్లు, "దిలీప్!" గట్టిగా కేక పెట్టాడు మల్హోత్రా.

పరుగెత్తుకుంటూ వచ్చాడు దిలీప్.

"ఈ సమస్యలన్నిటికీ సమాధానం ఇప్పుడు కాకపోతే రేపు దొరుకుతుంది. ముందు మన ప్రయారిటీ ప్రయాణికుల ఇబ్బందులను సాధ్యమయినంత తగ్గించటం. ఒకసారి వారి గుడ్‌విల్ పోగొట్టుకుంటే మళ్ళీ దొరకదు. ఎయిర్‌పోర్టుల్లో చిక్కుకుపోయిన వారిని వీలయినంత త్వరగా వేరే ఎయిర్‌లైన్స్ విమానాల్లో వారివారి గమ్య స్థానాలకు చేర్చండి. ఎంత డబ్బు ఖర్చు అయినా ఫరవాలేదు. ఎక్కువ సేపు ఆలస్యం అయ్యేటట్లు ఉంటే వారందరికీ స్టార్ హోటళ్లలో బస ఏర్పాటు చేయండి. ఫ్లైట్ దొరకటం కంటే మిస్ అవటమే బాగుందని వారు అనుకునేలా అతిథ్యం ఇవ్వండి. దానికి కావలసిన డబ్బు నేను ఏర్పాటు చేస్తాను" చకచకా ఆదేశాలిచ్చాడు మల్హోత్రా.

ఆ మాటలు చెప్తున్నప్పుడు రహస్యంగా క్యాష్ రూపంలో దాచిన బ్లాక్‌మనీ అతని ఊహల్లో మెదులుతోంది.

ఆదేశాలు అందుకున్న దిలీప్ వచ్చినంత వేగంగా బయటకు వెళ్లిపోయాడు.

'ఇన్నాళ్లూ తను పెంచుకుంటూ వచ్చిన

రాజకీయ సంబంధాలను వాడుకోవాలి. పోషించుకుంటూ వస్తున్న రాజకీయ నాయకులను ఇలాంటి సమయంలో కూడా ఉపయోగించుకోకపోతే ఇక ఈ సంబంధాలకు అర్థం లేదు' అనుకున్నాడు మల్హోత్రా.

అందరూ బయటకు వెళ్లిపోవటంతో ఆ గదిలో ఒంటరిగా మిగిలిపోయాడు మల్హోత్రా.

మానసికంగా అలసిపోయినట్లు అనిపించటంతో రెండు చేతుల మధ్యా తల పట్టుకుని మోచేతులు టేబుల్ మీద ఆనించి కూర్చుండి పోయాడు అతను. జీవితంలో మొదటిసారి ఓడిపోతానేమో అన్న భయం కలిగింది.

అతనికెప్పుడూ దేవుడి అవసరం కలుగలేదు. దేవుడ్ని ఏదీ అడగవలసిన అవసరం కూడా కలగలేదు. అందుకే అతను ఎప్పుడూ ప్రార్థన చెయ్యలేదు. కానీ ఇప్పుడు అడగాలనిపిస్తోంది. సహాయం చేయమని అర్థించాలని అనిపిస్తోంది. కానీ దేవుడ్ని ఎలా అడగాలో, ఏమని అడగాలో అతనికే తెలియటం లేదు.

ఆలోచనల మధ్య అతని బాధంతా ఆక్రోశం రూపంలో బయట పడింది. "నాకే ఎందుకు ఇలా జరిగింది? గాడ్! సమాధానం చెప్పు" పెద్దగా, అరుస్తూ ఆకాశం వైపు చూశాడు.

ఎవరికి తెలిసింది కాబట్టి, సమాధానం అతనికి తెలియటానికి?

★ ★ ★

"చెప్పు! సమాధానం ఏమి చెప్తావో? " అన్నాడు సహదేవుడు.

"నాకేమి సంబంధం? అతను దేవుడ్ని ప్రశ్నలు అడుగుతుంటే మధ్యలో సమాధానం నన్ను చెప్పమంటారేమిటి? "

"నీ వలనేగా అతనికా గతి పట్టింది!"

"ఏమిటిదంతా నేను అతని దగ్గర నుండి తీసుకున్న లక్ష వల్లే!!" ఆశ్చర్యంగా అడిగాడు ఆదిత్య.

"ఆహా! ఇంకా అనుమానమా? " సమాధానమిచ్చాడు సహదేవుడు.

"ఇదేదో మీ దేవుడు చేస్తున్న కుట్ర తప్ప, ఒక లక్ష రూపాయలు తగ్గితే ఇంత పెద్ద విమానయాన సంస్థ మునిగిపోతుందా? నేను నమ్మను"

## కాదనకూడదనుకున్నాడేమో?

ఒకసారి స్వీడిష్ జర్నలిస్టు ఒకరు మార్గరెట్ థాచర్‌ను ఫిలిం స్టూడియోలో 'గాల్లోకి ఎగురుతున్నట్లుగా షూట్ చేస్తాను, ఒకసారి పైకి ఎగరండి!' అని కోరాడు.

దానికామె, 'నేను పెద్దపెద్ద అంగలతో అడుగులేసుకుంటూ ముందుకెళతానేగానీ నాలుగ్గోడల మధ్య స్టూడియోలో చిన్నగా ఎగరలేను' అంది.



దానికతడు 'రష్యా అధ్యక్షుడు గోర్బచేవ్‌ను గాలిలో ఎగురుతూ పోజ్ ఇవ్వమని అడిగితే వెంటనే కాస్త పైకెగిరాడు. మీరెందుకు అలా చేయరు?' అని అడిగాడు జర్నలిస్టు.

దానికామె 'బహుశా స్వేచ్ఛాయుత సమాజమంటే ఆయన తప్పుగా అర్థం చేసుకున్నారేమో! ఎవరెలా చేయమని అడిగితే ఆలోచించకుండా అలాగే చేయాల్సివుంటుందని భావించాడేమో మరి!' అని అంది. దాంతో అందరూ గొల్లుమన్నారు. అప్పటికింకా కమ్యూనిస్టు రష్యా సంస్కరణల బాట చేపట్టి ప్రజాస్వామ్యంలోకి మారలేదు.

"మునిగిపోవటానికి లక్షే తగ్గనవసరం లేదు. ఒక్కోసారి రూపాయి తగ్గటం వల్ల కూడా వ్యాపారాలు దివాళా తీయవచ్చు. అయినా చేసేదంతా నువ్వు చేసి మధ్యలో దేవుడిని అంటావెందుకు? ఎంత పెద్ద పేకమేడ కట్టినా, చివరి కార్డు బరువు మోయలేకే ఆ మేడ కూలిపోతుంది. అలాగే మల్హోత్రా సంస్థ దెబ్బతినటానికి కారణమయిన పరిస్థితులన్నీ ఎప్పటినుండో ఏర్పడుతున్నవే! దేవుడేమన్నా ఇప్పటికిప్పుడు హఠాత్తుగా కల్పించాడా? అలాగే నీ పరిశీలనకు ఆ సంస్థను సెలెక్ట్ చేసుకున్నది నువ్వు. వారి దగ్గర నుండి లక్ష మాయం చేయించింది నువ్వు. ఆ సంస్థ ఇలా అవటానికి కారణాలు ఎన్నయినా ఉండవచ్చు. అయితే ఆఖరి దెబ్బ మాత్రం నీ లక్ష వల్లే తగిలింది. ఏమో! ఆ చెక్ పాస్ అయి ఉంటే పరిస్థితి ఎలా ఉండేదో? ఇంత పెద్ద సామ్రాజ్యం కూలిపోయే పరిస్థితుల్లోకి వెళ్ళి ఉండేది కాదేమో! ఇప్పుడు చూడు.. ఎంత మంది రోడ్డున పడతారో! వారి కుటుంబాలన్నీ మొరపెట్టుకునేది ఎవరికి? దేవుడికేగా? వారికేమి చేసి న్యాయం చేయమంటావ్? "

"ఇది అన్యాయమండీ! మీరు నాకు పూర్తి అధికారం ఏమన్నా ఇచ్చారేమిటి? ఎవడో ఒకడిని బాగుచేసి చూపించమన్నారు. నాకు న్యాయమనిపించింది నేను చేశాను. ఇప్పుడిలా నిష్టూరాలాడితే నేనేమి చెయ్యను? "

నవ్వాడు సహదేవుడు. "ఇంకా రోజు పూర్తి కాలేదు. ఈలోపు నువు చేసిన పని వలన ఇంకా ఎన్ని వింతలు జరుగుతాయో చూద్దాం" అని, "ఇప్పుడు మనం ఢిల్లీ వెళ్ళాలి" అన్నాడు.

"ఢిల్లీకా? అక్కడికి ఎందుకు? "

"నీ ఎక్కువ ఉన్నవాడి నుంచి కొంచెం లాక్కుని తక్కువ ఉన్నవాడికి ఇచ్చే నీ సమానతా స్కీములో భాగంగా ఒక మనిషి ఆరోగ్యాన్ని ఒకింత తగ్గించావు. గుర్తుందా? "

"అవును. పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ ఛైర్మన్ ప్రకాష్ సింగ్ గారికి తగ్గించి, ఆ ఆరోగ్యం బిచ్చగాడికి ఇచ్చాం"

"అదే! ఆయన పరిస్థితి ఎలా ఉందో చూసి వద్దాం, పద!"

"అవసరమంటారా? " సందేహంగా అన్నాడు ఆదిత్య.

"నువ్వు చేసిన పని వల్ల కలిగిన ఫలితం చూసుకోవటానికి నీకే అంత డోలాయమానమెందుకు? పద" అన్నాడు సహదేవుడు.

ఇద్దరూ అక్కడి నుండి మాయమయ్యారు.




**అ**ది ఢిల్లీలో పెద్ద పేరున్న కార్పొరేట్ హాస్పిటల్. దాని పదో అంతస్తులోని విశాలమయిన గదిలో మంచం మీద ఉన్నాడు ప్రకాష్ సింగ్.

విశాలమైన మంచం, మెత్తటి పరుపు మీద బక్కపలుచగా ఉన్న ఆయన పడుకున్నాడు. ఆయన శరీరం ఆయనకు సహకరించకపోయినా, బుద్ధి మాత్రం ఇంకా బానే పనిచేస్తోంది.

హాస్పిటల్ కిటికీకున్న అద్దాల నుండి దూరంగా పార్లమెంటు భవనం కనిపిస్తోంది. దానికి కొద్ది ఎడంగా రాష్ట్రపతి

భవనం ఉంది. దేశ సార్వభౌమత్వానికి చిహ్నాలయిన ఆ సౌధాలను చూసినప్పుడల్లా ఆయన మనసు ఆనందంతో పులకరిస్తోంది.

చాలా సంవత్సరాల క్రితం రాష్ట్రపతి చేతుల మీదుగా అందుకున్న 'పద్మశ్రీ' అవార్డు గుర్తుకు వచ్చింది. ఈ మధ్య తన పుట్టినరోజు సందర్భంగా కేంద్ర మంత్రి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. తన పేరు 'పద్మభూషణ్' అవార్డు కోసం పరిశీలిస్తున్నారంట. కానీ, వారు అది ఇచ్చినా తీసుకోవటానికి తను ఉంటాడా?

ఇప్పటివాడా తను? స్వాతంత్ర్యం రావటానికి పాతిక సంవత్సరాల ముందు పుట్టాడు. అతనిది బాగా డబ్బున్న కుటుంబం. ప్రకాష్ సింగ్‌ని చదివించాలని తల్లిదండ్రుల కోరిక. కుర్రవాడికి కూడా తెలివితేటలు ఎక్కువే! ఎప్పుడు ఏ పరీక్ష పెట్టినా అతనిదే ప్రథమ స్థానం. అయితే అతను ఉన్న ప్రాంతంలో కాలేజీ చదువు లేదు. అందుకే తల్లిదండ్రులు అతన్ని ఢిల్లీలోని ప్రముఖ కాలేజీలో చదువుకోవటానికి పంపారు.

ఢిల్లీ నగరం అతనికి అనేక విషయాలు నేర్పింది. చదువే కాకుండా చదవవలసిన ప్రపంచం ఎంత విశాలమయినదో తెలిసింది. అప్పటికే గాంధీగారి నాయకత్వంలో స్వతంత్రం కోసం ఉద్యమం ఉధృతంగా జరుగుతోంది.

మరోవైపు ప్రపంచంలోని దేశాలన్నీ రెండవ ప్రపంచ యుద్ధంలో తలమునకలయి ఉన్నాయి. యుద్ధం ముగియగానే స్వాతంత్ర్యం ఇస్తామన్న వాగ్దానంతో బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల సాయాన్ని అర్థించింది.

మిగిలిన వారి సంగతి ఏమో కానీ, ప్రకాష్ సింగ్ బ్రిటిషు వారి మాటలు నమ్మలేదు. వాళ్ళు ఎప్పుడో ఏదో ఇస్తారని ఎదురు చూస్తూ కూర్చోటం అతనికి నచ్చలేదు. మరికొంతమంది యువకులతో కలిసి బాంబులు వేసి బ్రిటిషు సామ్రాజ్యం మీద దాడి చేయాలనే ప్రయత్నంలో పాలుపంచుకున్నాడు.

ఆ విషయం ఆ నోటా ఈ నోటా ప్రకాష్ సింగ్ తండ్రికి తెలిసింది. కొడుకుని ఇక్కడే ఉంచితే అతని ప్రాణాలకే ప్రమాదం తెచ్చుకుంటాడని భావించిన ఆయన ప్రకాష్ సింగ్‌ని చదువుల నెపంతో అమెరికా పంపాడు. అక్కడ సివిల్ ఇంజనీరింగ్ చదవటానికి పూనుకున్నాడు ప్రకాష్ సింగ్.

అప్పటివరకు స్వతంత్ర పోరాటం మీద ఉన్న ధ్యాసని చదువుమీదకి మరలించాడు ప్రకాష్ సింగ్. అతను ఏకసంథాగ్రాహి. ముఖ్యంగా లెక్కల విషయంలో అతని మెదడు పాదరసంలా పనిచేసేది. కంప్యూటర్లు లేని ఆ రోజుల్లోనే ఇప్పటి కంప్యూటర్ల వేగంలాంటి వేగంతో లెక్కలు కట్టేవాడు.

అప్పట్లో ఒకసారి ప్రాజెక్టువర్కులో భాగంగా విద్యార్థులందరినీ ఒక నది మీద కడుతున్న సస్పెన్షన్ బ్రిడ్జి గురించి నేర్చుకోవటానికి తీసుకెళ్ళారు. సస్పెన్షన్ బ్రిడ్జి అంటే మధ్యలో ఎక్కడా పిల్లర్లు లేకుండా కట్టే బ్రిడ్జి. ఎంతో జాగ్రత్తగా కట్టాలి. ఏ మాత్రం తేడా వచ్చినా కూలిపోతుంది. దాని స్ట్రక్చర్ డిజైన్ చూసిన వెంటనే ప్రకాష్ సింగ్‌కి అందులో లోపం ఉందని అనిపించింది. అదే చెప్పాడు అందరికీ! ఎవరూ నమ్మలేదు. అమెరికన్స్ అయితే అతన్ని గేలి చేశారు.

అతనికీ వాళ్ళకీ మధ్య తీవ్రమైన చర్చ జరిగింది. వారి తప్పుని రుజువు చేస్తానని పంతం పట్టిన ప్రకాష్ సింగ్ రెండు రోజుల శ్రమ తరువాత తను చెప్పిందే నిజం.. అని నిరూపించాడు.

తర్వాత తేలింది ఏమిటంటే మేథమేటికల్ కాలిక్యులేషన్స్‌లో దొర్లిన పొరపాటు వలన మొత్తం స్ట్రక్చరల్ డిజైనింగ్ తప్పయింది. ముందు అనుకున్న ప్రకారం కట్టి ఉంటే ఆ బ్రిడ్జి నిలిచే ఛాన్సు అతి తక్కువని తేలింది. దానితో అమెరికా మొత్తం ప్రకాష్ సింగ్ ప్రతిభని కొనియాడింది.

అతని గొప్పదనాన్ని గుర్తించిన తోటి విద్యార్థులు, ప్రొఫెసర్లు అతన్ని అమెరికాలోనే ఉండిపొమ్మని బతిమాలినా అతను ఒప్పుకోలేదు. చదువు పూర్తికాగానే తన దేశం వెళ్ళాల్సిందే అని తేల్చి చెప్పాడు.

ప్రకాష్‌సింగ్ చదువు పూర్తి కావటం, దేశానికి స్వాతంత్ర్యం రావటం ఒకేసారి జరిగాయి.

ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయకుండా వెంటనే స్వదేశం చేరుకున్నాడు అతను. అప్పుడప్పుడే విదేశీ శృంఖలాల నుండి విముక్తి అయిన దేశం అభివృద్ధి పథంలో నడవటానికి ఎదురు చూస్తోంది.

అతని కంటే ముందు అతని పేరు ప్రఖ్యాతులు ఇక్కడికి చేరాయి. ఎన్నో కంపెనీలు అతన్ని తమ దగ్గర పనిచేయమని అడిగాయి.

అయితే ప్రకాష్ సింగ్ ఆలోచనలు వేరుగా ఉన్నాయి.

అమెరికాలో జరుగుతున్న అభివృద్ధి ఇక్కడ సాధించాలంటే ఒక్కరితో సాధ్యం కాదని అతనికి తెలుసు. అందుకే ఒక గొప్ప కంపెనీని తయారు చేయాలనుకున్నాడు.

తన పేరు మీద పి.ఎస్ కన్‌స్ట్రక్షన్స్ అని కొత్త కంపెనీ పెట్టాడు. దానిని ముందు మనదేశంలో, తర్వాత ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్ఠాత్మక కంపెనీగా తీర్చిదిద్దాడు.

కంపెనీ కోసం పాటుపడుతూనే దేశానికి అవసరమైన ఏ పని అయినా లాభ నష్టాలతో సంబంధం లేకుండా చేస్తూ వచ్చాడు. ఆయన సిన్సియారిటీని ప్రజలు, ప్రభుత్వం అందరూ గుర్తించారు. అనేక బిరుదులతో సత్కరించారు.

ప్రస్తుతం ఆయన వృద్ధాప్యం వల్ల వచ్చే అనేక సమస్యలతో బాధపడుతున్నాడు. ఈ మధ్య ఆరోగ్యం హఠాత్తుగా క్షీణించటంతో ఈ హాస్పిటల్లో చేర్చారు.

తొంభై ఏళ్ళ వయసులో కూడా ఆయన అనారోగ్య వార్తలతో కంపెనీ షేరు విలువ ఇరవైశాతం పడిపోయిందంటే మార్కెట్లో ఆయనమీద ఉన్న నమ్మకమేమిటో తెలుస్తుంది.

ఆయన వారసులు తక్కువ వారేమీ కాదు. కంపెనీని ప్రాణప్రదంగా చూసుకుంటున్నారు. పైగా కేవలం తన కుటుంబంలోని వారినే కాక, నైపుణ్యం ఉన్న ప్రొఫెషనల్స్ ఎక్కడ ఉన్నా ప్రోత్సహిస్తూ పైకి తీసుకువచ్చాడు ఆయన.

ప్రస్తుతం ఆయన శరీరం ఆయనకు సహకరించటం లేదేమో కానీ మేధస్సు మాత్రం చురుకుదనం కోల్పోలేదు.

స్వదేష్ సింగ్ ఆయన కొడుకు. కంపెనీ వ్యవహారాలన్నీ చూస్తున్నది అతనే! దేశం మీద అభిమానంతో కొడుక్కి ఆ పేరు పెట్టుకున్నాడు ప్రకాష్ సింగ్.

ఆ రోజు ఉదయాన్నే హాస్పిటల్‌కు వచ్చాడు స్వదేష్ సింగ్. తండ్రి అనారోగ్యంతో హాస్పిటల్లో చేరిన దగ్గర నుండి కంపెనీ వ్యవహారాలు పూర్తిగా అతనే చూసుకుంటున్నాడు. ఎప్పటి నుండో కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్‌గా వ్యవహరిస్తున్నా, స్వతంత్రంగా తనే ఈ వ్యవహారాలన్నీ చూడవలసి రావటంతో ఒకింత ఒత్తిడిలో ఉన్నాడు అతను. అదే ఇంతకు ముందు అయితే ఏ సమస్య వచ్చినా వెనుతిరిగి చూడటానికి పెద్ద దిక్కులాగా తండ్రి ఉండేవాడు.

"నాన్నగారూ! ఇవిగో ఈరోజు పేపర్లు"

ఆ రోజు వచ్చిన అనేక దిన పత్రికలు అక్కడ పెడుతూ అన్నాడు స్వదేష్ సింగ్.

"ఏమన్నా ముఖ్యమయిన వార్తలు ఉన్నాయా?" నీరసంగానే అయినా స్పష్టంగా మాట్లాడుతున్నాడు ప్రకాష్ సింగ్.

"ఈ రోజు ముంబయిలో మన కంపెనీ ప్రతిష్ఠాత్మకంగా చేపట్టి నిర్మించిన ఫ్లై ఓవర్ ప్రారంభోత్సవం చేసుకోబోతోంది. ఎయిర్‌పోర్టుని నగరానికి అనుసంధానం చేస్తూ నిర్మించిన టూ టయర్ ఫ్లై ఓవర్ ఒక ఇంజినీరింగ్ మార్వెల్ అని అందరూ పొగుడుతున్నారు. దీని ప్రారంభంతో ముంబయి ట్రాఫిక్ సమస్యలు కొంత వరకూ తగ్గుతాయి. ఈ రోజు చాలా పేపర్లలో దాని గురించే రాశారు"

తన కంపెనీ గురించిన వార్తలు దిన పత్రికల్లో ఉన్నాయని తెలియటంతో లేని ఓపిక తెచ్చుకుని పేపర్లు తిరగేయటం ప్రారంభించాడు ప్రకాష్ సింగ్. అన్ని పేపర్లలో ప్రకాష్ సింగ్ ఫోటో ప్రముఖంగా ప్రచురించారు. ఆయన ఇంతకుముందు సాధించిన విజయాల గురించి వివరంగా రాశారు. వాటన్నిటిలో ఏమి రాసి ఉంటారో ఆయనకు బాగా తెలుసు. తన గురించిన పొగడ్తలతో అవన్నీ నిండిపోయి ఉంటాయి.

ఒక పక్క తన కంపెనీ సాధించిన విజయాలకు గర్వంగా ఉన్నా, అవన్నీ చదివే ఓపిక లేక పక్కన పడేశాడు. తరువాత ఆయన తన ఫేవరేట్ పత్రిక అయిన 'సివిల్ ఇంజినీర్స్ టుడే' అన్న మేగజైన్ చేతిలోకి తీసుకున్నాడు. ఆయన ఆ పత్రికను అనేక సంవత్సరాలుగా ఫాలో అవుతున్నాడు.

కాజువల్‌గా పేజీలు తిప్పుతున్న ఆయన హఠాత్తుగా ఆగిపోయాడు. 'ప్రకాష్ సింగ్ గర్వం దేశానికి అవమానం కాబోతుందా?' అన్న శీర్షికతో ఒక కథనం ప్రచురించబడి ఉంది.

"ఏమిటిది?" అడిగాడాయన కొడుకుని చూస్తూ. "దీన్ని చూశావా?"

"నేనే కాదు. మన కంపెనీలో అందరం చూశాం.."

"ఎవరిది రాసింది?"

"ఎవరో బచ్చా! ఐ.ఐ.టి.లో చదువుతు

## చిలుక ఎగిరిపోయింది!

కన్జర్వేటివ్ పార్టీ సమావేశాలు 1990లో జరుగుతున్నాయి. మార్గరెట్ థాచర్‌పైన పార్టీ లోపల, బయట కూడా విమర్శల దాడులు



ఎక్కువయ్యాయి. అలాంటి గడ్డుకాలంలోనే ఉదారవాద డెమోక్రాట్లు ఎగురుతున్న చిలుకను తమపార్టీ గుర్తుగా కొత్తగా ప్రకటించారు. డెమాక్రాట్లకు తగిన సమయం, సందర్భం చూసి చురకంలంటిస్తూ తమ పార్టీ సమావేశాల్లో థాచర్ మాట్లాడాల్సివుంది. ఆమె ప్రసంగపాఠాన్ని సిద్ధం చేసిన జాన్ డెమోక్రాట్ల చిలుకగుర్తు నాటి సుప్రసిద్ధమైన ఒక కామిక్ పుస్తకంలోని పక్షి మాదిరిగా ఉందని రాశాడు. ఇది నచ్చిని థాచర్ ఆ చిలుక విషయం దగ్గరకు రాగానే 'లిబరల్ డెమోక్రాట్లు ప్రవేశపెట్టిన ఈ కొత్త చిలుక గుర్తును చూశారా? అదెలాగుంది? అందులోని ప్రాణిపక్షి ఎప్పుడో ఎగిరిపోయింది. ఆ చిలుక చచ్చిపోయింది. అది టపాకట్టి ఎక్కడికి వెళ్ళిందనుకుంటున్నారు? తన సృష్టికర్తను కలుసుకునేందుకు స్వర్గానికి పోయింది' అందామె.

దాంతో సభికులంతా హర్షధ్వానాలు చేశారు.

న్నాడంట"

ప్రకాష్ సింగ్ తన మీద పొగడ్తలతో కూడిన ఆర్టికల్స్ అన్నిటినీ పక్కన పెట్టి తనను విమర్శిస్తూ రాసిన ఆ ఆర్టికల్ చదవటం మొదలు పెట్టాడు.

దేశంలోనే మొదటిసారి కడుతున్న టూ టయర్ ఫ్లైఓవర్ డిజైనింగ్‌లో లోపం ఉందని అభియోగం మోపాడు ఆ కుర్రాడు. ఎన్నోసార్లు ఆ విషయం కంపెనీకి చెప్పినా ఎవరూ పట్టించుకోలేదని, అలాగే ఆ ప్రాజెక్ట్‌కి సంబంధించిన స్ట్రక్చరల్ డిజైనులు తనకు చూపించటానికి కంపెనీ అంగీకరించటం లేదని ఆరోపణలు చేశాడు. కంపెనీ అలసత్వం వలన ప్రాజెక్ట్ దెబ్బతింటే అది కేవలం పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ పరువుప్రతిష్టల సమస్యగా మిగిలిపోదనీ.. ఇంత చిన్న ప్రాజెక్టును పూర్తి చేయలేకపోయినందుకు దేశ ప్రతిష్టే మసకబారుతుందనీ రాశాడు.

అతను చర్చించిన మిగిలిన విషయాల సంగతెలా ఉన్నా తన కంపెనీ వలన దేశ ప్రతిష్టకు భంగం కలుగుతుందన్న ఆరోపణ ప్రకాష్ సింగ్ మనసును చివుక్కుమనిపించింది.

"ఇదంతా నిజమేనా? " కొడుకుని అడిగాడు ఆయన.

"అతని అభియోగాలన్నీ మన ఇంజినీర్లు ఒకటికి రెండుసార్లు పరిశీలించారు. ఎవరికీ ఏ లోపమూ కనపడలేదు. అతను వ్యక్తిగత ప్రచారం కోసం మన మీద బురద చల్లుతున్నాడు తప్ప మరే కారణం లేదు"

అభావంగా చూశాడు ప్రకాష్ సింగ్. "మరి ఈ విషయం ఇంతవరకు నాకెందుకు చెప్పలేదు? "

"ఇది మీ వరకూ రావలసిన విషయం కాదని అనుకున్నాం"

"ఆ ప్రాజెక్టుకు సంబంధించిన స్ట్రక్చర్ డిజైన్లు, సాయిల్ టెస్ట్ రిపోర్టులు ఒకసారి చూపించు"

స్వదేశ్ సింగ్ మనసులో విసుక్కున్నా బయటపడలేదు. 'ఇప్పుడీయనకి ఆ వివరాలన్నీ ఎందుకో? ' అనుకున్నా, పెద్దాయన మాటకు ఎదురు చెప్పే అలవాటు లేదు కాబట్టి, "ఇప్పుడే పంపిస్తాను నాన్నగారూ" అని బయటకు వెళ్ళిపోయాడు.

అప్పటి నుండి చాలా అసహనంగా గడిపాడు ప్రకాష్ సింగ్.

ఆయన్ని పర్యవేక్షిస్తున్న డాక్టర్లకు కూడా ఆయన ఎందుకంత ఆందోళనగా ఉన్నాడో అర్థం కాలేదు. ఎంతమంది ఎన్ని రకాలుగా ప్రశ్నించినా ఆయన సమాధానం చెప్పలేదు.

తమ ఆఫీసుకు చేరుకున్న స్వదేశ్ సింగ్ మరొక గంట తరువాత తన తండ్రి అడిగిన ఫైల్ బయటకు తీయించాడు. దానిని తీసుకుని హాస్పిటల్‌కి బయలుదేరుదామనుకున్నంతలో అర్జెంటు పని ఒకటి వచ్చింది. దానితో ఆ ఫైల్ డ్రైవర్‌కి ఇచ్చి పంపాడు.

డ్రైవర్ తెచ్చిన ఫైల్ ఆత్రంగా అందుకున్నాడు ప్రకాష్ సింగ్.

చదవటానికి వీలుగా బెడ్ ఎత్తు మార్చమని సైగ చేయటంతో డ్రైవర్ నర్సును పిలుచుకు వచ్చాడు. ఆమె వచ్చి బెడ్ భాగం ఎత్తుగా వచ్చేలా మంచాన్ని సరిచేసింది.

అందరినీ బయటకు వెళ్ళమని ఆయన ఆ ఫైల్ చదవటంలో మునిగి పోయాడు.

క్లిష్టమయిన డ్రాయింగులను, కాలిక్యులేషన్లను అర్థం చేసుకోవటానికి ఆయనకు పది నిమిషాలు కూడా పట్టలేదు. తరువాత ఫైలంతా ఒకసారి తిప్పి చూశాడు. ఆయనకు కూడా అందులో ఏ పొరపాటూ కనపడలేదు. దేశంలోనే అత్యుత్తమమయిన ఇంజినీర్లు తయారు చేసిన రిపోర్టు

అది. తప్పులుండటానికి.. అందులోనూ ఆ కుర్రాడు చెప్పినటువంటి బ్లండర్ ఉండటానికి అవకాశం లేదు. అయినా ఎందుకో తెలియదు.. ప్రకాష్ సింగ్ మనసు ఆ కుర్రవాడినే సమర్థిస్తోంది. ఆయనకు ఆ కుర్రవాడిలో అరవైఐదు సంవత్సరాల క్రితంనాటి తన ఛాయలు కనిపిస్తున్నాయి. అనవసరమయిన భేషజాలకు పోకుండా ఆ కుర్రవాడిని పిలిపించి, అతను అడిగిన డిజైనులు చూపించి, తీరికగా మాట్లాడి ఉంటే ఎలా ఉండేదో? కానీ ఇప్పుడు అంత తీరిక ఎవరికి ఉంది?

అయినా ప్రకాష్ సింగ్ మరలా ఆ ఫైల్ దీక్షగా చదవటం మొదలు పెట్టాడు. ఆయనకి ఆ కాస్త శ్రమకే గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆయనకు నెమ్మదిగా తమ డిజైన్లలో ఏదైనా లోపం ఉంటుందేమో అన్న అనుమానం నెమ్మదిగా తొలగిపోతోంది.

తనుకూడా ఇలాంటి లోపాన్ని ఎత్తి చూపే ఒక్కసారిగా లైమ్‌లైట్‌లోకి వచ్చాడు. ఇప్పుడు ఈ కుర్రవాడు ఎవరో కానీ ఆ ప్రయోగం తన కంపెనీ మీదే చేశాడా?

కానీ ఆ కుర్రాడు చెప్పింది నిజమై తాము ఎవరం ఈ విషయం పట్టించుకోక ఏదైనా ప్రమాదం జరిగితే ఆ కుర్రాడికి జరిగే నష్టం ఏమీ ఉండదు. పైగా లాభం కూడా! అదే జరిగితే తన కంపెనీ పరిస్థితి ఏమవుతుంది? తమ పొరపాటు వలన వందలాది ప్రాణాలు ప్రమాదంలో పడితే ఇక తన కంపెనీ కోలుకోగలదా? ఇలాంటి ఆలోచనల మధ్య ఆయన లేని ఓపిక తెచ్చుకుని ఫైల్ పరిశీలిస్తున్నాడు.

ఇంతలో ఆయన దృష్టి యాదృచ్ఛికంగా మేథమేటికల్ కాలిక్యులేషన్స్‌లో చూపించిన ఫ్లై ఓవర్ కోణంమీద పడింది. అంతే! ఆయన షాకయ్యాడు. 36 డిగ్రీల కోణం ఉండవలసిన చోట ఒక అంకె ఎగిరిపోయి 6 డిగ్రీలని ఫీడ్ అయింది. మొత్తం డిజైనంతా ఆ లెక్కల మీద ఆధారపడే జరిగింది.

ఆ పొరపాటు ఫలితం తలచుకున్న ఆయన ఒక చల్లని మేఘం తనని చుట్టుముట్టినట్లు వణికాడు.

'ఆపాలి' అనుకున్నాడాయన. 'ఎలాగయినా ఫ్లైఓవర్ ప్రారంభోత్సవాన్ని ఆపాలి. డిజైన్ లోపాన్ని సరిచేసి ఫ్లై ఓవర్ మీద ప్రయాణం ప్రమాద రహితం అనుకున్న తరువాతే దానిని జాతికి అంకితం చేయాలి. లోపాన్ని సరిదిద్దటానికి ఎంత ఖర్చయినా తన కంపెనీనే భరిస్తుంది..' అని ఆలోచిస్తూ నర్సుని పిలవటానికి అరేంజ్ చేసిన బెల్‌వైపు చేయి జరిపాడు.

అయితే ఆ చిన్న పనే ఆయనకు సాధ్యం కావటం లేదు. శరీరం పెద్ద షాకుకు గురయినట్లు వణుకుతోంది. చెయ్యి బెల్‌వరకూ వెళ్ళేందుకు కూడా ఆయన శరీరం ఆయనకు సహకరించటం లేదు.

తన ఆఖరి క్షణాలు ఆసన్నమయ్యాయని ఆయనకు అర్థం అయింది. ఎంత ప్రయత్నించినా తన దగ్గర ఉన్న సమాచారాన్ని బయటకు చేరవేసే మార్గం కనపడటం

## కొత్తగాలి...

**చెట్లు కానరావు**
**అయినా అడవే**
**అవును...**
**ఇది కాంక్రీట్ జంగిల్!**

– ఆరుద్ర శ్రీవిద్య,
ముల్కలపల్లి, వరంగల్ జిల్లా



లేదు. "ఓ.. గాడ్!" అంటూ ఆక్రోశించాడు ఆయన. "నేను ఎప్పుడు నిన్ను ప్రార్థించినా అనాయాస మరణాన్ని ప్రసాదించమని ప్రార్థించేవాడిని. ఇప్పుడు నా మరణాన్ని కొన్ని నిమిషాలు వాయిదా వేయమని వేడుకుంటున్నాను. నాకు మరో మనిషితో మాట్లాడగలిగే సామర్థ్యం ప్రసాదించు. ఈ విషయం ఇతరులకు తెలియకపోతే ప్రమాదం. అది కూడా నా కోసం కాదు. ప్రమాదం జరిగితే పోబోతున్న ప్రాణాలు కాపాడటానికి. దయచేసి నాకు కాస్త ఆరోగ్యాన్నివ్వు" అని ప్రార్థిస్తూ మంచంమీద ఒరిగిపోయాడు ఆయన.

ఆ గదికి ఉన్న కిటికీ నుండి నర్సుతో నవ్వుతూ మాట్లాడుతున్న డ్రైవర్ కనిపిస్తున్నాడు. వాళ్ళెవరూ ఇటు తిరిగి చూడటం లేదు. తమ తమ సంభాషణలో పూర్తిగా నిమగ్నమై ఉన్నారు.

ప్రకాష్ సింగ్ మృత్యువుతో పోరాడుతున్నాడు. డ్రైవర్ కానీ నర్సు కానీ తనవైపు చూడకపోతారా... అన్న ఆశతో ఆయన తన పోరాటాన్ని కొనసాగిస్తున్నాడు.



ఇంతలో డ్రైవర్ అద్దంలో నుండి కనపడుతున్న ప్రకాష్ సింగ్‌ని చూశాడు. ఆయన తన సహాయం అర్థిస్తున్నాడన్న ఆలోచన అతనికి తట్టలేదు. తిరిగి తల తిప్పి నర్సుతో సంభాషణ కొనసాగించాడు.

అప్పుడర్థమైంది ప్రకాష్ సింగ్‌కి - తను ఓడిపోయానని. తన జ్ఞానం తన వద్దే ఉండిపోతుంది. ఎవరికీ పంచే అవకాశం లేదు. అంతేకాదు, ఆయనకు మరో విషయం కూడా అర్థమయింది. తను లేకపోయినా తన కంపెనీ చిరకాలం దేశానికి సేవ చేయాలనుకున్నాడు. కానీ ఇప్పుడది అనుమానమే! ఇంత పెద్ద బ్లండర్ చేసిన కంపెనీకి మనుగడ కొనసాగించే హక్కు లేదు. తనతోపాటే తన కంపెనీ అంతరించిపోతుంది.

చనిపోతున్న చివరి క్షణాల్లో కూడా దేవుడు తనకెందుకు ఇంత శిక్ష విధించాడో ఆయనకు అర్థం కాలేదు.

పది నిమిషాల తరువాత లోపలకు వచ్చిన నర్సుకు మంచం మధ్య అచేతనంగా పడి ఉన్న ప్రకాష్ సింగ్ కనిపిం

చాడు.

ఆయన వయసురీత్యా అది ఊహించిన పరిణామమే కాబట్టి ఆమె పెద్దగా ఆందోళనపడలేదు. గబగబా ఆయన దగ్గరకు నడిచి, పరీక్షించి ప్రాణం పోయిందని నిర్ధారించుకుంది.

తరువాత మంచంమీద ఫైల్ తీసి పక్కనున్న టేబుల్ మీద పెట్టి ప్రకాష్ సింగ్ శరీరాన్ని మంచంమీద సర్ది, దుప్పటికప్పి డాక్టర్ని పిలవటానికి బయటకు నడిచింది ఆమె.

ఆ తరువాత ఆ ఫైల్ విషయం ఎవరూ పట్టించుకోలేదు.

★ ★ ★

## కొత్తగాలి...

**పగలంతా**
**పగోళ్లలా కొట్టుకుంటారు**
**రాత్రయితే**
**రాగరంజితమవుతారు**
**వాళ్లే... మొగుడూపెళ్లాలు!**

*– ఎన్.కె. నాగేశ్వర్,* పెనుగొండ, ప.గో. జిల్లా

"ఇదేమిటి ఇలా జరిగింది? నేను ఒకరికి ఉపయోగపడుతుందని ఇలా చేశాను తప్ప, ఒకరి ప్రాణం పోతుందని అనుకోలేదు" అన్నాడు ఆదిత్య.

ఆ మాటలు అంటున్నప్పుడు అతని గొంతులో నిజంగానే విషాదం ధ్వనించింది.

"జరిగిన దాంట్లో నీ ప్రమేయం కూడా ఉందేమో కానీ, జరిగిన ప్రతి విషయానికీ నువ్వే బాధ్యుడివి కాదు" చేతులు కట్టుకుని నిర్వికారంగా జరుగుతున్నది అంతా చూస్తున్న సహదేవుడు అన్నాడు.

ఇద్దరూ ప్రకాష్ సింగ్ చనిపోయిన హాస్పిటల్ గదిలో ఉన్నారు. అక్కడ ఇప్పుడిప్పుడే హడావుడి ఎక్కువవుతోంది.

ప్రకాష్ సింగ్ ఆరోగ్యం బాగాలేదని అందరికీ తెలిసిన విషయమే అయినా, ఉదయం వరకు మాట్లాడిన వ్యక్తి ఇంత హఠాత్తుగా చనిపోతాడని ఎవరూ అనుకోలేదు.

ఆయన పెద్ద కొడుకు స్వదేశ్ సింగ్ హాస్పిటల్ కు చేరుకున్నాడు. అంత్యక్రియల ఏర్పాట్లు దగ్గరుండి చూసుకుంటున్నాడు.

"ముంబయిలో జరగవలసిన ఫ్లై ఓవర్ ప్రారంభోత్సవాన్ని ఏమి చేద్దాం?" మేనేజర్ స్వదేశ్ సింగ్ని అడిగాడు.

"అది ఆపకూడదు. పైగా నాన్నగారు బతికి ఉన్నా ఇలా ఒకరికోసం ఏ పనీ ఆగిపోవటాన్ని సమర్థించేవారు కాదు. ఆ వేడుకని దాని దోవన దాన్ని జరగనివ్వండి. అక్కడి విషయాలు మీరు చూసుకోండి. ఇక్కడ జరగవలసిన పనులు నేను చూసుకుంటాను" అన్నాడు స్వదేశ్ సింగ్.

అంగీకారంగా తల ఊపుతూ ఆ మేనేజర్ బయటకు వెళ్ళిపోయాడు.

'నాన్నగారు బతికి ఉంటే ఈ ప్రారంభోత్సవం చూసి ఎంత ఆనందించేవారో' ప్రకాష్ సింగ్ శవాన్ని ఆప్యాయంగా చూసుకుంటూ మనసులో అనుకున్నాడు స్వదేశ్ సింగ్.

అయితే చనిపోబోయే ఆఖరిక్షణం వరకూ ప్రకాష్ సింగ్ ఆ ప్రారంభోత్సవాన్ని ఆపాలనుకున్నాడని అతనికి అప్పుడు తెలిసే అవకాశం లేదు.

ఈ సంఘటనలన్నీ గమనిస్తున్నట్లు పక్క టేబుల్ మీద మౌనంగా పడి ఉంది ఫ్లైఓవర్ ఫైల్.

ఎవరి హడావుడిలో వారు అటు ఇటూ తిరుగుతూ ఆ ఫైల్ గురించి ఏమాత్రం పట్టించుకోలేదు.

జరుగుతున్న విషయాలను గమనిస్తున్న

ఆదిత్య దీర్ఘంగా నిట్టూర్చాడు. "మీరెన్న యినా చెప్పండి! జరుగుతున్న సంఘట నలు బాధాకరం. ఇందులో నా ప్రమేయం ఉండటం మరింత బాధాకరం. అదికూడా పక్కన పెట్టండి. జరగబోతున్న ప్రమాదం సంగతి ఏమిటి? ప్రకాష్ సింగ్ జరుగు తుందనుకున్న ఫ్లైఓవర్ ప్రమాదం సంగతి ఎవరికీ తెలియటంలేదు. పోనీ, ఎలాగోలా మనమే ప్రకాష్ సింగ్ లోకానికి చెప్పదల చుకున్న విషయాలు అందరికీ చెప్తే.." అన్నాడు.

"మౌనంగా జరుగుతున్న సంఘటనలు చూడటమే మనపని. పైగా విషయం నువ్వనుకుంటున్నట్లు రహస్యంగా లేదు. ఇంతకుముందే బయటకు వచ్చింది. చర్చ జరిగింది. అయినా ఎవరూ నమ్మలేదు. ఐ.ఐ.టి. స్టూడెంట్ చెప్పిన విషయం పత్రి కల్లోనే ప్రచురితమైంది. వాటన్నిటినీ పట్టించుకోని ప్రపంచం నీ మాటలు వింటుందన్న నమ్మకం ఏమిటి? " అన్నాడు సహదేవుడు.

"ఈ దారుణాన్ని జరగకుండా మనం ఏమీ చెయ్యలేమా? "

"మీ టీవీ ఛానెళ్ళలో కొన్ని ఛానెళ్ళు కేవలం వన్యప్రాణుల మీద ప్రోగ్రాములు చేయటానికి ఉంటాయి కదా! వాటిలో జింకని వేటాడుతున్న పులినీ, ఒకదాన్ని ఒకటి చంపుకుంటున్న అనేక జంతువు లనూ చూపిస్తుంటారు. నువ్వూ చూసే ఉంటావు. అవి తీసే కెమెరామేన్ తను తియ్యటం ఆపి వాటిని రక్షించవచ్చు కదా! అలా చెయ్యడేం? "

"మీరు ప్రతి ప్రశ్నకీ మరో ప్రశ్నతో తప్ప సరైన సమాధానం చెప్పరా? " విసుగ్గా అన్నాడు ఆదిత్య.

"ఎవరి ధర్మం వారు నిర్వర్తిస్తే చాలు. తనకు మాలిన ధర్మం పనికి రాదు"

"అయితే మన తక్షణ కర్తవ్యం? "

"ఇంకా మన పని అయిపోలేదుగా! నువ్వు చేసిన ఘనకార్యం ఇంకొకటి ఉందిగా! మరొక వ్యక్తి మేధస్సు తగ్గిం చావు గుర్తుందా? అక్కడ పరిస్థితి ఏమిటో చూడవద్దూ"

"నాకు భయమేస్తోంది" అన్నాడు ఆదిత్య.

"అయినా తప్పదు" అంటూ మాయం అయ్యాడు సహదేవుడు, అతనితోపాటే ఆదిత్య కూడా.




**మ**హేష్ వయసు నలభై ఏళ్ళు. ఆ వయసులోనే అతను ఒక రాష్ట్రానికి ముఖ్య మంత్రి అయి రికార్డు సృష్టించాడు. రాజకీ యాల్లో యువకులు పైకి రావటమే కష్టమ నుకుంటున్న రోజుల్లో, ఏ రాజకీయ కుటుంబపు నేపథ్యం లేకుండా అంత చిన్న వయసులో ఉన్నత స్థాయికి చేరటం ఒక వింతే! అయితే అది అదృష్టం వలన సమ కూరలేదు. అతని మేధస్సు వలన సమకూ రింది.

ఎలాంటి దురంధరుడయినా, ఎంతటి రాజకీయ మేధావి అయినా ఇతను వేసిన ఎత్తులముందు చిత్తు కావలసిందే! అలా అని అతను ఎవరినీ చులకన చెయ్యడు. ప్రత్యర్థులెవరినీ అవమానించేటట్లు మాట్లా డడు. రాజకీయాల్లో కొత్త రూల్స్ ప్రవేశ పెట్టాడు.

తను అత్యంత నిజాయితీపరుడినని, మిగిలినవారు రాజకీయ అవినీతిపరులని నమ్మించటం ద్వారా అధికారంలోకి వచ్చాడు.

అందులోకి వచ్చాకే తెలిసింది, రాజకీయాలు బయట నుండి చూస్తే ఎంత ఆకర్షణీయంగా కనిపిస్తాయో, లోపల నుండి చూస్తే అంత అధర్మంగా ఉన్నాయనీ. వాటిని మారుద్దామని అతను సిన్సియర్‌గా ప్రయత్నం చేద్దామనుకున్నాడు. చేస్తున్నాడు కూడా! కానీ అతనికి ప్రజలు పూర్తి మెజారిటీ ఇవ్వలేదు. చాలీచాలని బలంతో ప్రస్తుత ప్రభుత్వాన్ని నెట్టుకురావటం దిన దిన గండంగా ఉంది.

ఆ రోజు ఎప్పటిలానే తొమ్మిది గంటలకల్లా వచ్చి తన కార్యాలయంలో కూర్చున్నాడు ముఖ్యమంత్రి మహేష్. మరికాసేపటికి వచ్చాడు ముఖ్యమంత్రికి సలహాదారుడైన ప్రభు. తనకున్న విశేష అనుభవంతో సలహాలిచ్చే అత్యంత నమ్మకస్తుడతడు.

లోపలకు వస్తున్న ప్రభుని ఆనందంగా ఆహ్వానించాడు మహేష్.

వచ్చి కూర్చున్నాడు ప్రభు.

ఇంతలో ఆ రోజు అపాయింట్‌మెంట్లు రాసి ఉన్న కాగితం తెచ్చి అతని ముందు పెట్టారు.

అపాయింట్‌మెంట్లలో 'పానకాలు' పేరు చూడగానే చిరాకుగా మొహం చిట్లించాడు మహేష్. అతని ముఖకవళికలు గమనించి 'ఏమిటి?' అన్నట్లు చూశాడు ప్రభు.

"ఆ పానకాలు వస్తున్నాడంటేనే భయం వేస్తుంది" అన్నాడు మహేష్.

"ఏమంటున్నాడేమిటి? "

"అతని జిల్లాలో ఒక ఇరిగేషన్ ప్రాజెక్ట్ రాబోతుంది. దానికోసం టెండర్లు పిలిచాం కూడా! పానకాలు బావమరిదికి చెందిన కంపెనీ కూడా టెండర్ వేసిందంట. ఎలా అయినా ఆ కంపెనీకే టెండర్ వచ్చేలా చూడమంటాడు"

నిట్టూర్చాడు ప్రభు. "పానకాలుకి కోపం తెప్పించి మన ప్రభుత్వం మనుగడ సాగించలేదు. అతని దగ్గర ఏడుగురు ఎమ్మెల్యేలు ఉన్నారు"

"ఈ నెంబర్ గేమ్ చాలా బాధాకరంగా ఉంది. సమయమంతా పదవి కాపాడుకోవడానికే సరిపోతుంటే ఇక అభివృద్ధిమీద ధ్యాస పెట్టేది ఎప్పుడు? "

"అధికారం లేని రోజు ఎదుటివాడి సంగతి వదిలిపెట్టు, నీకు నువ్వు కూడా సహాయం చేసుకోలేవు"

"అందుకే కర్ర విరగకుండా, పాము చావకుండా ఇన్నాళ్ళూ లాక్కొచ్చాం. ఆ టెండర్లు ఓపెన్ చెయ్యకుండా ఏదో ఒక నెపం పెట్టి వాయిదా వేస్తూ వస్తున్నాను. కానీ ఎన్నాళ్లని వాయిదా వేయగలను? ఇప్పుడు అతను ఇంత హడావుడిగా వస్తున్నాడంటే, ఆ టెండర్ విషయం ఏదో ఒకటి తేల్చుకుని కానీ వెళ్ళడు"

"మన ప్రభుత్వం నిలబడాలంటే కావలసిన ఎమ్మెల్యేలు నూటయాభై మంది. మన బలం నూట ముప్పైఏడు మందే! మన ఆశయాలు నచ్చి సపోర్ట్ చేస్తున్న పార్టీలతో కలుపుకంటే మొత్తం బలం నూట నలభైఎనిమిది. అవుతుంది. ఆ పానకాలు ప్రాపకంలో ఉన్న ఏడుగురు ఎమ్మెల్యేలు తమ మద్దతు విరమించుకుంటే మన ప్రభుత్వం మీద అవిశ్వాసం పెట్టటానికి ప్రతిపక్షాలు తయారుగా ఉన్నాయి. కాబట్టి ఇతన్ని ఎలా డీల్ చేస్తామన్న విషయంమీదే మన ప్రభుత్వం ఉంటుందా, ఊడుతుందా అన్నది ఆధారపడి ఉంది" వివరించాడు ప్రభు.

"అలా అని ఎన్నాళ్ళు పానకాలు అడిగే గొంతెమ్మ కోరికలకు తల ఊపగలను? నేను రాజకీయాల్లోకి వచ్చిందే అవినీతికి వ్యతిరేకంగా పనిచేస్తానని. ప్రభుత్వాన్ని

నిలుపుకోవటానికయినా సరే... అవినీతికి సహకరిస్తే నాకూ, అవినీతి రాజకీయాలు నడుపుతున్న నాయకులకూ తేడా ఏమి ఉంటుంది? "

"నిజమే! కానీ అదను చూడకుండా మొండిగా వ్యవహరించి ప్రభుత్వాన్ని పడేసుకుంటే, చెడ్డపేరు వచ్చేది మనకే! అధికారమిస్తే నిలుపుకోలేక పోయారని అపనిందపడుతుంది. మళ్ళీ ప్రజల ముందుకు వెళ్ళినపుడు ఈమాత్రం మెజారిటీ కూడా రాకపోయినా ఆశ్చర్యం లేదు"

నిస్పృహాయంగా చూశాడు మహేష్. "అయితే ఏమి చేద్దామంటావ్? "

"మనిషికి ఆక్సిజన్ ఎంత అవసరమో, రాజకీయ నాయకుడికి అధికారం అంత అవసరం. ఎట్టి పరిస్థితుల్లోనూ పానకాలు ఇరిటేట్ అవకూడదు. ఏదో ఒక వంక చెప్పి ఇప్పటికి పంపిద్దాం. ఈసారి మళ్ళీ అతను వచ్చేటప్పటికి పరిస్థితులు ఎలా మారతాయో!"

ప్రభు మహేష్‌కి ఎంత సలహాదారైనా, ఎంత అనుభవజ్ఞుడైనా అన్ని విషయాల్లోనూ అతను చెప్పింది చెప్పినట్లు చెయ్యడు మహేష్. అతనికంటూ కొన్ని సిద్ధాంతాలు, లక్ష్యాలు ఉన్నాయి. వాటికి ఎసరు వస్తుందనుకుంటే అతను వెనక్కి తగ్గడు. కానీ ఈ రోజు అతనికి చిరాగ్గా ఉంది. మైండ్ సరిగ్గా పనిచెయ్యటంలేదు.

అతని మెదడులోని ఒక భాగం ప్రభు చెప్పే విషయాలు పట్టించుకోకుండా తను అనుకున్నదారిలో సాగిపొమ్మంటోంది.

మరొక భాగం లౌక్యంగా వ్యవహరించి సమస్యని ప్రస్తుతానికి వాయిదా వేయమంటోంది.

ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు మహేష్.

అతని సందిగ్ధతను అర్థం చేసుకున్నాడు ప్రభు. "సమస్యకి పరిష్కారం అస్పష్టంగా ఉన్నపుడు వాయిదా వేయటానికి మించిన మందు మరొకటి లేదు. అదే బెస్ట్" అన్నాడతను.

"సరే! అతన్ని రానివ్వండి. వచ్చిన తరువాతే చూసుకుందాం" అన్నాడు మహేష్.

మరికొన్ని విషయాలు చర్చించిన తరువాత ప్రభు అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

మహేష్‌ను ఎక్కువసేపు వేచివుండేలా చేయకుండా సరిగ్గా అనుకున్న సమయానికి వచ్చాడు పానకాలు.

వెంటనే అతన్ని లోపలకు పంపారు.

"నమస్కారమబ్బాయా!" అంటూ లోప

## ఒకేఒక్క మగాడు!

బ్రిటన్ పార్లమెంట్‌లో హౌస్ ఆఫ్ కామన్స్ మన లోక్‌సభలాంటిది. డెనిస్ హీలే అనే లేబర్‌పార్టీకి చెందిన ప్రతిపక్ష నాయకుడు మార్గరెట్ థాచర్‌తో 'నిజానికి



మీ పార్టీలో మీరొక్కరే పురుషులు' అని ఒకసారి అన్నాడు, మిగతావారంతా ఆడంగులే అనే అర్థం ధ్వనించేలా.

దానికామె ఏమాత్రం ఆలస్యం చేయకుండా 'కాదు కాదు, ఈ కామన్స్‌సభలోనే నేను తప్ప, వేరే మగాడెప్పుడూ కనిపించనే లేదు' అంది, డెనిస్‌ను కూడా ఆడవాళ్ల జాబితాలో కలిపేస్తూ.

దాంతో ఆయన మొఖం కందగడ్డలా అయింది. ఆమెను ప్రశంసించినా చివరికది తిరిగొచ్చి తనకే తాకిందని బాధపడ్డాడు.

లకు వచ్చాడు పానకాలు.

"రండి, రండి! కూర్చోండి!" అంటూ ఆహ్వానించాడు మహేష్.

"నీ వయసు మా అబ్బాయి వయసే ఉంటుందయ్యా! అందుకని చనువు చూపిస్తుంటాను. ఇబ్బందేమీ లేదుగా? "

"ఏమీలేదు. ముందు మీరు కూర్చోండి"

కాఫీ తాగుతూ కుశల ప్రశ్నలు మాట్లాడుకున్నారు.

"మీ నియోజకవర్గ విశేషాలేమిటండీ" చివరగా అడిగాడు మహేష్.

"మళ్ళీ ఎప్పుడు ఎన్నికలు వచ్చినా నేనే గెలుస్తానబ్బాయా! దానినట్లా నడుపుకొస్తున్నాను"

"అదేనండీ ఆశ్చర్యం. ఒకసారి గెలిచి రెండోసారి ప్రజల ముందుకు వెళ్ళేటప్పటికే వ్యతిరేకత వస్తుంది. అలాంటిది దశబ్దాలుగా ఒకే నియోజకవర్గం నుండి గెలుస్తున్నారంటే.. ఏమిటా రహస్యం? "

"రహస్యమని నువ్వే అంటున్నావుగా అబ్బాయా? నీకెట్టా చెప్పేది? అప్పుడు నువ్వే నన్ను ఓడగొట్టవూ? "

నవ్వాడు మహేష్. "నేనీమాట ముఖ్యమంత్రిగా అడగటం లేదు. వ్యక్తిగతంగా అడుగుతున్నాను. మీ పాపులారిటీకి కారణం ఏమిటి? మీ నియోజకవర్గ ప్రజలకు సమస్యలేమీ లేవా? ఉంటే అవన్నీ మీరు తీరుస్తున్నారా? "

"ఈ ప్రజల కోరికలకు అంతం, సమస్యలకూ ముగింపూ ఉంటాయటయ్యా? ఒకవేళ కర్మకాలి నీలాంటి వాడు సమస్యలు తీరుద్దామని పూనుకుంటే, వాడి పని ఖతం చేస్తారు తప్ప... వాళ్ళ సమస్యలు తీరేవి కావు. ఎంత చేసినా ఎవడికీ తృప్తి ఉండదు" అన్నాడు నిరాసక్తంగా.

"అలా అని వారికి ఏమీ చెయ్యకుండా ఊరుకుంటే వచ్చేసారి ఎలా నెగ్గుతారు పానకాలు గారూ!"

"సమస్యలు లేకపోతే మనల్నెవరు పట్టించుకుంటారయ్యా! అందుకే సమస్యలు తగ్గకుండా చూసుకో! అప్పుడప్పుడూ ఒకటి తీరుస్తుండు. అంతేతప్ప రామరాజ్యం తెద్దామని కలలు కనమాకు. రామరాజ్యమే వస్తే మరుసటి రోజు నిన్నెవరూ పట్టించుకోరు"

"నేనలా అనుకోవటం లేదండీ! ప్రజల సమస్యలు పట్టించుకుని, వాటిని తీర్చలేకపోయినా, తీర్చటానికి ప్రయత్నం చేసేవారికి ఓటు వేస్తారని అనుకుంటున్నాను"

"చేసే పనులకీ, ఎన్నికల్లో గెలవటానికీ ఏమన్నా సంబంధం ఉంటుందనుకుంటున్నావా అబ్బాయా? ఆ ఆఖరి రోజున ఎవరు బాగా మేనేజ్ చేయగలరు అన్నదాని మీద ఆధారపడి ఉంటుంది. కుల సమీకరణాలు, నగదు బదిలీలు, లిక్కరు పంపిణీలు ఎలా చేశామన్నది ముఖ్యం. గెలవటానికి అయిదేళ్ళు కష్టపడనవసరం లేదబ్బాయా! అయిదు రోజులు కష్టపడితే చాలు"

"అలా అనకండి. అందరూ అలా ఉంటే మా పార్టీవాళ్ళు, ముఖ్యంగా నేను ఎలా ఎన్నికయ్యానంటారు? "

"నీ సంగతి తెలియదు కానీ, మీ పార్టీ వాళ్ళు మాత్రం డబ్బులు పంచకుండానే ఎన్నికయ్యారంటావా అబ్బాయా? ఎవరన్నా వింటే నీ అమాయకత్వానికి నవ్వుకుంటారు. అయినా ఒక్కొక్కసారి అంతేలే! గాలిలో వ్యాపించే వైరస్ లాగా ఓటర్లందరికీ ఒక కొత్తపార్టీ మీద ప్రేమ పుట్టుకొస్తుంది. దానినే 'వేవ్' అంటారు. అప్పుడు మిగిలిన సమీకరణాలు పనిచెయ్యవు. మొన్న ఎన్నికల్లో మీరు గెలవటానికి ఆ వేవ్ పనిచేసింది"

"వచ్చేసారి మాత్రం వేవ్ ఉండదని గ్యారెంటీ ఏముంది? అప్పుడు మీకు ఇంకా ఇబ్బంది కావచ్చు కదా? " నవ్వుతూ

అన్నాడు మహేష్.

"చూడు అబ్బాయా! ఎప్పుడూ ఉండే దాన్ని వేవ్ అనరయ్యా!" ఫెళ్ళున నవ్వుతూ అన్నాడు పానకాలు.

తనూ నవ్వాడు మహేష్. ఇక అసలు విషయానికి వస్తున్నట్లు "చెప్పండి సర్! ఊరకరారు మహానుభావులు"

"నీతో వచ్చిన చిక్కే ఇదబ్బాయా! అన్నీ తెలిసి ఏమీ తెలియనట్లు ఉంటావు. ఆ టెండర్ ఫైల్ సంగతి ఈ రోజు తేల్చెయాలయ్యా!"

"దాని గురించి మీరు రావాలటండీ! ఒక ఫోన్ చేస్తే పని అవదూ"

"అవకే కదూ! ఇట్టా రాటం. మొహమాటం లేకుండా నీ మనసులో మాట చెప్పబ్బాయా!"

"నేను అధికారంలోకి వచ్చిందే అవినీతికి వ్యతిరేకంగా 'సురాజ్యం' స్థాపిస్తానని. అలాంటిది ఇలాంటి పని చేయాలంటే? " సందిగ్ధంగా ఆగిపోయాడు మహేష్.

"నిజమేనబ్బాయా! నీకు మనసు రాదు. మరి నాలాంటి వాడి సంగతి ఏమిటి? నన్ను నమ్ముకున్న ఏడుగురు ఎమ్మెల్యేల సంగతి ఏమిటి? వాళ్ళు నీకులాగా 'వేవ్'ని నమ్ముకోలేదయ్యా! నాకు లాగా నోటుని నమ్ముకున్నారు. మళ్ళీ గెలవాలంటే డబ్బు కావద్దా? "

"అయినా.."

"నాకు తెలియకడుగుతానూ! ఇందులో తప్పేందబ్బాయా? ఎవడో ఒకడికి టెండర్ ఇవ్వాల్సిందేగా! అది మా వాడికి ఇస్తే నీ సొమ్మేం పోయిందంట? "

"మీ బావమరిది కంపెనీకి టెండర్లో పాల్గొనటానికి కావలసిన మినిమమ్ అర్హత కూడా లేదండీ"

"అవన్నీ ఉంటే ఇట్టా నీ ఎనకాలెందుకు పడతాను చెప్పు? అయినా ఇలాంటి చిన్న విషయాలు నువ్వు పట్టించుకోకూడదు. నువు 'ఊ..' అంటే కింద ఆఫీసర్లు అన్నీ మేనేజ్ చేస్తారు. నువ్వో సంతకం పొడువు. మిగిలిన అందరినీ ఎలా మేనేజ్ చెయ్యాలో నేను చూసుకుంటాను"

"సరేలెండి. నేను జిల్లా టూరుకు వెళ్తున్నాను.. రాగానే.."

"సంతకం చేస్తానంటావ్! అప్పటిదాకా నీ మాటల్ని నమ్మి, తోక ముడుచుకుని, నోట్లో వేలేసుకుని వెళ్ళిపోవటానికి నేను ఇప్పుడే రాజకీయాలు నేర్చుకుంటున్న కుర్రకుంకని అనుకుంటున్నావా? ఇట్లాంటి వ్యవహారాల్లో పండిపోయానబ్బాయా! నువ్వు సమయం కోసం చూస్తున్నావని నాకు తెలుసు. పరిస్థితి నీకు అనుకూలం అనిపించగానే మధ్యంతర ఎన్నికలు పెడతావనీ తెలుసు. అప్పుడు మా పరిస్థితి ఏమిటి? ఈసారి నీ మాట వినటానికి రాలేదబ్బాయా! నా మాట నెగ్గించుకోవటానికి వచ్చా! సంతకం పెడతావా? పెట్టవా? ఏదో ఒకటి తేల్చు"

మహేష్ గొంతుకు ఏదో అడ్డం పడ్డట్టు మాట్టాడలేకపోయాడు. పానకాలు బ్లాక్‌మెయిల్ రాజకీయాల గురించి ఎంత తెలిసినా, నిజంగా అతను బెదిరిస్తుంటే ఏమి చేయాలో అర్థం కాక బిగుసుకుపోయాడు.

మామూలుగా అయితే ఎన్నడూ లేనిది పానకాలు ఎందుకు ఇంత పట్టుబడుతు

## కొత్తగాలి...

**మద్యం ఏరులై పారుతోంది...**
**మంచినీరు భూగర్భంలోకి**
**జారుతోంది...**
**ప్రభుత్వ పెద్దలూ!**
**జవాబు చెప్పరూ!!**

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

న్నాడో కాస్త ఆలోచించేవాడు. అతని స్వభావానికి ఇలాంటి బెదిరింపులకు అసలు లొంగకూడదు. తన పదవి ఉన్నా పోయినా లెక్కచేయకుండా పానకాలును బయటకు సాగనంపాలి. కానీ అతని మీద అప్పటివరకు పదవిని కాపాడుకోవటం ఎంత అవసరమో వివరంగా బోధించిన ప్రభు మాటల ప్రభావం పడింది. అదీకాక పాదరసం కంటే చురుకుగా పరుగులు పెట్టే అతని మేధ ఆదిత్య పుణ్యమా అని కాస్త మొద్దుబారింది. అందుకే అతను తన స్వభావానికి విరుద్ధంగా ఇంతసేపు పానకాలుతో మాట్లాడుతున్నాడు.

మరొకపక్క పానకాలు తక్కువవాడు కాదు. తను ఇప్పుడు సంతకం పెట్టకపోతే వెంటనే తన ఎమ్మెల్యేల మద్దతు ఉపసంహరించుకుంటాడు. తన ప్రభుత్వం పడిపోతుంది. అధికారంలోకి వచ్చిన దగ్గర నుండి తను ఎంత ప్రయత్నం చేసినా చాలీచాలని బలంతో సాధించింది ఏమీ లేదు. రాష్ట్రమంతా కరువు కోరల్లో చిక్కి విలవిలలాడుతోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఎన్నికలంటే తన పార్టీకి ఎవరూ ఓటెయ్యరు.

అతని సందిగ్ధం గమనించినట్లు నవ్వాడు పానకాలు. "నీకు మరొకదారి లేదు అబ్బాయా! సంతకం పెట్టు" అన్నాడు.

## కొత్తగాలి...



**ఉవ్వెత్తున ఎగసేవి**
**ఉధృతంగా తాకేవి**
**చురుక్కున తగిలేవి**
**చమక్కులందించేవి**
**కొత్తగాలులే!**

– అంబటి వెంకట శివారెడ్డి,
*యర్రగుంట్ల, కడప*

మహేష్ ఏ మాత్రం ఆలోచించినా.. పానకాలు బెదిరించటం తప్ప మరేమీ చేయలేడని గ్రహించేవాడు. ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించి బయటకు వెళ్ళి మళ్ళీ ఎన్నికలకు కారణమయితే, వారి గ్రూపు ఎమ్మెల్యేలు అసలు గెలవలేరు. ఆ బెదిరింపులకు లొంగి సంతకం పెట్టడం వలన తను అతని సాలెగూడులో చిక్కుకుంటున్నానని అతను అర్థం చేసుకోలేకపోయాడు. ఎవరో అతని బుర్రలో నుండి తెలివితేటల్ని దొంగిలించినట్లు అతని మెదడంతా బ్లాంక్‌గా ఉంది.

అలాంటి రోజు వచ్చి తన పని కోసం పట్టుబట్టటం పానకాలు అదృష్టం. మహేష్ దురదృష్టం.

ఎన్నిరకాలుగా ఆలోచించినా మరొక మార్గం తట్టలేదు మహేష్‌కి. చివరకు సందేహిస్తూనే ఫైలు మీద సంతకం పెట్టాడు.

ఫైలు తీసుకుని విజయగర్వంతో బయటకు నడిచాడు పానకాలు.

బయటకు వెళ్ళిన పానకాలు సరాసరి నరహరి దగ్గరకు వెళ్ళాడు. నరహరి మహేష్ మంత్రివర్గంలో ఒక మంత్రి.

నరహరిది రాజకీయ కుటుంబం. అతని జిల్లాలోనే కాకుండా చుట్టుపక్కల జిల్లాల్లో కూడా జనాల మధ్య అతని కుటుంబానికి మంచి పట్టు ఉంది. అంగట్లో అన్నీ ఉన్నా అల్లుడినోట్లో శని ఉందన్నట్లు.. దురదృష్టం కొద్దీ అతని రాజకీయ నిర్ణయాలు ఎప్పుడూ తప్పే అవుతుంటాయి. పరమపదసోపాన పటంలోని పాముల బారినపడిన వాడిలా ఎప్పటికప్పుడు జారి అట్టడుగుకు చేరటం అతని హాబీ.

ఈసారి అతను సరయిన సమయంలో సరయిన నిర్ణయం తీసుకున్నాననుకున్నాడు. రాజకీయ యవనిక మీద

మహేష్ కనపడగానే అతను త్వరలో అత్యున్నత స్థానానికి చేరుకుంటాడని అంచనా వేశాడు. వెంటనే అతని పార్టీలో చేరాడు. అంతేకాదు, తనతోపాటు తన అనుయాయుల్నీ చేర్చాడు.

అనుకున్నట్లే మహేష్ అనుకూల పవ నాలు రాష్ట్రమంతా వీచాయి. నరహరి వర్గం కూడా మహేష్ పుణ్యమా అని ఎన్ని కల్లో మంచి మెజారిటీతో నెగ్గారు. అయితే సమస్యల్లా.. నరహరి అది తన బలమే అనుకోవటం మొదలుపెట్టాడు. ప్రస్తుతం అతని చేతిలో ఇరవై మంది దాకా ఎమ్మె ల్యేలు ఉన్నారు. మహేష్ అతని బలాన్ని గుర్తించి అతనికి మంత్రి పదవి ఇచ్చాడు.

అయితే నరహరి మంత్రి పదవితో తృప్తి పడలేదు. ఇంకా ఏదో కావాలని ఆరాటప డ్డాడు. అతని అనిశ్చితిని ప్రతిపక్ష పార్టీ వాడుకోదలచింది.

అతని చేతిలో ఉన్న ఎమ్మెల్యేలను పార్టీ నుండి బయటకు తీసుకువచ్చి ప్రతిపక్ష పార్టీలో కలిపితే బలం లేక ప్రభుత్వం కూలిపోతుంది. అప్పుడు ప్రతిపక్ష పార్టీ అధికారంలోకి వస్తుంది. అప్పుడు నరహ రిని ముఖ్యమంత్రిని చేయటమే కాకుండా అత్యంత ముఖ్యమయిన మంత్రిత్వశాఖలు ఇస్తామని ఆ పార్టీ ఆశ చూపింది. అంతే కాక పెద్దమొత్తంలో డబ్బు ఇవ్వటానికి కూడా ఆ పార్టీ ఒప్పుకుంది. నరహరి అందుకు అంగీకరించాడు. కానీ అధికా రంలో ఉన్న పార్టీనుండి బయటకు రావా లంటే ఏదో ఒక కారణం కావాలి కదా! మహేష్‌లాంటి నిజాయితీపరుడికి ద్రోహం చేసి పార్టీ బయటకు వెళ్ళాలంటే ప్రజల్లో తన పరపతి తగ్గుతుంది. అందుకే ముందుగా మహేష్‌కి ప్రజల్లో ఉన్న పట్టు తగ్గించాలి. మహేష్ కూడా అవినీతికి అతీ తుడేమీకాదని ప్రజలకు చెప్పాలి. ఆ అవ కాశం అతనికి పానకాలు కల్పించబోతు న్నాడు.

పానకాలు నిజంగానే అనుభవజ్ఞుడు. ఈ టెండరు తన బావమరిదికి సంపా దించి పెట్టటం వలన ఎంతో లాభం ఉండదని అతనికి తెలుసు. పైగా టెండరు తన బావమరిది కంపెనీకి ఖరారయిన మరుక్షణం ఎవడో ఒకపోటీదారు ఏ కోర్టుకో పోయి 'స్టే' తేకూడదనేం లేదు. తమ టెండర్లో లోపాలు ఉన్నాయి కాబట్టి కోర్టు పర్యవేక్షణలో ఆ టెండర్ క్యాన్సిల్ అయినా ఆశ్చర్యం లేదు. ఇవన్నీ జరగ కుండా ఉండాలంటే తోటి పోటీదారులంద రినీ కొనాలి. ఇదంతా చేసిన తరువాత తనకు మిగిలేదెంత? అందుకే పానకాలు మరొకపక్క నుండి నరుక్కువచ్చాడు. ఇప్ప టివరకూ తన వర్గం ఎమ్మెల్యేలందరూ మహేష్ ప్రభుత్వానికి సపోర్ట్ చేస్తున్నారు. ఇకనుండి నరహరి వర్గంతో కలసి ప్రతి పక్ష పార్టీకి మద్దతు ఇస్తారు. దానికి ప్రతి ఫలంగా అధికారంలోకి వచ్చాక ప్రజల సొమ్ము దోచుకోవటానికి ఇతనికి పూర్తి స్వేచ్ఛను ప్రభుత్వం కలిగిస్తుంది.

అన్నిటినీ మించి మహేష్ ప్రభుత్వానికి ఉన్న ప్రతిష్టను చెరిపివేయటానికి కావల సిన రుజువులు కూడా తను నరహరికి అందిస్తాడు. అందుకుగానూ బోలెడంత డబ్బు చేతులు మారే బేరం ఇంతకుముం దే కుదిరిపోయింది. ఆ డబ్బు మళ్ళీ వచ్చే ఎన్నికల్లో గెలవటానికి ఉపయోగపడుతుం దని పానకాలు ప్లాన్.

ఆ ప్లాను మీద ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్ళిన పానకాలు, తనపనిలో ఎంతవరకు ఫలితం సాధించాడో... అని ఆలోచిస్తున్న నరహరికి లోపలకు నడిచి వస్తున్న పాన కాలు కనిపించాడు.

"ఏమైంది? వెళ్ళినపని అయిందా?" ఆత్రంగా అడిగాడు నరహరి.

"ఏదైనా పనికి నన్ను పంపి ఏమయిం

దని అడగకూడదయ్యా నరహరీ!" ఫైలు అతని ముందుకు తోస్తూ అన్నాడు పాన కాలు.

ఆత్రంగా ఫైలంతా తిప్పి చూశాడు నర హరి. అందులో ఉన్న కాగితాలన్నీ అతనికి సంతృప్తిగా ఉండటంతో దాన్ని కాపీలు తియ్యటానికి పంపాడు.

"తర్వాతి స్టెప్ ఏమిటి? " అడిగాడు పానకాలు.

"చూస్తావుగా! నీకే తెలుస్తుంది..."

"పాపం కుర్రకుంక! ఆ ముఖ్యమంత్రిని చూస్తే జాలేసిందయ్యా! నమ్మకద్రోహం చేస్తున్నామేమో!"

"రాజకీయాల్లో జాలి చూపించావంటే గాలి తీసేస్తారు జాగ్రత్త!"

"సరే! కానియ్" సోఫాలో వెనక్కి వాలుతూ అన్నాడు పానకాలు.

మరొక అరగంటలో రాష్ట్రంలోని అన్ని దినపత్రికల కార్యాలయాలకు, టి.వి. ఛానెళ్ళ కార్యాలయాలకు కబురు అందింది. నరహరి ఒక ముఖ్యమయిన పత్రికా సమావేశం ఏర్పాటు చేశాడనీ, అందరూ తప్పని సరిగా హాజరు కావాలనీ ఉంది అందులో.

పత్రికల వారికి సహజంగా ఒక ఇంట్యూషన్ ఉంటుంది. ఏది ముఖ్యమయిన సమావేశమో, ఏది కాదో వారికి ఇట్టే తెలిసిపోతుంది. అదీకాక నరహరి వర్గం ఇది ప్రభుత్వ భవితవ్యాన్ని తేల్చే సమావేశమని కొన్ని సూచనలు కూడా ఇచ్చింది. దానితో అనుభవజ్ఞులయిన విలేకరులకు వెంటనే అర్థమయిపోయింది, ఇదేదో కొంపలు కూల్చే సమావేశమని.

★ ★ ★

ఎదురుగా దాదాపు పాతిక మైకులు పెట్టి ఉండగా, హుందాగా, కుర్చీల్లో కూర్చున్నారు నరహరి, పానకాలు.

పత్రికా సమావేశం మొదలయింది.

ముందుగా క్లుప్తంగా నరహరి, పాన కాలు మాట్లాడతారనీ, ఆ తరువాత విలేక రుల ప్రశ్నలకు సమాధానం చెప్తారని ప్రక టించారు.

నరహరి మాట్లాడటం మొదలు పెట్టాడు.

"నేనీ పార్టీలో చేరి ఎన్నాళ్ళో కాలేదు. మీ అందరిలానే మహేష్‌గారంటే నాకూ అభిమానం. ఆయన భావాలు, అభిప్రాయాలు నచ్చి ఈ పార్టీలో చేరాను. నాకంటే ఎక్కువ మీరు ఆయన్ని నమ్మారు. ఓట్లు వేశారు. గెలిపించారు. అధికారంలోకి తెచ్చారు. ఆయనా నన్ను ఆదరించాడు. మంత్రి పదవి ఇచ్చాడు. అంతా బానే ఉంది. అయినా ఏదో వెలితి. చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష.. అనుకుంటూ మౌనంగా కూర్చోవచ్చు. కానీ నా మన స్సాక్షి దానికి ఒప్పుకోవటం లేదు. అవినీతిని అంతం చేస్తామని ప్రజలకి వాగ్దానం చేసి అధికారంలోకి వచ్చాము. అప్పటి నుండి మేము చేస్తున్నది ఏమిటని తరచి చూసుకుంటే సిగ్గేస్తుంది. తగినంత మెజారిటీ లేకపోవటం వలన అనుకున్న పనులు అనుకున్నట్లు చేయలేకపోతున్నామని మన ముఖ్యమంత్రి చెప్తున్నారు. అది అర్థం చేసుకోగలం! అయితే ప్రభుత్వమే అవినీతిలో కూరుకుపోతే దానిని ఏమి అనాలి? అధికారం నేడు ఉంటుంది. రేపు పోతుంది. దానికోసం ఆత్మను చంపుకొని ఈ పార్టీలో సభ్యునిగా, ఈ ప్రభుత్వంలో భాగంగా ఉండలేను. జరుగుతున్న అవినీతిలో పాలు పంచుకోలేను. అందుకే నా సహచర ఎమ్మెల్యేలందరితో కలిసి బయటకు వెళ్ళిపోతున్నాను. అలాగే ఈ ప్రభుత్వానికి మద్దతు కూడా ఉపసంహరించుకుంటున్నాను"

హాలంతా కలకలం రేగింది. నరహరి చెప్తున్న మాటలు నిజమయితే ప్రభుత్వం కూలిపోతుంది మరి! ఈలోపు ఎవరో విలే

కరి అడిగాడు "మీరు ప్రతిపక్ష పార్టీలో చేరుతున్నారని వినిపిస్తోంది. నిజమేనా? "

"నా భవిష్యత్తు కార్యాచరణ గురించి ఇంకా ఆలోచించుకోలేదు. అయినా రాజకీయాలన్నాక ఏదో ఒక పార్టీలో ఉండాలిగా! అధికారాన్నీ, అధికార పార్టీని వదులుకుని బయటకు వస్తున్నానంటేనే నేనెంత నిస్వార్థపరుడినో తెలుస్తుంది. ఈ విషయాలన్నీ ప్రజలకు చేరవేస్తారనే మిమ్మల్ని పిలిచింది" వివరణ ఇచ్చాడు నరహరి.

ఈ లోపు పానకాలు తను కూడా మైకు ముందుకు వచ్చి ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించుకుంటున్నట్లు ప్రకటించాడు.

అప్పటి నుండి విలేకరుల ప్రశ్నలు మొదలయ్యాయి.

"మీతో పాటు మీకు మద్దతు ఇచ్చే ఇరవైమంది ఎమ్మెల్యేలు బయటకు వస్తారని గ్యారెంటీ ఏమిటి? "

ఒక విలేకరి నరహరిని అడిగాడు.

"మా ఇరవైమంది ఎమ్మెల్యేలు మాత్రమే కాదు, అవినీతిని వ్యతిరేకించే ఎమ్మెల్యేలందరూ బయటకు వస్తారు. చివరకు ముఖ్యమంత్రి ఒక్కడే పార్టీలో మిగిలిపోతాడు. ఇంకాసేపట్లో గవర్నర్ గారి దగ్గరకు మా ఇరవైమంది ఎమ్మెల్యేలతో కలిసి వెళ్తున్నాను. గవర్నర్ గారి ముందే మా బలం ప్రదర్శిస్తాం!"

మరో విలేకరి పానకాలు వైపు తిరిగాడు. "అసలు మీరు మద్దతు ఉపసంహరించుకోవటానికి కారణం ఏమిటి? " అని అడిగాడు.

"అవినీతయ్యా.. అవినీతి! ప్రభుత్వం కుళ్ళిపోయింది. ఇక దీనికి మద్దతు ఇచ్చి మా ఆత్మను చంపుకోలేం! అందుకే మద్దతు విరమించుకుంటున్నాము. అంతకు మించి ప్రత్యేక కారణం ఏమీ లేదు. ఏ అవినీతిని అంతం చేయాలని ఈ ప్రభుత్వానికి మద్దతు ఇచ్చామో, దానినే పెంచి పోషిస్తున్నాడు ఈ ముఖ్యమంత్రి. మా జిల్లా ప్రజలకి ఎంతో అవసరమయిన ఇరిగేషన్ ప్రాజెక్ట్ ఎప్పటినుండో పెండింగ్‌లో ఉంది. 'ఏమిటయ్యా కారణం? ' అని అడిగా. నిస్సిగ్గుగా వాటాలు తేల్చమని అడిగాడు ఆ ముఖ్యమంత్రి. మా బావమరిది కంపెనీకి టెండరు వచ్చేటట్లు చూస్తాడంట, ప్రతిఫలంగా అతనికి వాటా ఇవ్వాలంట. మీరు నమ్మరని తెలుసు. ముఖ్యమంత్రి మీద మీకు అంత నమ్మకం. అందుకే, ఇదిగో ఫైలు మీద సంతకం కూడా చేయించుకు వచ్చాను. మీరే చూడండి. అర్హత లేని కంపెనీకి, అది నా బావమరిదికి అయినా స,రే, టెండరు రావటాన్ని నేను సహించలేకపోయాను. అందుకే మద్దతు వాపసు తీసుకుంటున్నాను"

> **కొత్తగాలి...**
>
> **పుష్టి భోజనం**
> **సుఖ నిద్ర**
> **వెరసి...**
> **మధుమేహం!**
>
> – వెల్మల రాంరెడ్డి,
> పూడూరు, కరీంనగర్ జిల్లా

"ఇంతకీ మీ డిమాండ్లేమిటి? "

"ఇంతచెప్పినా ఇంకా అర్థం కాలా!! అవినీతి ముఖ్యమంత్రి రాజీనామా చెయ్యాలయ్యా!!" అన్నాడు పానకాలు.

★ ★ ★

"ఇది పచ్చిమోసం" కోపంగా అన్నాడు మహేష్.

"రాజకీయాల్లో మోసాలు ఉండవు.

ఎత్తులు, పైఎత్తులు మాత్రమే ఉంటాయి" చెప్పాడు ప్రభు.

"వారు పార్టీ నుండి వెళ్లిపోదలచుకుంటే వెళ్లిపోవాలి. అంతేకానీ, ఇలా మనమీద అభాండాలు వేసి వెళ్ళటం ఎందుకు? "

"నిన్ను అవినీతిపరుడని నమ్మిస్తే తప్ప వారికి మనుగడ కష్టమవుతుంది. అందుకూ.."

"నాకు మరో మార్గమేమీ లేదా? "

"అదలా ఉంచండి. అసలు మనం ఆ ఫైలు విషయం వాయిదా వేద్దామనుకున్నాం కదా! ఎందుకంత త్వరపడి నిర్ణయం తీసుకున్నారు? " నిష్టూరంగా అన్నాడు ప్రభు.

"ఆ నిమిషం ఏమి జరిగిందో నాకే తెలియదు. పానకాలు బ్లాక్ మెయిల్‌కి లొంగిపోయాను. ఇప్పుడాలోచిస్తుంటే నేనెందుకు అలా చేశానో నాకే అర్థం కావటం లేదు. సరే! కానివ్వండి.. ఇప్పుడేమి చేద్దామో ఆలోచించండి"

"నరహరి గ్రూపుకు చెందిన ఇరవై మంది ఎమ్మెల్యేలకు మనవాళ్ళు ఫోనులు చేస్తున్నారు. కానీ వారిని ఒప్పించటం కష్టం. వారు డిసైడైపోయారు. ఎదుటి పక్షంవారు ఇవ్వచూపిన తాయిలాలు మనం ఇవ్వలేము. కాబట్టి వారిని మనం ఆపలేము. ఇక మన పరువుప్రతిష్టల సంగతంటారా.. అది ఎలా కాపాడాలన్నదే మనం ఆలోచించాలి" చెప్పాడు ప్రభు.

తల విదిలించాడు మహేష్. జూలు విదిలించిన సింహంలా లేచి నిలబడ్డాడు.

"నా పరువు, ప్రతిష్ట గురించి నాకు ఆందోళన లేదు. వాళ్లు మోసం చేసి నన్ను గెలవాలనుకున్నారు. అలాంటి వారికి జవాబు అలానే చెప్తాను. మోసం చేయటం ఒక విద్య అని నేను అనుకోలేదు. కానీ అవసరమొస్తే అందులో కూడా నేను వారిని జయించగలను"

"అంటే ఏమి చేద్దామంటారు? " ఒక్కసారిగా మహేష్‌లో వచ్చిన మార్పుకు ఆశ్చర్యానికి గురయిన ప్రభు అడిగాడు.

"మనమూ అబద్ధం చెప్పాలి. ఆ ఫైలు మీద సంతకం నాది కాదని బుకాయించాలి"

"కానీ ఎవరయినా అది మీ సంతకమే అని గుర్తుపడతారు"

"అది జరిగేది భవిష్యత్తులో! ఇప్పటికిప్పుడు అది నా సంతకమా కాదా అని నిర్ణయించేది ఎవరు? అది నా సంతకమే అని పానకాలు అంటాడు. కాదని నేనంటాను. ప్రస్తుత పరిస్థితుల్లో ప్రజలు ఎవరి మాట నమ్ముతారంటారు? నా మాట నమ్మే అవకాశమే ఎక్కువ. అదే ఏ పనీ చెయ్యకుండా కూర్చుంటే నిజంగానే అవినీతి చేశానని అనుకోరా? అందుకే ముందు ఈ చిన్న అబద్ధం చెప్పి పరువు కాపాడుకోవాలి"

"మీరు ఇవన్నీ చేయగలరని నాకు అనిపించట్లేదు" నమ్మలేనట్లు అన్నాడు ప్రభు.

"వాటర్ పోలో ఆడుతూ ఒంటికి తడి కాకూడదంటే కుదరదు. అదీకాక దీన్ని నేను మోసం అనుకోటం లేదు. ధర్మరాజంతటి వారికి యుద్ధంలో గెలవటానికి అబద్ధం చెప్పవలసి వచ్చింది. ఎవరో చేసిన మోసానికి నేను ఓడిపోను, వాళ్ళ కుయుక్తులకు లొంగిపోను. మళ్ళీ ఎన్నికలు వచ్చినా ప్రజలకు నా పరిస్థితి వివరించి మరిన్ని సీట్లు సంపాదించుకోగలను" దృఢంగా చెప్పాడు మహేష్.

ఒక్కసారిగా మహేష్‌లో వచ్చిన మార్పును ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు ప్రభు.

★ ★ ★

మరికాసేపట్లో ముఖ్యమంత్రి ఆఫీసు నుండి ఒక ప్రకటన వెలువడింది.

'అందరూ ఆరోపిస్తున్నట్లు ఆ టెండర్ ఫైల్ మీద సంతకం ముఖ్యమంత్రి పెట్ట లేదు. కేవలం వ్యక్తిగతకక్షల కారణంగా ఆయన మీద అభాండాలు వేస్తున్నారు. ఈ గొడవలో ముఖ్యమంత్రికి సంబంధం లేకపోయినా తమ నిజాయితీ నిరూపించు కోవటానికి టెండర్ల ప్రక్రియను రద్దు చేశారు. పారదర్శకంగా మళ్ళీ టెండర్లు పిలవటం మొదలవుతుందని తెలియ చేస్తున్నారు.

ప్రజలెవరూ ఈ ఆరోపణలను పట్టించు కోవద్దనీ.. తను పూర్తి నిబద్ధతతో ప్రజా శ్రేయస్సుకు కట్టుబడి ఉన్నాననీ ముఖ్య మంత్రి ప్రకటించారు'

తాము వేసిన ఎత్తుకు చిత్తయ్యాడను కున్న మహేష్ అంత త్వరగా రియాక్టయి ఎదురుతిరుగుతాడని ఊహించని నరహరి, పానకాలు కంగుతిన్నా సర్దుకుని తమ తదుపరి కార్యాచరణకు ఉపక్రమించారు.

★ ★ ★

నరహరి, పానకాలు ఊరేగింపుగా గవ ర్నర్ ఆఫీసుకు బయలుదేరారు.

వారి ఊరేగింపును దారి పొడవునా లైవ్‌లో కవర్ చేస్తున్నాయి టి.వి. ఛా నెళ్ళు.

వారు వస్తున్నారన్న విషయం తెలుసు కున్న గవర్నర్ వెంటనే వారిని లోపలకు పిలిచాడు.

ముందే తయారుచేసుకు తెచ్చిన వినతి పత్రం ఆయనకు అందచేశారు వారిద్దరూ.

తన ఇరవైమంది ఎమ్మెల్యేలను నరహరి ప్రదర్శిస్తే, తన ఏడుగురిని ప్రదర్శించాడు పానకాలు.

"కానీ ఇరవైఏడు మంది ఎమ్మెల్యేల బలంతో మీరు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయలేరుగా? " అడిగాడు గవర్నర్.

"ముందు ఈ ముఖ్యమంత్రి చేత రాజీ నామా చేయించండి. లేదా బల పరీక్షకు అసెంబ్లీని సమావేశపరచండి. ఒకసారి ఈ ప్రభుత్వం పడిపోయాక కొత్త ప్రభుత్వం ఏర్పాటు చేయటానికి సరిపడా బలం మాకు ఉందా లేదా అన్నది తర్వా తి సంగతి" కటువుగా అన్నాడు నరహరి.

"నేను ఒకసారి పూర్వాపరాలు విచా రించి నిర్ణయం తీసుకుంటాను" లేస్తూ అన్నాడు గవర్నర్.

★ ★ ★

ప్రభుత్వాన్ని రద్దు చేయాలని ప్రతిపక్ష పార్టీ కార్యకర్తలు ఉద్యమం మొదలుపె ట్టారు. ఊరూరా ఊరేగింపులు చేస్తు న్నారు. కొన్ని కొన్ని చోట్ల అవి హింసాత్మ కంగా మారుతున్నాయి. తమ పని తాము చేస్తూ పోలీసులు లాఠీలకు పని కల్పిస్తు న్నారు. అయినా ఎవరూ వెనక్కి తగ్గటం లేదు.

దొరికిన అవకాశం ఉపయోగించుకుని మహేష్‌ని ఇప్పుడు గద్దె దింపకపోతే తరు వాత అది అంత తేలిక కాదని అందరికీ అర్థమైంది. అందుకే అందరూ రెట్టించిన ఉత్సాహంతో ఆ పనికి పూనుకున్నారు. ఒక్కసారిగా రాష్ట్రం అతలాకుతలం అయింది.

తన ఆఫీసులో కూర్చుని జరుగుతున్న సంఘటనలను గమనిస్తున్న మహేష్‌కి గవర్నర్ నుండి ఫోన్ వచ్చింది. "మీరు ఒకసారి వచ్చి నన్ను కలుసుకోగలరా? " అడిగాడాయన.

నీతికి, న్యాయానికీ కట్టుబడి ప్రవర్తించే మహేష్ అంటే గవర్నర్‌కి ఇష్టం. కానీ ఆయన రాజ్యాంగానికి బద్ధుడు. స్వంత నిర్ణయాలు తీసుకోలేడు. కఠినమయిన నిర్ణయమైనా మహేష్ రాజీనామా అడగక తప్పదు.

ఆ సంగతి మహేష్‌కి తెలుసు. "వీలయి నంత త్వరగా వస్తాను" చెప్పి ఫోన్ పెట్టే శాడు.

గవర్నర్ పిలిచింది ఎందుకో మహేష్‌కి తెలుసు. ఆ మాటకొస్తే అందరికీ తెలుసు.




"ఈ అరాచకత్వం కచ్చితంగా నేను చేసిన పని వలన అని అనరుగా!" అడిగాడు ఆదిత్య సహదేవుడ్ని.

"నూటికి నూరు శాతం నీ వలనే!"

"ఇది అన్యాయం అసిస్టెంట్ దేవుడు గారూ! అప్పుడెప్పుడో వచ్చిన సునామీకీ, రేపు రాబోయే గ్రహణానికీ నేనే కారణం అనేటట్లు ఉన్నారు"

"వాటన్నిటికీ ఏమో కానీ ఈ పరిస్థితులకు మాత్రం నువ్వే కారణం అనిపిస్తోంది. నువు ఆ ముఖ్యమంత్రి తెలివితేటలతో ఆడిన ఆట వల్లే అతను సరయిన నిర్ణయం తీసుకోలేకపోయాడేమో! అతను సరైన మూడ్‌లో ఉండి ఎప్పటిలానే ఆ సంతకం పెట్టటం ఇప్పుడు కూడా వాయిదా వేసి ఉంటే ఈ స్థితి దాపురించేది కాదేమో!"

"ఇంకొక మాట చెప్పండి. ఇదంతా మీ దేవుడు ఆడుతున్న నాటకం కదూ! ఇలా జరుగుతుందని ముందే తెలుసు కాబట్టి నన్ను పావుగా వాడుకుని పిచ్చివాడిని చేస్తున్నారు కదూ? "

"ఎవరి జీవితాన్ని మెరుగుపర్చాలో నువ్వే నిర్ణయించుకున్నావ్. ఎవరి జీవితాల్లో చిన్న చిన్న మార్పులు చెయ్యాలో నువ్వే నిర్ణయించుకున్నావ్. మరి నిన్ను మేము పావుగా వాడుకున్నది ఎక్కడ? "

"నాకు తెలియనిది ఏదో జరుగుతోంది"

"అంటే దేవుడు ఉన్నాడనీ, ఆయన కోరుకున్నట్లు ఈ లోకం నడుస్తుందనీ నమ్ముతున్నావా? "

"ఏం.. నడవదా? అలా నడవకపోతే దేవుడికీ, ముఖ్యమంత్రికీ తేడా ఏముంది? అయినా నేను దేవుడు లేడని ఎప్పుడన్నాను? ఉన్నాడో లేదో తెలియదన్నాను. అంటేగింటే ఆయన చేతకానివాడని అన్నాను! అలసత్వం వలనో, నిర్లక్ష్యం వలనో ఈ లోకాన్ని సరిగ్గా నడపటం లేదన్నాను. ఒకవేళ అది తప్పయితే దానిని తప్పని నిరూపించే బాధ్యత మీదే!"

"బాధ్యత తీసుకున్న ఏ పనీ సరిగ్గా చేయలేకపోతున్న నీకు దేవుడి గురించి మాట్లాడే అర్హత ఎక్కడ ఉంది? అది వదిలెయ్! నువు నమ్మే సైన్సు గురించి మాట్లాడుకుందామా? "

"మీకు సైన్సు కూడా తెలుసా? "

నవ్వాడు సహదేవుడు. "నీకు తెలిసినంత తెలియదేమో! కానీ ఏదో కొంత తెలుసు. సరే, విషయానికి వస్తే.. కేయోస్ థియరీ గురించి విన్నావా? "

"లేదే.."

"సరే! నేను చెప్తాను విను. భౌతిక శాస్త్రం ప్రతి చర్యనీ మేథమేటికల్ ఈక్వేషన్స్‌గా మార్చి నిరూపించాలనుకుంటుంది. చాలావరకు సాధించింది కూడా! అఫ్‌కోర్స్, కొన్ని క్లిష్టమయిన చర్యలు ఏ సూత్రాలకీ లొంగవనుకో! అలాంటివాటిని వివరించాలంటే ఎప్పటికీ కుదరదు కూడా. వాటి ప్రతిస్పందనలను నిరూపించే సూత్రాలు లేవు. భౌతిక శాస్త్ర సూత్రాలకు లోబడి చరిస్తాయని అనుకునే సంఘటనలు క్రమం తప్పి ఊహకు అందనట్లు మారవచ్చు. ఏ సూత్రాలకూ అందవని అనుకుంటున్న

కొన్ని సంఘటనల వెనుక కూడా అంతర్లీ నంగా ఒక క్రమం ఉండవచ్చు"

"నాకు ఒక్కముక్క కూడా అర్థమవ్వలే దండీ.."

"వంద సంవత్సరాల తర్వాత అంటే 2113లో చంద్రగ్రహణం ఎప్పుడు ఏర్పడు తుందో ఇప్పుడు చెప్పగలవా? "

"ఆహా! ఇంకో వెయ్యేళ్ల తరువాత వచ్చే గ్రహణం గురించి కూడా చెప్పవచ్చు"

"మరి ఈ రోజు మధ్యాహ్నం సికింద్రా బాద్ నుండి బయలుదేరిన రైలు విజయ వాడ సరిగ్గా ఏ సమయానికి చేరుతుందో చెప్పగలవా? "

"అదెలా చెప్తాం? "

"ఏం? ఆ రైలు ఎంత వేగంగా వెళ్తుందో తెలుసు. దూరం తెలుసు. మరి లెక్క కట్టి చెప్పటానికి ఏమిటి బాధ? "

"లెక్కల్లో చెప్పవచ్చేమో! నిజ జీవితంలో ఎన్నో అవాంతరాలు రావచ్చు. ఇపుడు ప్రతిపక్షాలు మొదలు పెట్టిన ఉద్యమం ఏ రైల్ రోకో గానో పరిణమిస్తే అసలు రైలు విజయవాడకు చేరకపోవచ్చు కూడా"

అటూ ఇటూ చూసిన సహదేవుడికి ఒక కుళాయిలో నుండి కారుతున్న నీటి చుక్కలు కనిపించాయి. "అందులో నుండి కిందకు పడుతున్న నీటి చుక్కలను గమ నించు. ఒక నీటి చుక్క కింద పడిన రెండు సెకన్లకు మరొక చుక్క పడుతుంద నుకో! భౌతిక శాస్త్ర సూత్రాలను ఉపయో గించి సరిగ్గా తరువాత చుక్క ఎపుడు పడుతుందో చెప్పగలవా? "

"ఏమో..."

"చెప్పలేవు, సరే! అది కూడా వదిలెయ్! పిల్లలు ఆడుకునే మామూలు క్యారమ్ బోర్డ్ తీసుకో! అందులో స్ట్రైకర్‌ని బోర్డుకు ఒక పక్కన కొడితే అది అక్కడ నుండి మరొక అంచుకు, మరొక అంచుకు తగిలి చివరకు ఎక్కడో.. ఇంకో మూల ఉన్న కాయిన్‌కు తగలటం చూశావా? "

"నేను అలా కొట్టలేను. కానీ, వేరే ఆట గాళ్ళు కొడుతుంటే చూశాను"

"అలా కొట్టిన వ్యక్తిని మరలా అదే షాట్ కొట్టి ఆ ఫీట్ రిపీట్ చెయ్యమంటే చెయ్యగలడా? "

"అనుమానమే!..."

"ఎందుకు? "

"అతని చేతులు వణకవచ్చు. కొట్టే వేగంలో తేడా రావచ్చు. ఏదైనా జరగ వచ్చు"

"అదే ముందు నేను చెప్పింది. అదే కే వొస్ థియరీ. భవిష్యత్తులో ఇలా జరగవ చ్చని నువు ఊహించుకుంటున్న సంఘట నలు నిజం కాకపోవచ్చు. ఎక్కడదాకానో ఎందుకు.. ఎంత సైన్సు పరంగా అభివృద్ధి చెందినా, రేపు ఉదయం ఆకాశంలో మబ్బులు ఉంటాయో, లేదో కచ్చితంగా చెప్పగలరా? రాబోయే భూకంపాలు, సునామీలు ఎందుకు, ఎప్పుడు వస్తాయో ఊహించలేక పోతున్నారే! ఎందుకంటావ్? " అని ఆగి, ఆదిత్య నుండి ఏ సమాధానమూ రాకపోవటంతో తనే కొన సాగించాడు. "ఈ సృష్టిలో క్రమబద్ధత ఉంది. భూమి సూర్యుని చుట్టూ యుగ యుగాలుగా అదే వేగంతో, అదే దిశలో, అదే కోణంలో తిరుగుతూనే ఉంది. అలానే మిగిలిన గ్రహాలు కూడా! ఏది దారి తప్పినా విలయం సంభవించవచ్చు. కానీ అలా జరగదు. కారణం క్రమబద్ధత. కానీ ఆ క్రమబద్ధత ఈ భూమి మీద ఉన్న జీవం మధ్య కనపడదు. ముందే చెప్పు కున్నాం! పంచభూతాలు భౌతిక శాస్త్ర సూత్రాలకు లొంగవని. అదే పంచభూతా లతో నిండి ఉన్న జీవం ఎవరి అదుపాజ్ఞ లకూ లొంగదు. ఇప్పుడు ఇక్కడ కనిపించే మొక్క రేపటికి మరింత ఎదగవచ్చు. లేదూ.. ఏ మేకకో ఆహారం కావచ్చు.

మనిషి అవసరాలకు అంతరించిపోయి ఉండవచ్చు. రుతుపవనాల వంటి ప్రకృతి సంబంధిత ఘటనలు ఎవరి అదుపాజ్ఞల్లోనూ ఉండవు. పంటలు, మొక్కలు, కీటకాలు, జంతువుల చర్యలయినా అంతే! ఎవరూ నియంత్రించలేరు. అంతదాకా ఎందుకు నీ పిల్లలు కూడా నువ్వు ఊహించినట్లు ప్రవర్తించరు. అదే సృష్టి వైచిత్రి. అదే జీవన వైవిధ్యం. ఏ మనిషీ మరో మనిషిలా పుట్టడు. ఎవరి ప్రత్యేకత వారిదే! ఎవరి సామర్థ్యం వారిదే! అందరికీ ఉన్న ముడిసరుకు ఒకటే- శరీరం, మేధస్సు. వాటిని ఎవరు ఎలా ఉపయోగించుకుంటారన్నది వారి వారి తత్వాల మీద ఆధారపడి ఉంటుంది" సుదీర్ఘ వివరణ ఇచ్చాడు సహదేవుడు.

"దానికీ, నేను మనుషులందరికీ నిజమయిన సమానత్వం ఇవ్వమనటానికీ సంబంధం ఏమిటి? "

"ఇంకా అర్థం కాలేదా? ప్రాణమున్న జీవిని ఎవరూ అదుపులో పెట్టలేరు. నువ్వనుకున్నట్లు ప్రతి జీవినీ దేవుడు కంట్రోల్ చెయ్యడు. ఆ జీవి చేసే ప్రతి చర్యా ముందే రాసి పెట్టి ఉంటుందనేది ఒట్టి మాటే! ఎవరి కర్మలకు వారే బాధ్యులు. దాన్నే దేవుడు భగవద్గీతలో స్పష్టంగా చెప్పాడు. అన్ని జీవుల చర్యలను ఆయనే నియంత్రించేటట్లయితే సృష్టి, స్థితి, లయలకు బాధ్యత వహించి ధర్మాన్ని నిలబెట్టటానికి భూమి మీద స్వయంగా అవతరించవలసిన అవసరం లేదు"

"అలా అవతరించి మాత్రం దేవుడు ఈ భూమి మీద ఏమి మార్పు తేగలిగాడు? "

"మార్పు తెచ్చే బాధ్యత దేవుడిది కాదు. మార్పు తెచ్చుకునే బాధ్యత మనిషిదే! నువు జీవించటానికి ఇల్లు అద్దెకు తీసుకుంటావు. ఇల్లు ఇవ్వటం వరకే ఇంటి యజమాని బాధ్యత. ఆ ఇంటిని ఎంత సౌకర్యవంతంగా తీర్చిదిద్దుకుంటావన్నది నీ అభిరుచి, సామర్థ్యం పై ఆధారపడి ఉంటుంది"

"అలా అయినా నా వాదన సరయినదే! ఏదీ దేవుడి అదుపులో లేనపుడు ఇక ఆయన్ని పూజించటం ఎందుకు? "

నవ్వాడు సహదేవుడు. "ఈ మాట కూడా దేవుడు ముందే చెప్పాడు- నా వాదనతో నిన్ను ఒప్పించటం కష్టం.. అని"

"ఏనా ఏరి కోరి మిమ్మల్ని పంపింది మీరు సాధించగలరనేగా! ప్రయత్నించండి" అన్నాడు ఆదిత్య.

"అంత అవసరం నాకు లేదు. ప్రయత్నించి నిన్ను మార్చవలసిన అగత్యం అసలే లేదు. సృష్టిలో మనిషిని మిగిలిన జంతువుల నుండి వేరు చేసేది విచక్షణా జ్ఞానం. అసలు దేవుడున్నాడా, లేడా అన్న ఆలోచన రావటమే మనిషి విచక్షణా సామర్థ్యానికి గుర్తు. మరే జీవికీ లేనిదీ, మనిషికి ఉన్నదీ అదే!" చెప్పాడు సహదేవుడు.

"దేవుడు ఇచ్చిన విచక్షణ ఆయనకే వ్యతిరేకంగా ఉపయోగపడటం వింత కదూ!" వ్యంగ్యంగా అన్నాడు ఆదిత్య.

"ఒక్క అణుబాంబుతో లక్షలాది ప్రాణాలు తీయవచ్చు. అదే అణుశక్తితో కోట్లాది ప్రజల జీవనస్థాయిని పెంచవచ్చు. శక్తిని ఎలా వినియోగించుకోవాల

## కొత్తగాలి...



**పిండంలో ఆడపిల్ల**
**అని తెలిస్తే గండం**
**కడుపులోనే**
**అశ్రుఘోష!**

– ఈ. వేమన,
శ్రీకాకుళం

న్నది విచక్షణ తప్పు, దేవుడ్ని పూజించాలా లేదా అన్నది ఆలోచించటం కాదు. నువు పూజిస్తున్నావా లేదా అని రిజిస్టర్ పెట్టి నోట్ చేసుకునే తీరిక ఆయనకు లేదు"

"మరి ఆయన మనిషి నుండి ఏమి ఆశిస్తున్నాడు? "

"ఇంత అద్భుతంగా నిన్ను సృష్టించటం నీకు ఆ దేవుడిచ్చిన బహుమతి. ఈ జీవనాన్ని ఎంత అద్భుతంగా ముగిస్తావన్నది దేవుడికి నువ్విచ్చే బహుమతి. అంతకంటే నీ నుండి ఆయన ఏమీ ఆశించడు"

ఆ మాటల్ని అర్థం చేసుకోవటానికి అన్నట్లు ఆదిత్య కాసేపు మౌనంగా ఉన్నాడు.

అతని ఆలోచనలను చెదరగొడ్తూ సహదేవుడు చెప్పాడు. "మనం మొదలు పెట్టిన పని మరచిపోయాము. నీ స్నేహితుడికి సహాయం చెయ్యటానికి ఎంతమందిని నష్టపరిచావో చూశాం కదా! కనీసం అతనయినా సంతోషంగా ఉన్నాడేమో చూద్దామా? "

"అతనేమీ నా స్నేహితుడు కాదు" మొహం చిరాగ్గా పెట్టి అని, "సరే! పదండి.." అన్నాడు ఆదిత్య.

★ ★ ★

నారిగాడు అనబడే నారాయణ ఇప్పుడు మంచి బట్టలు కట్టుకుని జుట్టు కత్తిరించుకుని ఫ్రెష్‌గా తయారయ్యాడు. ఆహార్యం బాగుండటంతో ఈసారి హోటల్ లోపలకు వెళ్ళి, టేబుల్ ముందు కూర్చున్నా ఎవరూ అభ్యంతర పెట్టలేదు. అదే ఇంతకుముందు రోజుల్లో అయితే డబ్బులు ఇస్తున్నా ఇతన్ని అంటరాని వ్యక్తిలా ట్రీట్ చేస్తూ లోపలకు రానిచ్చేవారు కాదు.

ఆలోచనల మధ్య అతని భోజనం పూర్తయింది.

కడుపునిండా భోం చేసేటప్పటికి నిద్ర ముంచుకువస్తోంది. పూర్వపు రోజుల్లో అయితే ఎప్పుడయినా, ఎక్కడయినా, ఎండయినా, వానయినా ఎక్కడపడితే అక్కడ పడుకుని నిద్రపోయేవాడు. ఇపుడు నడుముకు ఉన్న నోట్ల కట్ట బరువు అతన్ని ఆ పని చెయ్యనివ్వటంలేదు.

మిగిలిన అన్ని అవసరాలకంటే తల దాచుకోవటానికి ఒక నీడ అత్యంత అవసరం అనిపిస్తోంది. తన దగ్గర డబ్బుండవచ్చు. కానీ, ఇప్పటికిప్పుడు ఇల్లు కావాలంటే ఎక్కడ దొరుకుతుంది?

అప్పుడు అతనికి గుర్తుకు వచ్చాడు కుంటి వీరయ్య. అతనిది తమ అందరికంటే కాస్త భిన్నమయిన స్టైల్. అడుక్కుంటాడే కానీ, వచ్చిన డబ్బులు దురలవాట్లకి తగలెయ్యడు. పగలంతా ఎక్కడ తిరిగినా రాత్రికి ఇంటికి చేరతాడు. అవును! అతనికి ఒక ఇల్లంటూ ఉంది. అతన్ని పట్టుకుంటే తనకీ తలదాచుకోవటానికి నీడ ఏర్పాటు చేయవచ్చు.

ఆ ఆలోచన రాగానే పార్కులోకి దారి తీశాడు నారాయణ. మధ్యాహ్నం పూట అడుక్కునే వాళ్ళందరూ విశ్రాంతి కోసం అక్కడకే చేరతారు.

అతను ఊహించినట్లే కొంతమంది చెట్ల నీడన పడుకుని కనిపించారు. వడివడిగా వారి దిక్కుకు నడిచాడు నారాయణ. అక్కడ కుంటి వీరయ్య కనపడలేదు. కానీ తనకు బాగా తెలిసిన శీను కనిపించాడు.

"ఏంట్రా శీనూ? ఏంటి సంగతులు? " అంటూ పలుకరించాడు నారాయణ.

శీను అదిరిపడి పలుకరించిన వ్యక్తి వైపు చూశాడు. అప్పటివరకూ తన దగ్గరకు నడుచుకుంటూ వచ్చిన వ్యక్తి నారాయణ అని అతను అనుకోలేదు. ఇప్పుడయినా అతని స్వరాన్ని బట్టి తప్ప మనిషిని తరచి తరచి చూసినా అతనిలో తనకు తెలిసిన నారిగాడు కనిపించటంలేదు.

"ఈ వేషం ఏంట్రా? " ఆశ్చర్యం వెలిబు

చ్చుతూ అడిగాడు శీను.

ఆ గుంపులోనే ఉన్న రంగి.. శీను, నారాయణ మధ్య జరుగుతున్న మాటలను బట్టి నారాయణని గుర్తుపట్టి వారి దగ్గరకు వచ్చింది.

"ఏంటి రంగి ఈడెవరో గుర్తు పట్టావా? " పరీక్ష పెట్టాడు శీను.

ఆ మాటలు పట్టించుకోకుండా నారాయణని తదేకంగా చూసింది రంగి. 'అబ్బ! ఎంత బాగా తయారయ్యాడో! సినిమా ఈరోలాగా ఉన్నాడు' అనుకున్న ఆమె నారాయణ మీద నుండి చూపులు తిప్పుకోలేకపోతోంది.

"సరేగానీ! వీరయ్య ఏడైనా కనిపించాడేట్రా? " శీనుని అడిగాడు నారాయణ.

"కనపడలేదే! అయినా వాడితో నీకు పనేంటి? " ఎదురు ప్రశ్నించాడు శీను.

నారాయణ ఏమీ మాట్లాడలేదు. అసహనంగా ఉంది. నీట్‌గా తయారవ్వందే సభ్య సమాజం వారిలో ఒకడిగా చేర్చుకోవటానికి అంగీకరించదు. అలా అని వారు కోరుకున్నట్లు మారాలని ప్రయత్నిస్తే, అంత శుభ్రంగా ఉన్న వ్యక్తిని ఒకప్పటి పాత సహచరులే వింతగా చూస్తున్నారు.

"సరేగానీ ఈ ఏషం ఏమిటి? ఇంక అడుక్కోవా? " రంగి అడిగింది.

ఎటూ కాకుండా తల తిప్పాడు నారాయణ.

"నన్ను కూడా నీతో తీసుకుపోతావా? " ఆశగా అడిగింది రంగి.

నిన్నటిదాకా రంగి సాహచర్యం కోసం పోటీపడ్డ వారిలో నారిగాడూ ఒకడు. కానీ ఇప్పుడు తన దగ్గరకు వచ్చి తననొక హీరోలాగా చూస్తున్న రంగి అతనికి ఆకర్షణీయంగా కనపడటంలేదు. పైగా ఆమె అత్యుత్సాహం దురాశలా అనిపిస్తోంది.

అందుకే, "నిన్ను తీసుకుపోవటానికి నేనెక్కడికి పోతున్నాను? " విసుగ్గా అంటూ పక్కకి నడిచాడు నారాయణ.

అయితే రంగి అతన్ని వదల్లేదు. ఆమెకు నారిగాడు అందివచ్చిన అవకాశంలా కనిపిస్తున్నాడు. ఎలాగోలా తన జీవితాన్ని వీడితో ముడిపెట్టుకోగలిగితే ఇక ముందు ముందు దేని గురించీ ఆలోచించే అవసరం రాదని అనిపిస్తోంది. పైగా వాడు నిన్నటి దాకా తన పొందుకోసం పరితపించినవాడు. తనకు దగ్గరవటానికి ప్రయత్నించాడు కూడా! అందుకే రంగి అతన్ని వదల్లేదు. అతని వెంటబడుతూ "ఈ బట్టలకి, ఏసానికీ ఎంత కర్సయ్యిందేటి? అంత డబ్బు నీకేడిది? " అని రెట్టించింది.

అసలే చిరాగ్గా ఉంది నారాయణకి. దానికి తోడు ఈ రంగి గోల ఒకటి.

> ## కొత్తగాలి...
>
> **గాలిని**
> **తక్కువగా చూడకు**
> **వాలిపోతావ్!**
> **అది కాస్త బిగదీస్తే!!**
>
> – పి.వి. రమణకుమార్,
> చిలకలూరి పేట

"ఏటి మాట్లాడవూ? " భుజం మీద చెయ్యి వేస్తూ మరలా అడిగింది రంగి.

అంతే నారాయణ సహనం నశించింది. చిరాకంతా చేతుల్లో చూపిస్తూ ఆమెను తన నుండి దూరంగా తోసేశాడు. "ఇదుగో! నా ఎనక పడమాకు. నీ దారి నీది. నా దారి నాది" అంటూ వేగంగా అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

వెళ్లిపోతున్న నారాయణని కసిగా చూస్తూ ఉండిపోయింది రంగి.

అక్కడ నుండి దూరంగా నడిచిన నారాయణ మరొక రెండు మూడు చోట్ల కను

క్కుంటే తెలిసింది వీరయ్య ఉండే చోటు. దాన్ని వెతుక్కుంటూ అటు వైపు బయలు దేరాడు.

వీరయ్య ఉండేది స్లమ్ ఏరియా! అలాంటి ఏరియా నగరానికి అంత నడిబొడ్డున ఉండటం ఆశ్చర్యమే! మెయిన్ రోడ్ పక్కన ఉన్న సందుల్లో కొద్ది దూరం వెళ్ళగానే రైలు పట్టాలు వచ్చాయి. వాటిని దాటి డ్రైనేజ్ కాలువ పక్కగా మరి కాస్త దూరం వెళ్ళగానే కనిపించింది - వేలమంది నివసించే స్లమ్. టార్పాలిన్ పట్టాలు, ప్లాస్టిక్ కవర్లు, విరిగిపోయిన ఆస్‌బెస్టాస్ రేకులు.. మొదలైనవాటితో కట్టుకున్న గూళ్ళు అవి. గూళ్ళు అని కూడా అనకూడదేమో! ఎందుకంటే పక్షుల గూళ్ళు వీటికంటే సౌకర్యంగా ఉంటాయి.

చాలామందిని అడుగుతూ వెళ్తే చివరకు దొరికింది వీరయ్య గుడిసె. దానిలో మగతగా పడుకుని ఉన్నాడతను. అతి కష్టం మీద కళ్ళు తెరిచి ఎదురుగా ఉన్న వ్యక్తిని పోల్చుకోలేక అయోమయంగా చూశాడు.

"నేను బాబాయ్! నారిగాడిని" అని చెప్పిన తరువాత పరీక్షగా చూసి పోల్చుకున్నాడు. "ఏంటి బాబాయ్! బయటకు రావట్లేదేమిటి? " ప్రశ్నించాడు నారాయణ.

"రెండురోజుల నుండి జొరంరా! అందుకే నీరసంగా ఉండి బయటకు రావటంలా! అది సరే! నువ్వేంట్రా... ఇట్టా మారిపోయావ్? " ఆశ్చర్యాన్నంతా మాటల్లో చూపిస్తూ అడిగాడు వీరయ్య.

"చెప్తాను కానీ.. ఏంటి బాబాయ్! ఇట్టా ఒక్కడివే పడున్నావ్, ఏంది? ఇంట్లో వాళ్ళంతా ఏరి? "

"జొరం వచ్చింది నాకు గానీ, ఆళ్ళకి కాదుగా! నా చుట్టూ అందరూ కూచుంటే ఎట్టా జరుగుద్ది? అందుకే అందరూ ఎవరి పనులకు ఆళ్ళు పోయారు"

నారాయణ జేబులో నుండి బీడీకట్ట తీసి ఒక బీడీ బయటకు వచ్చేటట్లు జార్చి వీరయ్య ముందుకు చెయ్యి చాపాడు.

అంత నీరసంలో కూడా దాన్ని అందుకున్నాడు వీరయ్య.

ఇద్దరూ బీడీలు వెలిగించారు.

"నాక్కూడా ఉండటానికి ఒక గుడిసె కావాలి బాబాయ్!"

"ఇంతకుముందు ఎన్నిసార్లు చెప్పినా నాకు గుడిసెందుకు? ఎక్కడ పడితే అక్కడ పడుకోవటానికి ఇంత పెపంచకం ఉంటే, ఆ ఇరుకు గుడిసెందుకు అని ఎకసెక్కాలాడావుగా!"

"అయ్యన్నీ కాదులే బాబాయ్! నాకు ఉన్నపలాన ఒక గుడిసె కావాలి"

"ఏంటంత తొందర? లగ్గం కుదిరిందా ఏంది? "

ఏ సమాధానమూ చెప్పకుండా నారాయణ మౌనంగా ఉండటంతో సిగ్గనుకున్నాడు వీరయ్య. "బట్టలు మంచివి ఎయ్యగానే నీ దగ్గు కూడా తగ్గిందే, సిత్రంగా" హాస్యంగా అన్నాడు.

నారాయణ ఆలస్యాన్ని తట్టుకోలేనట్లు, "ముందు గుడిసె సంగతి చూడు బాబాయ్" అన్నాడు.

"మరి సొమ్ములు ఉన్నాయా? ముందు డబ్బులు కట్టందే దగ్గరకూ రానియ్యరు"

"ఉన్నయ్‌లే" అన్నట్లు తల ఊపాడు నారాయణ.

"ఈ సందు చివర గుడిసెలో ఉంటాడు ఒకడు. పేరు మస్తాన్. ఆడి దగ్గర పది గుడిసెల దాకా ఉన్నాయి. ఎప్పుడూ ఏదో ఒకటి ఖాళీగానే ఉంటుంది. పోయి, నేను పంపానని చెప్పి అడుగు. నాకు ఓపిక లేదు. లేకపోతే నేనే వచ్చేవాడిని..." అని ఆయాస పడ్డాడు వీరయ్య.

"ఫరవాలేదు బాబాయ్! ఆ మాత్రం దారి చూపిస్తే చాలు. మిగిలింది నేను కనుక్కుంటాను" అని బయలుదేరాడు

నారాయణ.

"ఒరేయ్ నారిగా!" నీరసంగా పిలిచాడు వీరయ్య.

వెనుతిరిగి చూశాడు నారాయణ.

"ఎందుకు మారావోగానీ మంచిగా మారావు. మళ్ళీ అడుక్కోవద్దు. ఏదో ఒక పని చేసుకు బతుకు. పెళ్ళి చేసుకో" సలహా చెప్పాడు వీరయ్య.

ఏమీ మాట్లాడకుండా బయటకు నడిచాడు నారాయణ.

వీరయ్య చెప్పిన మస్తాన్ గుడిసెలోనే ఉన్నాడు. ముందు ఇతన్ని అనుమానంగా చూసినా, వీరయ్య పంపాడని చెప్పాక మెత్తబడ్డాడు.

"అయిదొందలు అడ్వాన్సు. అద్దె నెలకి నాలుగొందలు" చెప్పాడు మస్తాన్.

మాట్లాడకుండా వెయ్యి నోటు తీసి ఇచ్చాడు నారాయణ.

అందరూ చూసినట్లే నోటును అటు ఇటూ తిప్పి చూసి "ఏం చేస్తుంటావ్?" అని అడిగాడు.

"పని చూసుకోవాలి" మాటలు పొడిగించకుండా క్లుప్తంగా చెప్పాడు నారాయణ.

అనుమానంగా ఉన్నా ఇంక ఏమీ మాట్లాడలేదు మస్తాన్. పైగా నోటులో అనుమానింపదగ్గ అంశం ఏమీ కనపడలేదు. "సరే! చూపిస్తాను రా!..." అంటూ అతన్ని వందగజాల అవతల ఉన్న ఒక గుడిసె దగ్గరకు తీసుకువెళ్ళాడు.

అతుకుల బొంతలా రకరకాల సైజుల చెక్కలను కలిపి చేసిన తలుపుకు గట్టిగా లాగితే ఊడే గొళ్ళెం ఒకటి ఉంది. ఆ తలుపుకు తాళం ఎందుకో అర్థం కాలేదు నారాయణకి. తాళం తీసి లోపలకు నడిచి, ఆ తాళాన్ని తన వెనుక వచ్చిన నారాయణ చేతిలో పెట్టాడు.

ఇక తన పని అయిపోయినట్లు బయటకు వెళ్తున్న అతన్ని "మిగిలిన వంద..." అని అడిగాడు నారాయణ.

నారాయణ చేతిలో పెట్టిన తాళం వైపు చేత్తో చూపిస్తూ, "దాని ఖరీదుకి మిగిలిన వందా సరిపోయింది..." అని వెళ్లిపోయాడు మస్తాన్.

కింద అంతా మట్టినేల. ఒక మూల నిలబెట్టి ఉన్న చింకి చాప తీసి కింద పరచుకుని నడుము వాల్చాడు. అంతకంటే దరిద్రంగా ఉన్న ప్రదేశాల్లో నిద్రించిన అతనికి అదేమీ కష్టంగా అనిపించలేదు.

కాసేపు నిద్రపోయాడో లేదో ఉలిక్కిపడి మెలకువ వచ్చింది అతనికి. ఏదో పీడ కల. భయంతో చెమటలు పట్టి శరీరమంతా తడిచిపోయి ఉంది. గబుక్కున నడుము తడిమి చూసుకున్నాడు. డబ్బు అక్కడే ఉంది. అతని నుండి నిట్టూర్పు వెలువడింది.

డబ్బు లేకపోతే ఒకటే బాధ. అది ఉంటే ఎన్ని బాధలో అతనికి నెమ్మదినెమ్మదిగా తెలిసి వస్తున్నాయి.

రకరకాల ఆలోచనలతో ఇక నిద్ర పట్టదని అర్థమై లేచి గుడిసెకి తాళం పెట్టి తిరిగి రోడ్డున పడ్డాడు.

నడుస్తూ మెయిన్ రోడ్డు మీదకు వచ్చిన అతను ఒక చాయ్ తాగి ఎటు వెళ్ళాలో తెలియక అక్కడే నిలబడిపోయాడు.

ఇంతలో అతనికి దూరంగా రంగితో

### కొత్తగాలి...

**'మగాళ్లె'క్కువయ్యారని**
**జనాభా లెక్కల చిట్టా**
**'మృగాళ్లె'క్కువయ్యారని**
**నేరాల చిట్టా!**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

మాట్లాడుతున్న శంకర్ కనిపించాడు. శంకర్ ఒక చిన్న సైజు గూండా. అడుక్కునే వాళ్ళకి రింగ్ లీడర్. వాళ్ళలో వాళ్ళకి సమస్యలు సృష్టించి, తనే వాటిని తీరుస్తూ ఉంటాడు. అతనికి అడుక్కునే వాళ్ళందరూ, తమకు ఎలాట్ చేసిన సెంటర్ని బట్టి ప్రతిరోజూ డబ్బు ఇవ్వాలి. అతని వాలకం చూస్తుంటే ఈ రోజు కలెక్షన్ల కోసం బయలుదేరినట్లుంది. అప్పటికే ఆ రోజు కలెక్షన్ రంగి నుండి వసూలు చేసుకున్నట్లున్నాడు. తలెత్తి అటుఇటూ చూసిన అతనికి నారిగాడు కనిపించాడు. అతనెవరో అర్థం కానట్లు అనుమానంగా చూస్తూ రంగిని ఏదో అడిగాడు. రంగి కూడా నారిగాడి వైపు చూసి ఏదో చెప్పింది.

సాలోచనగా తల ఊపిన శంకర్ నారాయణ వైపు వచ్చాడు. "ఏరా నారిగాడివి కదూ! శానా ఇస్టైల్‌గా మారేవే! పైసలేడకెల్లి వచ్చినయ్‌రా? " అని అడిగాడు.

నారాయణ సమాధానం చెప్పకుండా జేబులో నుండి ఇరవై రూపాయల నోటు తీసి ఇచ్చాడు. ఆ నోటు జేబులో నుండి తీస్తున్నపుడు దానితో పాటు వంద నోట్లు ఉండటం శంకర్ కళ్ళలో నుండి తప్పించుకోలేదు. నోటు తీసుకుని ఇంకా తననే పరీక్షగా చూస్తున్న శంకర్‌తో, "రేపటేల నుండి నేను అడుక్కోటం లేదు. కావాలంటే నా చోటు ఇంకెవర్నికైనా ఇచ్చుకో" అన్నాడు.

శంకర్ నవ్వి వెనుతిరిగాడు. కానీ, అతని మనసులో ఎన్నో అనుమానాలు కదలాడుతున్నాయి. రెండు అడుగులు వేసిన వాడు వెనక్కి వచ్చి "మరి ఇప్పుడుండడం ఏడ? " అన్నాడు.

'నీకు అనవసరం...' అన్నట్లు తల తిప్పుకున్నాడు నారాయణ.

శంకర్ మాట్లాడలేదు. అక్కడ నుండి వెళ్ళిపోయాడు. అయినా అతని చూపుల్లో అనుమానం తొలగిపోలేదు.

ఆ తరువాత నారాయణకి ఏమి చెయ్యాలో అర్థం కాలేదు. మంచో చెడో ఇంతకుముందు చేయటానికి ఒక పని అంటూ ఉండేది. ఇప్పుడు అలా ఏ పనీ లేకుండా నిలబడితే ఎలాగో ఉంది.

అతను నిలబడ్డ ప్రదేశానికి దగ్గరలో ఒక సినిమా హాలు ఉంది. హాలు ముందు పెద్ద పెద్ద 'క్యూ'లు ఉన్నాయి. అసలే ప్రఖ్యాత హీరో ఆదిత్య నటించిన సినిమా, అందులోనూ హిట్‌టాక్ రావటంతో బాగా రద్దీగా ఉంది. అటు నడిచాడు నారాయణ.

ఇంతకుముందు ఇలాంటి క్యూలు ఛేదించటం అతనికి వెన్నతో పెట్టిన విద్య. అసలు అతను క్యూలోకి ప్రవేశించగానే అతని దగ్గర నుండి వస్తున్న దుర్గంధానికి సగం మంది తప్పుకుని దారి ఇచ్చేవారు. మిగిలిన వారిని తన భుజబలంతో జయించేవాడు.

కానీ ఇప్పుడు ఏ పని చేయాలన్నా నడుముకు ఉన్న బరువు అడ్డు వస్తుంది. అందుకే మర్యాదగా వెళ్ళి క్యూ చివర నిలబడ్డాడు. కళ్ళు ఎటు చూస్తున్నా ఒక చెయ్యి మాత్రం నడుము మీద వేసుకుని జాగ్రత్తగా ఉన్నాడు.

తన అవతారం చూసిన ఎవరూ తన దగ్గర అంత డబ్బుంటుందని ఊహించరు కాబట్టి ఇబ్బంది లేదు. కానీ తన దగ్గర డబ్బుందని ఎవరైనా పసిగట్టారంటే ఇంత రష్‌లో వాళ్ళు అవలీలగా కొట్టేస్తారు. 'ఇంత రిస్క్ చేయటం అవసరమా? అని అతను ఆలోచిస్తున్నంతలో అనుకోని అనూహ్య సంఘటన జరిగింది.

హఠాత్తుగా ఒక ఊరేగింపు అటు వచ్చింది.

'అవినీతి ముఖ్యమంత్రి రాజీనామా

చేయాలి', 'సీఎమ్ డౌన్ డౌన్' అని నినాదాలు ఇస్తూ రోడ్డు మీద ఉన్న దుకాణాలన్నిటినీ మూసేయిస్తున్నారు.

వారిలో కొంత మంది థియేటర్ వైపు వచ్చారు. వారిని చూసిన థియేటర్ మేనేజర్ పరుగెత్తుకుంటూ బయటకు వచ్చాడు. ఆందోళనకారులను బతిమాలటం మొదలు పెట్టాడు.

"బాబ్బాబు! చాలా మంది ప్రేక్షకులు అడ్వాన్స్ బుకింగ్ చేయించుకున్నారు. అయినా బంద్ రేపు అన్నారు కదా!" అని ఏదో మాట్లాడబోతున్న అతన్ని మధ్యలోనే ఆపారు వారు.

"అవన్నీ మాకు తెలియదు. మర్యాదగా థియేటర్ మూయిస్తావా? అద్దాలు పగల కొట్టమంటావా? " అన్నాడు వారికి లీడర్‌లా కనపడుతున్న వ్యక్తి.

ఆ మేనేజర్ మరి మాట్లాడలేదు.

క్యూలో ఉన్న జనాన్ని చెల్లా చెదురు చేసి, హాలు మూయించి ముందుకు సాగిపోయింది ఆ గుంపు. వేసుకున్న బట్టలు నలిగి, జుట్టు చెదిరి బయట పడ్డాడు నారాయణ. అతనిలాంటి వారు మరి నలుగురు అక్కడనుండి ఎటు వెళ్ళాలో తెలియనట్లు అక్కడే తచ్చట్లాడుతున్నారు.

"మళ్ళీ ఓట్ల పండగ వచ్చుద్దంట" అన్నాడు వారిలో ఒకడు.

"అయితే? " అడిగాడు మరొకడు.

"మామూలుగా అయితే అయిదేళ్ళకొకసారి ఓట్లు వెయ్యాలి. అంతకంటే ముందే ఆ పండుగ రావాలని వాళ్ళ ఆరాటం" ఊరేగింపులోని వారిని ఉద్దేశించి అన్నాడు మరొకడు.

"అది సరేనయ్యా! ముందే ఎన్నికలు వస్తే మనకేమిటి లాభం? " అడిగాడు ఒకడు.

"ఓటుకు అయిదొందలు ఇవ్వటంలా! అదే లాభం"

"ఏంది? అయిదొందలిచ్చారా? మరి మాకు మూడొందలే ఇచ్చారే? "

"బేరం చేయాలన్నా! ఏదైనా బేరం చేస్తేనే గిట్టుబాటయ్యేది? "

"డబ్బు తీసుకుని ఓటేస్తే తప్పంటగా! టీవీలన్నిట్లో చెప్తుంటారు"

"అయ్యన్నీ ఉత్తదే అన్నా! ఆళ్ళేమన్నా జేబులో డబ్బులిత్తారా? మనికి రావాల్సిన డబ్బేనంటలే! సదువుకున్న బాబొకడు చెప్పాడు"

"నీకెంత ఇచ్చారేంటి? " ఈ మాటలను మౌనంగా వింటున్న నారిగాడ్ని అడిగారు.

"ఆ ఓటేందో, దాని కతేందో నాకు తెలియదు. నాకసలు ఓటే లేదు" చెప్పాడు నారిగాడు.

అందరూ ఆశ్చర్యంగా అతడి వైపు చూశారు. ప్రపంచంలోకెల్లా పిచ్చివాడు అతడే అని తీర్మానించి ఎవరి దారిన వారు పోయారు.

★ ★ ★

"ఎవరికి తోచింది వాళ్ళు మాట్లాడుతున్నారు తప్ప ఎవరూ నా సినిమా గురించి పట్టించుకోరే! అన్ని థియేటర్లూ ఇలాగే మూసేస్తే? " అని జరగబోయేది ఆలోచించి, "మై గాడ్! నిర్మాత నెత్తిన చెంగేసుకుని పోవలసిందే!" అన్నాడు ఆదిత్య.

## కొత్తగాలి...

**ఏదో జరుగుతుంది**
**అనుకోవడం భ్రాంతి!**
**అనుకున్నది జరిగితే శాంతి!**
**అనుకోనిది జరిగితే విభ్రాంతి!**

– *ఎన్. రఘురామమూర్తి,*
*మణికొండ, హైదరాబాద్*

"ఏమన్నావ్! మై గాడా? నీ విషయానికి వచ్చేటప్పటికి దేవుడు గుర్తుకు వచ్చాడా? " వ్యంగ్యంగా అన్నాడు సహదేవుడు.

"అది ఏదో మాటవరసకి.. ఫ్లోలో అన్నానులెండి. మీరు మరీ ఎక్కువ చేస్తుంటారు. అసలు విషయం వదిలేసి ఇలాంటి పనికిరాని విషయాలు పట్టించుకుంటారు. ఇంతకీ ఎంత అన్యాయం జరుగుతోందో గమనించారా? ముఖ్యమంత్రి అవినీతికీ, సినిమాహాలు మూసివేతకీ ఏమిటి సంబంధం? ఎందుకు ప్రజల్ని తమకు నచ్చిన సినిమా కూడా చూసుకోనివ్వకుండా ఇబ్బంది పెడుతున్నారు? "

"ఇప్పుడు ప్రజలు నీ సినిమా చూడలేకపోవటమే తక్షణ సమస్య. అవునా? "

తడబడ్డాడు ఆదిత్య. "అంత వెటకారం వద్దులెండి. ప్రజలు సినిమా చూడలేకపోవటం తక్షణ సమస్య అనలేదు. ప్రజలని బలవంతంగా, వారి అభీష్టానికి వ్యతిరేకంగా అలా పంపించివెయ్యటం ఎంతవరకు సబబు? రాష్ట్రం మొత్తం ఇలా సినిమా ఆడకపోతే నిర్మాతకు ఎంత నష్టం? పైగా రేపు బంద్ అంటున్నారు. అంటే సినిమా నడవదన్నమాట. సినిమా రిలీజయ్యాక వీకెండ్లో రెండు రోజులు ఆడలేదంటే ఇరవై శాతం నష్టం వచ్చినట్లు" ఆవేశంగా అన్నాడు ఆదిత్య.

"సినిమా చూడదలుచుకున్నవారు రెండ్రోజుల తర్వాత మాత్రం చూడరా? "

"ఇంకా ఏ కాలంలో ఉన్నారండీ బాబూ! ఇప్పుడు ఎంత గొప్ప సినిమా అయినా ప్రచారపు వేడిలోనే చూస్తారు తప్ప, చప్పగా చల్లారిన తరువాత ఎవరూ చూడరు. ఈలోపు ఇంకో కొత్త సినిమా వస్తుంది. ఈ సినిమా గురించి ఇక ఎవరు పట్టించుకుంటారు? "

"అయితే నీ సినిమాకి నష్టాలు రావచ్చంటావ్! పొద్దున నువ్వేమన్నావో గుర్తుందా? ఈ సినిమా సూపర్ హిట్ కాకుండా ఎవరూ ఆపలేరన్నావ్!"

"అవును. కొంపతీసి దేవుడే నా మీది కోపం సినిమా మీద చూపిస్తున్నాడా ఏమిటి? "

"ఆయనకు అంత కోరిక, తీరిక, అవసరం లేవు. అయినా ఎవరి గోతులు వారే తీసుకోవటానికి పోటీ పడే ఈ ప్రపంచంలో నీ సినిమా ఫ్లాప్ కావాలంటే ఎవరో ఎందుకు? నువ్వే చాలు.."

సహదేవుడు చెప్పిన మాటలు అర్థం అయ్యీ కానట్లుండటంతో ఆలోచనలో పడ్డాడు ఆదిత్య. అతన్నడిగి క్లారిఫై చేసుకుందామనుకునేలోపే కదిలి వెళ్ళిపోవటంతో పరుగెత్తుతున్నట్లు నడిచి అతన్ని అందుకున్నాడు ఆదిత్య.

ఆదిత్య అడగకముందే సమాధానం చెప్పాడు సహదేవుడు. "నువు బాధ పడదలుచుకుంటే నీ సినిమా ఫ్లాప్ కావటం కంటే బాధ పడవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. బంద్ కారణంగా తరిమి వేయబడిన ఆ పానీపూరీలు అమ్ముకునే వ్యక్తిని చూడు. మిగిలిపోయిన పూలని తీసుకుని నిరాశగా ఇంటికి వెళ్తున్న ఆ పాపని చూడు. గాలిపోయిన టైర్లతో మూలపడ్డ ఆ ఆటోలను చూడు. రేపటికి పాడయిపోయే పళ్ళను ఏమి చేయాలో తెలియక శూన్యంలోకి చూస్తూ బండిని తోసుకుపోతున్న ఆ వృద్ధుడ్ని చూడు. అవేమీ పట్టించుకోకుండా.. నీకూ, నీ సినిమాకీ జరిగింది మాత్రమే అన్యాయమంటే నేను ఒప్పుకోను"

సహదేవుని మాటలకు చక్షువులు విచ్చుకున్నట్లయింది ఆదిత్యకి. అయితే అతన్ని ఆ స్థితిలో ఎక్కువ సేపు ఉంచలేదు సహదేవుడు. "ఎంతసేపూ నీ గురించిన ఆలోచనలేనా? మల్హోత్రా బృందం ఏమి చేస్తు

న్నారో చూడవద్దా? " అన్నాడు.

ఆదిత్య కూడా నీరసంగానే అయినా, "పదండి" అన్నాడు.




మల్హోత్రా తేరుకున్నాడు. తను డీలా పడటం వలన సమస్యలు పెరగటం తప్ప తగ్గవని అతనికి తెలుసు. తన ముఖ్యమయిన మేనేజర్లను పిలిచి సమస్యను సమీక్షించటం మొదలు పెట్టాడు.

ఈలోపు తనకున్న రాజకీయ పలుకుబడిని క్రోడీకరించి ఢిల్లీ మొత్తాన్నీ కదిలించాడు.

"ప్రస్తుతం మన విమానాలు ఏమీ తిరగటంలేదు. అవునా? " తన మేనేజర్లను అడిగాడు మల్హోత్రా.

"అవును సార్!"

"మరి ప్రయాణికుల పరిస్థితి ఏమిటి? "

"వీలయినంతవరకు వేరే విమానాల్లో పంపిస్తున్నాం సర్. కానీ ఏ విమానాల్లోనూ సీట్లు ఖాళీలు లేవు. అందుకే చాలామందిని మీరు చెప్పినట్లు స్టార్ హోటళ్ళకు పంపాం. వారిని కూడా రేపు వీలయినంత త్వరగా వారి గమ్యస్థానాలకు చేరుస్తాం"

"రేపట్నుంచి టిక్కెట్లు బుక్ చేసుకున్న ప్రయాణికుల సంగతి మీరేం చేశారు? "

"వారికి ఇప్పటికే మన సమస్య వివరిస్తూ మెసేజ్‌లు ఇస్తున్నాం. వారి డబ్బులు వారికి వెనక్కి పంపిస్తున్నాం"

'కొంతలో కొంత నయం' మనసులో అనుకున్నాడు మల్హోత్రా.

ఇంతలో అతని టేబుల్ మీద ఫోన్ మోగింది. ఢిల్లీ నుండి సివిల్ ఏవియేషన్ మినిస్టర్ మాట్లాడుతున్నాడు.

"వాట్ మిస్టర్ మల్హోత్రా? ఏమిటి మీ సమస్య? "

"డబ్బు" సింపుల్‌గా చెప్పాడు మల్హోత్రా.

"అది అవసరం లేనిది ఎవరికి? " తనూ అంతే స్పాంటేనియస్‌గా సమాధానం ఇచ్చాడు అటువైపు ఉన్న మినిస్టర్.

మినిస్టర్‌కు, మల్హోత్రాకి పరిచయం ఒకింత ఎక్కువే! అందుకే మల్హోత్రా అంత ఓపెన్‌గా మాట్లాడుతున్నాడు. "నాకు ఇపుడు కావలసింది ఓదార్పు కాదు, సహాయం. అది మీరు ఇవ్వలేరు. మీ ఫైనాన్స్ మినిస్టర్ ఇవ్వగలరు"

"ఆయనతో నేను మాట్లాడతాను. మీకు కావలసిన సహాయం ఇప్పించే పూచీ నాది. సరేనా? "

"ఆ సహాయం చెయ్యండి. మీ మేలు ఈ జన్మకు మరిచిపోను."

"మేలు చేస్తున్నది మరిచిపోవటానికా? బాగా గుర్తుపెట్టుకో.. ఇంతకి ఇంతా బదులు తీసుకుంటాను" నవ్వుతూ అని ఫోన్ పెట్టేశాడు మినిస్టర్.

తరువాత ఆ మినిస్టర్ ఫైనాన్స్ మినిస్టర్‌కి ఫోన్‌చేశాడు.

"ప్రైవేట్ వ్యాపారవేత్తల సమస్యలు కూడా నేనెక్కడ తీర్చగలను? " విసుగ్గా అన్నాడు అంతా విన్న ఫైనాన్స్ మినిస్టర్.

"ఈ సమస్య కేవలం మల్హోత్రాకో, అతని స్కైలైన్ ఎయిర్‌లైన్స్‌కో సంబంధించినది కాదు. మనదేశ పరువుప్రతిష్టలకు సంబంధించినది. ఒక విమానయాన సంస్థని మూతబడేటట్లు చేయటం చాలా

తేలిక. కానీ తిరిగి అంతటి సంస్థని పున ర్నిర్మించటం ఎంత కష్టమో మీకు తెలియదా? " అని నచ్చచెప్పాడు.

ఫైనాన్స్ మినిస్టర్ కన్విన్స్ కావటానికి కాస్త సమయం పట్టింది.

వచ్చే ఎన్నికల్లో మల్హోత్రా తనకు ఎలా సహాయపడగలడో వివరించాక ఆయన ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి.

ఎట్టకేలకు సాయం చేయటానికి అంగీకరించాడు. "అయితేం చెయ్యాలంటావ్? " అడిగాడాయన ఏవియేషన్ మినిస్టర్‌ని.

"మీకు తెలిసిన ఎవరో ఒకరి ద్వారా అప్పు ఇప్పించండి"

"ఇదేమన్నా ప్రైవేట్ ఫైనాన్స్ వ్యాపారమా? అయినా అతనికి కావలసిన మొత్తం వేల కోట్లలో ఉంటుంది"

"ఎంతవుంటే ఏంటి? మీరేమన్నా ఇస్తున్నారా? మీకు తెలిసిన ఏ బ్యాంకో ఉండకపోదు. దానిద్వారా అప్పు ఇప్పించండి"

"సరే! నేను చూసుకుంటాను" అని ఫోను పెట్టేశాడు ఫైనాన్స్ మినిస్టర్.

అయిదు నిమిషాలు ఆలోచించిన ఆయనకు ఆదిశేషు గుర్తుకు వచ్చాడు.

ఆదిశేషు ఒక ప్రైవేట్ బ్యాంక్ ఛైర్మన్. అతను ఆ బ్యాంకుని ఎలాంటి ప్రభుత్వ నిబంధనా పాటించకుండా తన స్వంత జాగీరులా నడిపాడు. అదేదో లాభాలు గడిస్తూ బ్యాంకు పరిస్థితి బాగున్నంత కాలం ఎవరూ పట్టించుకోలేదు. నెమ్మది నెమ్మదిగా బ్యాంకు పరిస్థితి దిగజారసాగింది. ఇంకా ఈ సంగతి ప్రజలకి తెలియదు. ఒకటొకటిగా దినపత్రికల్లో ఆ బ్యాంకులోని లోపాలు కథనాలుగా రాసాగాయి. వాటినుండి బయటపడటానికి ఆదిశేషు ఫైనాన్స్ మినిస్టర్ ప్రాపకం కోసం పాకులాడుతున్నాడు. ఇంతవరకు కనీసం ఆయన అపాయింట్‌మెంటూ దొరకలేదు.

అలా ఏదో లొసుగులు ఉన్నవాడు మల్హోత్రాకి సహాయం చేయాలి తప్ప మామూలు బ్యాంకు ఛైర్మన్లు ఎవరూ ప్రస్తుత పరిస్థితుల్లో స్కైలైన్ సంస్థకి సహాయం చేయటానికి ముందుకు రారు.

అందుకే ఫైనాన్స్ మినిస్టర్ ఆదిశేషుకి తనకి కావలసింది చెప్పాడు.

ఆదిశేషు అత్యుత్సాహంగా "నేను చూసుకుంటాను" అన్నాడు.

మరో పది నిమిషాల తరువాత స్వయంగా ఆదిశేషే మల్హోత్రాకి ఫోన్ చేశాడు. "నేను రేపు మీ నగరానికి వస్తున్నాను. అక్కడే మీ లోన్ ప్రపోజల్ గురించి చర్చించి సాంక్షన్ చేయిస్తాను. డోంట్ వర్రీ! మీ సమస్యలు అన్నీ ముగిసిపోయినట్లే అనుకోండి" అన్నాడు.

మల్హోత్రా మొహం వెలిగి పోయింది. ఫైనాన్స్ మినిస్టర్ తలచుకుంటే ఏదో ఒకటి చేయగలడని అతనికి తెలుసు. కాకపోతే రిజల్ట్ ఇంత త్వరగా వస్తుందనుకోలేదు. అందుకే "థాంక్ యు! థాంక్ యు!!" అనటం తప్ప మరేమీ మాట్లాడలేకపోయాడు.

ఫోన్ పెట్టేసి వెంటనే తన మేనేజర్లను పిలిచి జరిగింది వివరించాడు. "వెళ్ళి మన ఉద్యోగులందరినీ తయారుగా ఉండమని చెప్పండి. రేపే వారి బకాయిలు తీరుద్దాం. వెంటనే సమ్మె మాని విమానాలు ఎగిరేలా చూడమని చెప్పండి" అని చకచకా ఆర్డర్లు ఇచ్చాడు.

★ ★ ★

ఆ సాయంత్రం పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ ఆధ్వర్యంలో ప్రతిష్ఠాత్మకంగా కట్టిన ఫ్లైఓవర్ ప్రారంభోత్సవం ముంబయిలో జరిగింది. మహారాష్ట్ర ముఖ్యమంత్రితో పాటు అనేక మంది ప్రముఖులు పాల్గొన్నారు. ప్రకాష్ సింగ్ మరణం కలిగించిన విచారాన్ని మనసులోనే దాచుకుని పి.ఎస్.కన్‌స్ట్రక్షన్స్ ఇంజినీర్లు ఉత్సవాన్ని విజయ

వంతం చేయాటానికి పాటు పడ్డారు.

'సివిల్ ఇంజినీర్స్ టుడే' మేగజైన్‌లో కట్టడం స్ట్రక్చర్ మీద అనుమానాలు వచ్చి నప్పటి నుండి కొంతమంది ఇంజినీర్లలో అంతర్లీనంగా భయం గూడు కట్టుకుంది. తమ పని మీద తమకు నమ్మకమున్నా ఒకటికి రెండుసార్లు సరి చూసుకున్నారు. అయితే ఎన్నిసార్లు చూసుకున్నా జరిగిన పొరపాటు ఎవరూ గుర్తించలేదు. భయం తోనే ఎవరి పనుల్లో వారు పాల్గొన్నారు.

ఎప్పుడయితే ప్రారంభోత్సవం జరిగి ట్రాఫిక్ ఫ్లై ఓవర్ మీదకి వదిలారో అపుడు వందలాది వాహనాలు ఒక్కసా రిగా దాని మీదకు చేరుకున్నాయి. చూస్తుండగానే వాహనాల సంఖ్య వందల నుండి వేలల్లోకి చేరుకుంది.

ఊపిరి బిగబట్టి చూస్తున్న ఇంజినీర్ల భయాలను చెదరగొడుతూ ఆ ఫ్లై ఓవర్ స్థిరంగా నిలబడి ఉంది.

ఢిల్లీలో తండ్రి అంత్యక్రియలు ముగిం చిన స్వదేశ్ సింగ్‌కి ఆ సాయంత్రం జరి గిన ప్రారంభోత్సవం మీద రిపోర్ట్ అందింది. 'మీరు లేక పోవటం తప్ప వంక పెట్టటానికి లేనివిధంగా ఫంక్షన్ జరిగింది. సాయంత్రం నుండి మొదలైన చిరుజల్లులు కూడా పెద్దవానగా మార కుండా మనకు సహకరించాయి. కాలంకాని కాలంలో వచ్చిన వానని దేవుని ఆశీర్వాదంలా అందరూ భావించారు'

రిపోర్ట్ అంతా చదివి పరిస్థితులన్నీ తమ అదుపులోనే ఉన్నందుకు ఆనందిస్తూ ఆ రాత్రి నిద్రించటానికి ఉపక్రమించాడు స్వదేశ్ సింగ్.

★ ★ ★

పానకాలు, నరహరి ముఖ్యమంత్రి మహేష్‌ని అంచనా వెయ్యటంలో పెద్ద పొరపాటు చేశారు. మహేష్‌కి అనుభవం లేకపోవచ్చు. లౌక్యం తెలియక పోవచ్చు. కానీ అతని తెలివితేటలు అపారం. అతను అంత తేలికగా ఓటమిని అంగీకరిస్తాడని అనుకోవటమే వారు చేసిన అతి పెద్ద పొర పాటు.

ప్రతిపక్షాల ఆధ్వర్యంలో ముఖ్యమంత్రిని గద్దెదింపటమే ధ్యేయంగా హఠాత్తుగా ఉద్యమం మొదలుపెట్టటం వాళ్ళు చేసిన మొదటి తప్పు. అలాంటి ఉద్యమం మొద లంటూ అయ్యాక ఏదో ఒక హింసాత్మక సంఘటన జరగటం సహజం. అలానే ఒకటి రెండు చోట్ల ఆర్టీసీ బస్సులు తగల బెట్టటం లాంటి సంఘటనలు జరిగాయి.

అలాంటి వాటికోసమే ఎదురుచూస్తు న్నాడు ముఖ్యమంత్రి. వెంటనే ఆ హింసా త్మక సంఘటనలను సాకుగా చూపించి రాష్ట్ర వ్యాప్తంగా శాంతి భద్రతలను కాపా డటానికి పోలీసులకు పూర్తి అధికారాలు ఇచ్చాడు. ప్రత్యేక దళాలు అప్పటికప్పుడు రంగంలోకి దిగాయి. తర తమ బేధాలు లేకుండా ఎవరినైనా అరెస్ట్ చేసే అధికారం వారికి ఇచ్చాడు.

ఉద్యమం తీవ్రతరం చెయ్యటం కోసం ముందుండి నడిపిస్తున్న నరహరిని ముందుగా అరెస్ట్ చేశారు. పోలీస్ స్టేష న్‌కి తీసుకువెళ్ళి వెంటనే వదిలేస్తారను కున్న అతని అంచనాలకు విరుద్ధంగా అతన్ని బయటకు వదల్లేదు.

## కొత్తగాలి...

**విద్య వలన**
**ధనం లభిస్తే**
**వినయం వలన**
**వ్యక్తిత్వం సిద్ధిస్తుంది**

– జె. నాగరత్నమణి,
భీమడోలు, ప.గో. జిల్లా



మరొక పక్క నరహరితో పాటు పార్టీ మారాలనుకున్న ఇరవై మంది ఎమ్మెల్యే లను స్పీకర్ కాంటాక్ట్ చేశాడు.

వారు పార్టీ మారిన మరుక్షణం వారి ఎమ్మెల్యే పదవి 'పార్టీ మార్పిడి నిరోధక చట్టం' కింద రద్దు చేయబడుతుందని స్పీకర్ వివరించాడు. ప్రభుత్వానికి కావల సిన మెజారిటీ అప్పటికి ఉన్న ఎమ్మెల్యేల నుండి లెక్కిస్తారు. కాబట్టి వారు పార్టీ మారటం వలన వారి పదవులు ఊడటం తప్ప మహేష్ ప్రభుత్వం పడిపోదని కూడా వివరించాడు. అంతేకాకుండా వారి వారి నియోజకవర్గాల్లో వెంటనే వచ్చే ఎన్ని కల్లో ప్రభుత్వాన్ని ఎదిరించి గెలిచే సామర్థ్యం ఉందో, లేదో మరోసారి ఆలో చించుకోమని అన్యాపదేశంగా బెదిరిం చాడు. దానితో ఆ ఇరవై మంది ఎమ్మె ల్యేలు అయోమయంలో పడ్డారు. వారికి సలహా ఇచ్చే కొంతమంది ముఖ్యులు అరెస్టయి అందుబాటులో లేకుండాపో యారు.

అంతపేరున్న ముఖ్యమంత్రితో గొడవ పడి సాధించేదేమిటో వారికే అర్థం కాలేదు. తాము పార్టీ మారటం వలన



నరహరి లాంటి కుహనా రాజకీయ నాయకులకు తప్ప తమకేమీ లాభం ఉండదని వారు ఆలోచించుకున్నారు. అందుకే వెంటనే ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్ళారు. తామంతా నరహరి ప్రోద్బలంతో ఈ పనిచేశాం తప్ప పార్టీ మారే ఉద్దేశం తమకి లేదని తేల్చి చెప్పారు.

గవర్నర్ పిలుపుకు రెస్పాండ్ అవుతూ ముఖ్యమంత్రి ఆ రాత్రి గవర్నర్ అధికార నివాసానికి వెళ్ళి ఆయన్ని కలుసుకున్నాడు.

"మధ్యాహ్నం కొంతమంది ఎమ్మెల్యేలు వచ్చారయ్యా! నీకు మద్దతు ఉపసంహరించుకుంటున్నామన్నారు. అందుకే పిలిపించవలసి వచ్చింది" అన్నాడు గవర్నర్.

"వీళ్ళేనా సర్, వారు?" తన వెనుక వచ్చిన కార్ల నుండి దిగుతున్న ఎమ్మెల్యేలను చూపిస్తూ అడిగాడు మహేష్.

వాళ్ళను చూసి తన కళ్లను తనే నమ్మలేకపోయాడు గవర్నర్. "నువు రాజకీయాలు చాలా త్వరగా నేర్చుకున్నావోయ్" అన్నాడాయన ఆప్యాయంగా.

"ఇంతకీ నేను వచ్చింది మీకు ఒక విషయం చెప్పటానికి. నేను నరహరిని మంత్రివర్గం నుండి తొలగిస్తున్నాను. అతనికి బదులుగా ఈ ఇరవై మందిలో ఇద్దరిని మంత్రివర్గంలోకి తీసుకుంటున్నాను. దయచేసి ఆమోదించండి"

ఆ తరువాత మాట్లాడుకోవటానికి పిచ్చాపాటీ తప్ప వారిమధ్య మరేమీ లేకపోయింది.

మరొక అరగంట తరువాత పానకాలు ఆ రోజు రెండోసారి ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టాడు. ముఖ్యమంత్రిలాంటి ఉత్తముడు టెండర్ ఫైలు మీద సంతకం పెట్టింది తను కాదని ప్రకటించాక ఇక ఆ విషయం పొడిగించడం అనవసరమని అర్థం చేసుకున్నానని ప్రకటించాడు. అపార్థాలు తొలగిపోయాయి కాబట్టి తన సహకారం ప్రభు

త్వానికి యథాప్రకారం కొనసాగుతుందని, దయచేసి తన సహకారాన్ని తిరస్కరించ వద్దని మనవి చేసుకున్నాడు. అంతేకాదు, ముఖ్యమంత్రికి ఒక మనవి చేసుకుంటు న్నానని చెప్పాడు. అదేమిటంటే ఈ గొడవ వలన ఆలస్యం కాబోతున్న ఇరిగేషన్ ప్రాజెక్ట్‌ని త్వరగా పూర్తి చేయాలని, తద్వారా తన జిల్లా ప్రజల చిరకాల వాంఛ నెరవేరటం చూడాలన్నదే తన చివరికోరి కనీ చెప్పాడు.

ఆ ప్రకటన చూసిన సలహాదారు ప్రభు ముఖ్యమంత్రికి ఫోన్ చేశాడు. "నిజం చెప్పాలంటే మన పొజిషన్ నిన్నటి కంటే ఇప్పుడే బలంగా ఉంది. ఇప్పుడప్పుడే మిమ్మల్ని ఎవరూ కదపలేరు. కంగ్రాచ్యులే షన్స్"

సన్నగా నవ్వాడు ముఖ్యమంత్రి. ఆ నవ్వులో ఎప్పుడూ లేనిది మొదటిసారి కాస్త గర్వం కనిపించింది.

★ ★ ★

బాగా రాత్రి అయింది. ఆదిత్య, సహదే వుడు నారాయణని గమనిస్తున్నారు.

సినిమా హాలు వద్ద నుండి బయటకు వచ్చిన నారాయణ కాసేపు అటు ఇటూ తిరిగాడు. చేయటానికి ఏమీ కనపడలేదు. ఉదయం భోంచేసిన హోటల్‌కే వెళ్లి మరలా భోంచేశాడు. తిరిగి గుడిసెకు వెళ్లటం తప్ప చేసేదేమీ లేక తన నివాసం వైపు అడుగులు వేశాడు నారాయణ.

ఇక అతన్ని అనుసరించి ఉపయోగం లేదనుకున్న ఆదిత్య, సహదేవుడు అక్కడ మాయమై రోడ్డు మీద వదిలిన ఆదిత్య కారు వద్ద ప్రత్యక్షమయ్యారు.

'ఇప్పటివరకు అది అక్కడ పదిలంగా ఉండటం ఆశ్చర్యమే!' అనుకున్నాడు ఆదిత్య. ఇద్దరూ దానిలో ఆదిత్య ఇంటికి బయలుదేరారు. దారిలో వారి సంభాషణ అప్పటివరకు జరిగిన సంఘటనల మీద సింహావలోకనంలా సాగింది.

"సహదేవుడుగారూ! నన్నెంత భయ పెట్టారండీ! భూప్రపంచమంతా మునిగిపో బోతున్నదన్నంత బిల్డప్ ఇచ్చారు. నిజమే! నేను ముందూ వెనుకా ఆలోచించకుండా అలా ఒకరి సంపదనీ, ఆరోగ్యాన్నీ, తెలివినీ మరొకరికి ఇచ్చి ఉండవలసింది కాదు. నేను ఒప్పుకుంటున్నాను. నాకు ఈ ఆట కొత్త. పూర్తిగా మెళకువలు తెలియవు. కానీ మీ దేవుడికి యుగయుగాల అను భవం ఉంది. నేను చేసిన పొరపాట్లు చెయ్యకుండా సమానత్వం తెమ్మనండి"

"ఏంటి వింతగా మాట్లాడుతున్నావ్? నువు చేసిన పని వలన అంతా మంచే జరిగినట్లూ.. ఇక చేయవలసిందీ, చూడవ లసిందీ ఏమీ లేదన్నట్లూ ఫీలవుతు న్నావా? " గొంతులో వ్యంగ్యాన్ని రంగరిం చి అన్నాడు సహదేవుడు.

"లాభం సంగతి పక్కన పెడితే, జరిగిన నష్టం నాకేమీ కనపడటం లేదు. ఫలితమే ప్రామాణికం అనుకుంటే అంతా మంచే జరిగిందనిపిస్తోంది. నారాయణ ప్రశాం తంగా తనకంటూ ఏర్పరుచుకున్న గూట్లో విశ్రాంతి తీసుకుంటున్నాడు. రేపు మిగిలిన డబ్బుల్తో ఏ బడ్డీ కొట్టో, టీ కొట్టో పెట్టు కుని స్థిరపడతాడు. మల్హోత్రాని ఆర్థిక సమస్యలు ఇబ్బంది పెట్టిన మాట వాస్త వమే! కానీ ఎంతసేపు? తన పలుకుపడి ఉపయోగించి వాటిని అధిగమించబోతు న్నాడు. రేపు బ్యాంకు ఛైర్మన్ ఆదిశేషు మల్హోత్రాకి అప్పు ఇస్తాడు. దానితో మల్హోత్రా సమస్యలన్నీ తీరిపోతాయి. అలాగే ప్రకాష్ సింగ్ మరణం నన్ను ఎంతో బాధించింది. నిజమే! నేను ఆయన ఆరోగ్యంతో చెలగాటం ఆడి ఉండవలసింది కాదు. ఆయన ఎంత వృద్ధుడయినా అతని ఆయుష్షు తగ్గించే అధికారం నాకెక్కడిది? కానీ ఆయన మరణం వలన ఆ ఫ్లై ఓవర్లో

డిజైనింగ్ లోపాలున్న విషయం ప్రపంచానికి తెలియక ఏదైనా దారుణం జరుగుతుందేమోనని ఊహించుకున్నాను. కానీ మీరే చూడండి.. అంతా మామూలుగానే ఉంది. వేలాది వాహనాలు ప్రస్తుతం ఆ ఫ్లై ఓవర్ మీద క్షేమంగా ప్రయాణిస్తున్నాయి. ముఖ్యమంత్రి తప్పటడుగు వేసినట్లే కనిపించాడు. అతని ప్రభుత్వం పడిపోతున్నట్లే అనిపించింది. కానీ, చివరకు ఆందోళనలను అణచి వేశారు. నరహరి తప్ప ముఖ్యమంత్రికి దూరం జరిగిన వారందరూ వెనక్కి వచ్చేశారు. ఇంక ప్రభుత్వం పడిపోయేది ఎక్కడ? ఇప్పుడు చెప్పండి.. నేను చేసిన మార్పుల వలన ఏమి నష్టం జరిగింది? " సుదీర్ఘంగా ఉపన్యాసం ఇచ్చినట్లు అన్నాడు ఆదిత్య.

అంతా విన్న సహదేవుడు "కుక్క తోక వంకర అంటే ఇదే!" అన్నాడు.

చిర్రెత్తుకొచ్చింది ఆదిత్యకి. "నష్టమంటూ జరిగితే నాకే జరిగింది. గొడవల మూలంగా సగం రోజు సినిమాకి కలెక్షన్లు లేకుండా పోయాయి. అయినా నేను బాధ పడలేదు. నేను నమ్ముకున్న సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నాను. మీరు చెప్పండి. ఏమి నష్టం జరిగిందో"

"యుగయుగాలుగా ఆ దేవుడే మనిషి కర్మలను నియంత్రించాలా, వద్దా అన్న విషయం తెలియక అయోమయంలో ఉన్నాడు. నీకిచ్చిన గడువు పూర్తికాక ముందే నువు మాత్రం ఒక నిర్ణయానికి వచ్చేసినట్లున్నావు. అయినా నీకు ముందే చెప్పాను. నేను సూక్తులు వల్లించటానికి రాలేదు. జరుగుతున్నది చూడటమే నా బాధ్యత. నీ మాటలే నిజమేమో! ఏ సంగతీ రేపు నేను దేవుడ్ని కలుసుకున్నాక తేల్చుకుంటాను. ఉదయం నుండి నాతో తిరిగి అలసిపోయి ఉంటావు. విశ్రాంతి తీసుకో. రేపు ఉదయాన మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం" అన్నాడు సహదేవుడు.

"రాత్రికి రాత్రి ఉప్పెనలు వస్తాయా? భూకంపాలు వస్తాయా? ఏమి మార్పులు జరుగుతాయి? " రెట్టించాడు ఆదిత్య.

అప్పటికే వారి కారు ఆదిత్య ఇంటికి చేరింది. కారు గేటు ముందు ఆపి సమాధానం కోసం అన్నట్లు సహదేవుడి వైపు చూశాడు ఆదిత్య.

సహదేవుడు ఏమీ మాట్లాడలేదు. నవ్వాడు!

అవును. ఏమీ తెలియని వాడికీ, అన్నీ

## ఆగస్టు - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కోట విజయశ్రీ** - ఎం.వి.పి.కాలనీ, విశాఖపట్నం
2. **జి. దివాకర్‌రావు** - కుంటిభద్ర, శ్రీకాకుళం జిల్లా
3. **వి.వి. సత్యనారాయణ శెట్టి** - బైరాగిపట్టెడ, తిరుపతి
4. **వి. పార్థసారథి** - ఇన్‌ఫాంట్రీ రోడ్, బళ్లారి
5. **సి. శేషశాయి** - కూకట్‌పల్లి, హైదరాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ఆది | 6. జేమ్స్ జాయిస్ |
| 2. ఆనంద్ | 7. వివేకానందన్ |
| 3. రవి | 8. బొంబాయి |
| 4. గుమ్మడి దిబ్బ | 9. జాన్సన్ |
| 5. స్వామిసచ్చిదానంద | 10. జాన్‌గెజ్ చిస్కీ |

తెలిసిన వాడికీ సాపత్యం ఒక్క విషయం లోనే ఉంటుంది. అదే నిష్కల్మషమైన నవ్వు.

★ ★ ★

రాత్రి ఆదిత్యకి చాలా సేపు నిద్ర పట్ట లేదు. పక్కకు తిరిగి చూస్తే సహదేవుడు మాత్రం హాయిగా నిద్రపోతున్నాడు.

ఆదిత్యకి మొదటినుండి భగవంతుని ఉనికి గురించీ, ఒకవేళ ఆయనే ఉంటే అసమానతలతో కూడిన ఈ సృష్టి గురించీ అనేక అనుమానాలు ఉండేవి. సమా నత్వం అంటే అతని దృష్టిలో ప్రపంచంలో ఉన్న సంపదనంతా మనుషులందరికీ సమానంగా పంచమని కాదు. కనీసం ప్రతి మనిషి అవసరాలూ తీరే అంత సంపద అందరికీ ఇవ్వవచ్చు కదా.. అన్నది అతని వాదన.

ఇన్నాళ్లూ అతని వాదనలు శుష్క వాద నలుగానే మిగిలిపోయాయి. ఉదయం సహదేవుడు ప్రత్యక్షమై ఒక వ్యక్తి జీవి తాన్ని కావలసిన విధంగా తీర్చిదిద్దమన టంతో అతను రంగంలోకి దూకాడు. తనకు చేతనయినట్లు ఒక వ్యక్తి జీవితాన్ని మార్చటానికి ప్రయత్నించాడు. సఫలీకృతు డనయ్యాననే అనుకుంటున్నాడు.

ఈ ఆలోచనల మధ్య అతను నిద్రలోకి జారుకున్నాడు.

మొహం మీద ఎండ పడటంతో మెల కువ వచ్చింది ఆదిత్యకి.

కళ్లు తెరచిన అతనికి ఎదురుగా కూర్చుని ఉన్న సహదేవుడు కనిపించాడు. సమయం చూస్తే పది దాటింది.

"అయ్యో! నేనెప్పుడూ ఇంతసేపు నిద్ర పోను. మీరయినా లేపక పోయారా?" అన్నాడు ఆదిత్య.

ఎప్పటిలానే నవ్వాడు సహదేవుడు.

లేచి, బాత్‌రూమ్‌లోకి వెళ్లాడు ఆదిత్య. కాలకృత్యాలు తీర్చుకుని బయటకు వచ్చాడు.

"చెప్పండి! మీరు ఏమి నిర్ణయానికి వచ్చారు? నేను చేసిన పని వలన జరిగిన పరిణామాలు మంచివంటారా? కాదం టారా?"

"ఆ విషయం చెప్పటానికి నేనెవరిని? జరిగిన విషయాలు ఆ విధాతకు వివరి స్తాను. అవసరమయిన నిర్ణయం ఆయన తీసుకుంటారు"

"ఓహ్!" నిరాశగా అన్నాడు ఆదిత్య.

"అయితే నాకుగా కొన్ని అనుమానాలు ఉన్నాయి. నీ సిద్ధాంతం గురించిన ఆ అనుమానాలు తీర్చుకోవటానికే ఇంకా నేను వెళ్లకుండా ఆగాను. మరి అడగమం టావా?"

"అడగండి..." ఉత్సాహంగా అన్నాడు ఆదిత్య. తన వాదన రుజువయిందనే అత నికి అనిపిస్తోంది. 'అందుకే ఈ సహదే వుడు తన అభిప్రాయాలు తెలుసుకోవాల నుకుంటున్నాడు' అనుకున్నాడతను.

"కాసేపు ఈ సృష్టి అంతా దేవుడే చేశా డని అంగీకరిద్దాం! ఎందుకంటే సృష్టి చేసింది భగవంతుడు కాదనుకున్నప్పుడు ఆయన్ని ఏదీ కోరుకునే అధికారం కూడా ఎవరికీ ఉండదు కదా!" అన్నాడు సహదే వుడు.

"అవును!"

"సృష్టి అంతా భగవంతుడి అనుగ్రహం కదా! మరి ఎప్పుడయినా ఒక కుక్కో, నక్కో ఆయన్ని ప్రార్థించడం చూశావా?"

"లేదు"

"అవి భగవంతుడిని కోప్పడటం చూశావా? తమకు తిండి దొరకటం లేదనీ, కూర్చున్న చోటుకు తమకెందుకు తిండి రావటం లేదనీ ఆయన్ని నిలదీ యటం చూశావా?"

నవ్వాడు ఆదిత్య "లేదు" అంటూ.

"ఎందుకంటావ్?"

"బహుశా వాటికంత తెలివి లేదేమో!"

"నిజమే! వాటికంత తెలివి లేదు. ఆలోచించే శక్తి లేదు. మరి మనిషికి తెలివి ఇచ్చాడు. విచక్షణ ఇచ్చాడు. ఎందుకు? పని చెయ్యకుండా ఫలితం ఆశించటానికా? తీరిగ్గా కూర్చుని ఆయన నిర్ణయాన్ని ప్రశ్నించటానికా? "

"అలా ఎందుకనుకోవాలి? వాటికంటే మనిషి తెలివయిన వాడు కాబట్టే తనకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రశ్నిస్తున్నాడని అనుకోవచ్చుగా!"

"అదీ ఒప్పుకుంటాను. అలాంటప్పుడు మనిషి తనకంటే తక్కువ స్థాయిలో ఉన్న మిగిలిన జీవ జంతువుల తరపున పోరాడ వలసిన బాధ్యత తీసుకోవాలి. కానీ, అతను చేస్తోంది ఏమిటి? తనకున్న తెలివిని ఉపయోగించి వాటికి ద్రోహం చెయ్యటం లేదా? అడవులు నరికీ, భూములు తొలిచీ జంతువులను అణిచివేశాడు. అంతులేని వ్యర్థపదార్థాలను కలిపి జీవ జలాలను విషతుల్యం చేశాడు. సెల్ టవర్లు కట్టి పక్షుల ప్రాణాలు తీస్తున్నాడు. అవన్నీ సరైనవేనా? "

ఏమీ మాట్లాడలేదు ఆదిత్య.

"అదీ వదిలెయ్! పోనీ తన తోటి మనుషులను వదిలి పెట్టాడా? తన బలంతో, తెలివితో బలహీనులను దోచుకోవటం లేదా? సృష్టిలో ప్రతి జీవికీ భగవంతుడే స్వార్థం ఇచ్చాడు. ఏ జంతువునయినా పరిశీలించు. ఆహారం దొరకగానే ముందు తను తింటుంది. తరువాత తన కుటుంబానికి పెడుతుంది. ఆ మాత్రం తనూ, తన పిల్లలు అనే స్వార్థం లేకపోతే పసి కూనలు పెరగవు. కానీ మనిషి ఏమి చేస్తున్నాడు? అవసరమయిన దానికన్నా వేలరెట్లు సంపదని కూడబెట్టుకుంటున్నాడు. దాచుకోవటానికి వీలుగా డబ్బుని సృష్టించాడు. మిగిలిన జీవజాతిని, తోటి

మనుషులను, స్వంత కుటుంబాన్నీ దోచుకోవటానికి కూడా వెనుకాడటం లేదు. సమానత్వం అడిగే ముందు ఈ అవలక్షణాలను సరిదిద్దుకోవద్దా? "

"సమాజంలో ఇన్ని అపసవ్యతలు ఉండబట్టే, వాటిని సరిదిద్దటం మా వలన కాకపోబట్టే, ఆ దేవుడ్ని న్యాయం చేయమని కోరుకుంటున్నాను"

"ఇక్కడే ఒక విషయం చెప్పదలచుకున్నాను. ఆ భగవంతుడు ఒక జీవికీ మరో జీవికీ మధ్య వ్యత్యాసం పెట్టాడేమో, కానీ.. ఒకే జాతి జీవుల మధ్య వ్యత్యాసం పెట్టలేదు. ఉదాహరణకు మనిషినే తీసుకో! ప్రతి మనిషికీ రెండు చేతులు, రెండు కాళ్లు ఇచ్చాడు తప్ప ఎవరికీ అన్యాయం చెయ్యలేదే! ఇంకా ఏదో కావాలన్న ఆక్రోశం ఎందుకు? " అన్నాడు సహదేవుడు.

"మిగిలిన జీవుల్లో ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువా అన్న బేధం లేదు. కానీ మనుషుల్లో ఉంది కదా! అందుకే మనిషి సమానత్వం కోరుకుంటున్నాడు"

"సమానత్వం కోరుకుంటున్న మనుషులు సమానంగా పనిచేస్తున్నారా? తప్పులన్నీ మీరు చేసి నెపం దేవుని మీద పెడితే ఎలా? " అన్నాడు సహదేవుడు.

"తప్పులు చేసినంత మాత్రాన పిల్లలను కాదనుకుంటారా? సరిదిద్దాలి. ఏం? ఆయన తలుచుకుంటే సరిదిద్దలేడా? "

"దేవుడు ప్రయత్నిస్తూనే ఉన్నాడు. పాపం పండినప్పుడల్లా అవతరిస్తూనే ఉన్నాడు" చెప్పటం కొనసాగిస్తున్నాడు సహదేవుడు. "యుగానికి ఒకసారి ఏదో ఒక రూపంలో వస్తూనే ఉన్నాడు. అయినా మీరు మారారా? లేదే!

మాటలతో కాదని ఆయన చేతలతో చూపించాడు.

ఒక ఉదాహరణ చెప్తా.. విను.

మహాభారతం వేల సంవత్సరాల క్రితం జరిగిన ఇతిహాసం అని తెలుసు కదా! అది రాసి వందల సంవత్సరాల పైనే అయిందని తెలుసు కదా! భగవంతుడు నీ ప్రశ్నకు సమాధానం అందులోనే చెప్పటానికి ప్రయత్నించాడు.

రాముని అవతారంలో భగవంతుడు కూడా అధర్మం వలన నష్టపోయాడు. అష్టకష్టాలు పడి చివరకు జయించాడు. స్వశక్తిని నమ్ముకోమని చెప్పాడు. అప్పుడేమి విమర్శ వచ్చింది? అలా కష్టపడేవాడు దేవుడేమిటని నవ్వారు. మానవుడిగా పుట్టాక దేవుడయినా బాధలు పడవలసిందే... అని బోధించదలచుకున్నాడా అన్న వాదన తెచ్చారు.

అందుకే తన తదుపరి అవతారంలో ఆ అవకాశం ఎవరికీ ఇవ్వకుండా తను చెప్పదలచింది భగవద్గీత రూపంలో, చెయ్యదలచుకున్నది స్వయంగా తన జీవితచరిత్ర ద్వారా చూపాడు.

శ్రీకృష్ణుడు తను దేవుని అవతారాన్ననే విషయం దాచుకునే ప్రయత్నం ఎప్పుడూ చెయ్యలేదు. చిన్నప్పటినుండి మహిమలు చూపాడు. మంచివారికి సాయపడ్డాడు. హాని తలపెట్టినవారిని క్షమించలేదు. సంహరించాడు. ఆఖరికి శత్రువు మేనమామయినా ఉపేక్షించక దండించాడు.

అలాంటి శ్రీకృష్ణుడు విద్యాభ్యాస నిమిత్తం సాందీపుని ఆశ్రమంలో ఉన్నప్పుడు ఒకరోజు పరశురాముడు అక్కడకు వచ్చాడు. వారిద్దరి సంభాషణలో ఆనాటి సామాజిక పరిస్థితులు చర్చకు వచ్చాయి.

పరశురాముడు ఇలా అంటాడు, 'అధికార గణం విచ్చలవిడిగా చరిస్తోంది. వారి ఆగడాలు, అవినీతి పెచ్చుమీరిపోతున్నాయి. కులబలం, ధనబలం తప్ప ధర్మాన్ని ఎవరూ పట్టించుకోవటం లేదు. రాజులు భోగలాలసులయ్యారు. అడవిలో

నుండి వచ్చి గ్రామాల మీద పడిన పులిని చూసి భయంతో చెల్లాచెదురైన ప్రజల్లా జనాలంతా రాజులను చూసి భయపడుతున్నారు. ధర్మసంస్థాపన చేసే రోజు దగ్గర పడింది. అందుకు నీవే పూనుకోవాలి'

ఆ మాటలు విన్న కృష్ణుడు తొందరపడలేదు. ఒకసారి కాదు అనేకసార్లు పరశురాముడు దుష్టశిక్షణకు పూనుకున్నా పరిస్థితులు మారలేదంటే, ఆ మార్గం సరికాదనుకున్నాడు. ఒక్కడు చేసే పని కంటే సమిష్టిగా చేసే పనికి విలువ ఎక్కువని బోధించదలచుకున్నాడు. అందుకే తను మార్గదర్శకత్వం వహించి కురుక్షేత్రం జరిపించాడు. అయితే అధర్మం అన్నది రాముడి కాలంలోనూ ఉంది, కృష్ణుడి కాలంలోనూ ఉంది, ఇప్పుడూ ఉంది. ఆ చేదు నిజం నిన్ను వెక్కిరించటం లేదా? తను మారకుండా, మనిషి ప్రపంచాన్ని మార్చటానికి ప్రయత్నిస్తున్నాడని అర్థమవటం లేదా?

అప్పటికే కృష్ణుడు అధర్మాన్ని సహించనని గట్టి సందేశం ఇచ్చాడు. కంసుడ్ని, శిశుపాలుడ్నీ స్వయంగా సంహరించాడు. జరాసంధుడ్ని భీముని ద్వారా చంపించాడు.

చివరకు యుద్ధం తప్పదనుకున్న ఆఖరి నిమిషంలో కూడా సంధి పేరుతో వచ్చి విశ్వరూపం ప్రదర్శించి తను భగవంతుణ్ణని అందరికీ తెలియజేశాడు. ధర్మపథంలో నడిచే అవకాశమిచ్చాడు. అయినా మాట వినని వారిని ఏమి చెయ్యగలడు?

ధర్మం, న్యాయం పేరుతో చట్టాలకు వక్రభాష్యం చెప్పి అధర్మానికి దన్నుగా నిలబడిన భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు ఎన్ని అవకాశాలు ఇచ్చినా దారి మార్చుకోనప్పుడు యుద్ధంలో వారికి శృంగభంగం తప్పలేదు.

కురువంశాన్ని నాశనం చేసి ధర్మం పక్షాన నిలిచాడు కృష్ణుడు. తన బాధ్యత నెరవేర్చాడు. అయితే ఏమి మార్పు జరిగింది? ఆ రోజు నుండి ఈ లోకంలో అధర్మం లేకుండా పోయిందా? లేదే!

ఈనాటికీ అవే పరిస్థితులు.

ఇప్పుడనేముంది! శ్రీకృష్ణుని జీవిత చరమాంకంలో ఆయన వంశంలోనే వ్యసనపరులెక్కువయ్యారు. అంతఃకలహాలతో నాశనం అయ్యారు. ప్రపంచాన్నంతా బాగు చేశాననుకున్న భగవంతుడు తన వారిలో పుడుతున్న ముసలాన్ని గుర్తించలేకపోయాడు. ఆఖరికి తనే సామాన్య వేటగాని బాణానికి బలై తనువు చాలించాడు.

దీనర్థం ఏమిటి?

భగవంతుడు చేతకానివాడనా?

కాదు..

**కొత్తగాలి...**

**ఒకటే మునకలు**
**పిల్లప్పుడు ఈత కొడుతూ...**
**పెరిగాక మందుకొడుతూ...**

– పి. సునీల్,
పెద్దకొట్టాల, నంద్యాల

సృష్టి ఆరంభం నుండి మంచితోపాటు చెడు ఉంది. దేవతలతోపాటు రాక్షసులు ఉన్నారు. యుద్ధం లేనిదే శాంతి లేదు.

భీరువులున్న సమాజంలో సమానత్వం ఉండదు.

సమాజాన్ని ఎవరో మార్చరు.

దేవుడు అసలే మార్చడు.

ప్రతి పనిలోనూ వేలు పెట్టే అలవాటు ఆ దేవుడికి లేదు.

సృష్టి, స్థితి, లయలు దేవుని కర్తవ్యం అనుకుంటే.. మూడోదాని అవసరం రాక

ముందే మనిషి మారాలి. ఇక ఈ మనిషిని మార్చటం కుదరదనుకున్నప్పుడు మూడో కన్ను తెరుచుకోక తప్పదు. అదే విలయం.

మరెలా?

సమాధానం సమస్యలోనే ఉంది.

మనిషి తనే మారాలి.

తోటి మనిషికి సాయం చేయని వ్యక్తికి దేవుని సాయం ఆశించే హక్కు లేదు"

ఆలోచిస్తూ ఉండిపోయాడు ఆదిత్య.

"నేను వెళ్తున్నాను" అన్నాడు సహదేవుడు బయలుదేరుతూ.

ఆదిత్య కూడా లేచి నిలబడ్డాడు. "మన మధ్య జరిగిన సంభాషణ దేవుడికి చెప్పండి" అన్నాడు

"అలాగే!"

"నేను చేసిన పనివలన మంచి జరిగిందా? చెడు జరిగిందా? "

"నీకే తెలుస్తుంది"

కలిసి ఉన్నది కొన్ని గంటలే అయినా సహదేవుడు వెళ్ళిపోతున్నాడంటే ఏదోగా ఉంది ఆదిత్యకి. దాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఎదురుగా ఉన్న రిమోట్ తీసుకుని టి.వి. ఆన్ చేశాడు.

టి.వి.లో వార్తలు వస్తున్నాయి. అందులో వస్తున్న బ్రేకింగ్ న్యూస్ చూసి ఆదిత్య కొయ్యబారిపోయాడు.

'ముఖ్యమంత్రి మహేష్ గవర్నర్‌కి రాజీనామా సమర్పించారు' అన్న ఆ వార్త ప్రముఖంగా వస్తోంది.

"ఆగండి.. ఇదేమిటి? " పెద్దగా అరిచాడు ఆదిత్య టి.వి.వైపు చూపిస్తూ.

"నువ్వు నిద్రపోయావని లోకం నిద్రపోదుగా! గత కొన్నిగంటల్లో ఎన్నో మార్పులు జరిగాయి"

"మరి నాతో ఏమీ చెప్పకుండా వెళ్ళిపోతున్నారే? "

"నెమ్మదిగా అన్ని విషయాలూ నీకే తెలుస్తాయి"

"నెమ్మదిగా కాదు. రాత్రి నేను నిద్రపోయాక ఏం జరిగిందో నాకు ఇప్పుడే తెలియాలి"

"నేను వెళ్ళవలసిన సమయం ఆసన్నమయింది. అయితే వెళ్లేముందు ఒక పని చేస్తాను. నీకు జరిగిన విషయాలన్నీ కనిపించే ఏర్పాటు చేస్తాను. వీక్షించు" అని ప్రశాంతంగా చెప్పి మాయమయ్యాడు సహదేవుడు.




అర్ధరాత్రి అందరు ప్రశాంతంగా నిద్రపోతున్న సమయంలో సీసా మీద సీసా తాగుతూ ఒక నాటు సారా బట్టీ దగ్గర ఉన్నాడు శంకర్. అడుక్కునే వాళ్ళందరి దగ్గరా డబ్బులు వసూలు చేయటం పూర్తయింది. ఆ డబ్బుతో కొన్న సీసాలోని మద్యం తాగుతూ గుటకలు వేస్తున్నాడు.

అతనిలాంటివారు మరికొందరు అక్కడ బాగా తాగి తూలుతున్నారు.

అయితే శంకర్‌కి మాత్రం ఎంత తాగినా మత్తు ఎక్కటం లేదు. అతని కళ్ళ ముందు మారిన నారాయణ రూపమే కనిపిస్తోంది. వాడి జేబులో వంద రూపాయల నోట్లు కళ్ళముందు కదులుతున్నాయి.

ఒక్కసారిగా నారాయణ అంతగా మార

టానికి ఏదో కారణం ఉంది. అది ఏమిటన్నది అర్థం కావటం లేదు. కనిపిస్తున్న దానికన్నా ఎక్కువ డబ్బే వాడి దగ్గర ఉండి ఉంటుందని అనిపిస్తోంది. కానీ, ఆ విషయం ఎలా ఆరా తియ్యాలో అర్థం కావటం లేదు. అలా అని ఇది ఎవరితో పడితే వారితో చర్చించే విషయం కాదు. వంద రూపాయల కోసం తలలు పగలకొట్టుకున్న మనుషులు అతనికి తెలుసు. ఇప్పుడు ఈ విషయం మరెవరితో చర్చించినా వారిని తనకు పోటీ తెచ్చుకున్నట్లే!

'ఇక నుండి నేను అడుక్కోను' అని చెప్తున్న నారాయణ స్వరం అతనికి మాటి మాటికీ వినిపిస్తోంది. వాడి దగ్గర ఎంత డబ్బు లేకపోతే ఆ మాట అంత ధైర్యంగా చెప్తాడు! తనముందు బచ్చాలాగా పెరిగి పెద్దయిన నారిగాడు ఇలా ఎదిగిపోవటం శంకర్‌కి నచ్చటం లేదు. అతను ఈర్ష్యతో రగిలిపోతున్నాడు.

ఇంతలో అక్కడే ఒక మూల పడుకుని ఉన్న రంగి కనిపించింది. నెమ్మదిగా అటు నడిచి ఆమెను పలుకరించాడు శంకర్.

"ఏందే రంగీ! మీ నారిగాడికి లంకె బిందెలేమన్నా దొరికినయ్యంటే? అట్టా మారిపోయాడు? " అని అడిగాడు.

"ఆడి మొహానికి లంకె బిందెలు కూడానా? " అక్కసుగా అంది రంగి. నారాయణ తనను విదిలించి కొట్టి అవతలకు వెళ్ళిపోయిన దగ్గర నుండి రంగికి వాడి మీద కోపంగా ఉంది. నోరు తెరచి అడిగినా వాడు తనని దగ్గరకు రానివ్వకపోవటంతో ఆ కోపం పగగా మారింది. అందుకే తనకు తెలిసిన నిజానికి కాస్త ఊహ కూడా కలిపి చెప్తోంది. "ఏదో పర్సు దొరికి ఉంటుంది. అయినా పాపిష్టి సచ్చినోడికి తన, మన అని లేదు. ఇన్నాళ్ళూ కలిసి అడుక్కున్నాము కదా.. ఒక్క వంద నోటు అన్నా నా మొహాన పడేశాడా? "

ఆ మాటలేమీ శంకర్ మెదడులోకి ఎక్కటం లేదు. అతనికి కావలసింది నారిగాడు ఎక్కడ ఉంటాడన్న ఆచూకీ మాత్రమే! అందుకే, "ఆడెక్కడుంటాడే రంగీ!" అని ప్రేమగా అడిగాడు.

"ఉండటానికి ఆడికేమన్నా దిక్కా? దివాణమా? రోడ్డు మీదే తొంగునేవాడు"

"అదే! ఏడ తొంగుంటాడని..? "

"ఇయ్యాల కనబడలేదు శంకరన్నా! సందేల నీతో మాట్లాడుతుండగా చూసిందే! తరువాత ఎటుబోయాడో అగుపడలేదు"

"ఎక్కడికి పోయుంటాడబ్బా? ..." ఆలోచిస్తున్నట్లు అన్నాడు శంకర్.

"ఎందుకేమిటి? " వంకరగా చూస్తూ అంది రంగి.

"ఏనుందిలేవే! తెలిస్తే చెప్పరాదేటి? నీ సాయం ఉంచుకోనులే..."

శంకర్ సాయం ఎప్పటికైనా ఉపయోగమే అని రంగికి తెలుసు. అదీకాక నారిగాడి మీద ఉన్న కోపం ఆమెను శంకర్‌కు సహకరించేటట్లు చేస్తోంది. అందుకే, "ఏమోకానీ! కుంటి వీరయ్య ఎక్కడుంటాడని అందరినీ అడుగుతుంటే విన్నా..." అని చెప్పింది.

తాగుతున్న బాటిల్ చేత్తో పట్టుకుని బయటకు నడిచాడు శంకర్. తూలుతూ ముందుకు నడుస్తుంటే అతనికి కుంటి వీరయ్య ఉండేది అక్కడకు దగ్గరలోనే అన్న విషయం గుర్తుకు వచ్చింది.

'వీరయ్య దగ్గరకు వెళ్దామా? ' అని ఆలోచిస్తున్న అతనికి అటుగా వస్తున్న మస్తాన్ కనిపించాడు. "ఏరా మస్తాన్! కుంటి వీరయ్య ఉండేది ఏడరా? " అని అడిగాడు.

"ఎందుకు? "

"ఏనుందిలేరా? నారిగాడు కావాలి. వాడు ఎక్కడ ఉండేది వీరయ్యకు తెలుసేమో కనుక్కోవాలి"

"వాడు వీరయ్య దగ్గర లేడు"

"నీకెట్టా తెలుసు? "

"వాడికి గుడిసె అద్దెకిచ్చింది నేనేగ దోయ్!"

"గుడిసె అద్దెకు తీసుకున్నాడా? నీకు డబ్బిచ్చాడా? "

"ఆహా! అయిదొందలు అడ్వాన్సు, నాలు గొందలు అద్దె కలిపి మొత్తం తొమ్మిదొందలు ఇచ్చాడు"

'అమ్మ! దొంగ నాయాలా!' అక్కసుగా అనుకున్నాడు శంకర్. గుడిసె కూడా అద్దెకు తీసుకున్నాడంటే వాడి దగ్గర డబ్బు బానే ఉందనటంలో అనుమానం లేదు.

"సరే కానీ! కాస్త ఓపిక చేసుకుని వాడి గుడిసె చూపిద్దూ"

అప్పటికే మస్తాన్‌కి ఇదేదో అనుమానించదగ్గ వ్యవహారం అని అర్థమైంది. ఇలాంటప్పుడు శంకర్ పక్కన ఉంటే, వాడికి దొరికిన దాంట్లో తనకూ వాటా దొరుకుతుంది. అందుకే, "చూపిస్తా కానీ.. అసలు విషయం ఏందిరా భయ్!" కుతూహలంగా అడిగాడు మస్తాన్.

శంకర్ కూడా తనకు ఈ విషయంలో ఎవరైనా తోడు ఉంటే బాగుంటుందని అనుకున్నాడు. "చెప్తా పద" అంటూ ముందుకు కదిలాడు.

ఇద్దరూ కలిసి నారాయణ ఉన్న గుడిసె దగ్గరకు వెళ్ళారు. అక్కడకు వెళ్ళేటప్పటికి పూర్తిగా పరిసరాలు నిర్మానుష్యమయ్యాయి. చుట్టుపక్కల మనుషుల అలికిడి లేదు. అందరూ నిద్రపోతున్నారు.

నారాయణ ఉన్న గుడిసె తలుపు మీద చేత్తో తట్టాడు మస్తాన్.

లోపల పడుకుని ఉన్న నారాయణ ఉలిక్కిపడి నిద్ర లేచాడు. నిద్రమత్తులో ఉన్న అతనికి అంత హఠాత్తుగా మెలకువ ఎందుకు వచ్చిందో అర్థం కాలేదు. ఇంతలో మరోసారి తలుపు మీద తట్టిన శబ్దం అయింది. ఈసారి శబ్దంతోపాటు ఎవరో తన పేరు పిలవటం కూడా వినిపించింది.

"ఎవరూ? " అనుమానంగా అడిగాడు నారాయణ.

"నేనేలే మస్తాన్ని. ఒకసారి తలుపు తియ్యి"

భయంగా తలుపు తీశాడు నారాయణ. ఎదురుగా శంకర్, మస్తాన్‌లు కనిపించారు. తిరిగి తలుపు వేద్దామనుకున్నాడు నారాయణ. కానీ, అతన్ని తోసుకుంటూ ఇంటి లోపలకు వచ్చారు వారిద్దరూ.

"ఏమిటీ దౌర్జన్యం? " బింకంగా అన్నాడు నారాయణ.

మస్తాన్ ఏమీ మాట్లాడలేదు. శంకర్ మాత్రం, "డబ్బు ఎక్కడ పెట్టావ్? " అని అడిగాడు రుబాబుగా.

"ఏమి డబ్బు? నా దగ్గర ఎందుకు ఉంటుంది? " బుకాయిస్తూ అన్నాడు నారాయణ.

ఈలోపు శంకర్ ఆ గుడిసెను చూపుల్తోనే స్కాన్ చేస్తున్నట్లు పరిశీలించాడు. అందులో డబ్బు దాయదగ్గ ప్రదేశాలు అతనికి ఏమీ కనిపించలేదు. ఉంటే, గింటే ఆ డబ్బేదో నారాయణ శరీరం మీదే ఉండి ఉండాలి. అందుకే మస్తాన్ వైపు తిరిగి కన్ను గీటాడు.

శంకర్ చేసిన సైగను అర్థం చేసుకున్న మస్తాన్ నారాయణ మీదకు దూకి అతన్ని ఒడిసి పట్టుకున్నాడు. ఊహించని విధంగా జరిగిన దాడికి నారాయణ తయారుగా లేడు. విడిపించుకోవటానికి గింజుకోసాగాడు. అయినా పహిల్వాన్‌లాగా ఉన్న మస్తాన్ బలం ముందు అతను ఎటూ కదలలేకపోతున్నాడు.

మరోదారి లేక పెద్దగా అరవబోయాడు నారాయణ.

ఆ విషయం ముందుగానే పసిగట్టిన మస్తాన్ ఒక చేత్తో అతని నోరు

# నత్త ఉత్తరాలు

బ్రిటన్‌లోని 'ది టైమ్స్'లో 1980లో ఓ వార్త వచ్చింది. కన్జర్వేటివ్ పార్టీ ఎంపీ హేరి గ్రైన్‌వే ఎర్లింగ్‌నార్త్ ప్రాంతంలోని ఓ పోస్ట్‌బాక్స్‌లో ఉత్తరాన్ని వేసింది. మర్నాడు ఉదయం ఆ డబ్బాలోంచి ఉత్తరాలని తీసిన పోస్టల్ ఉద్యోగి ఆ కవర్ని చూస్తే దానికి అంటించిన తపాలా బిళ్లని, అలాగే కవర్‌లోని కొంతభాగాన్ని ఓ నత్త తినేసింది. ఈ విషయం తెలుసుకున్న ఎం.పి దాని గురించి పోస్ట్‌మాస్టర్‌తో చర్చించారు. ఆయన ఒక కొత్త కవర్ని, తపాలా బిళ్లని ఆమెకి నష్టపరిహారంగా ఇచ్చాడు. ఎందుకంటే తపాలాశాఖవారి ఆస్తి అయిన పోస్ట్‌బాక్స్‌లో జరిగిన నష్టానికి ఆ శాఖదే బాధ్యత.



ఈ వార్త బ్రిటిష్ ప్రజలను తమ అనుభవాలని రాసేలా పురికొల్పింది. మిస్ ప్రూడెన్స్ అనే ఆమె నత్తల ప్రత్యుత్పత్తి గురించి రాసింది. పోస్ట్‌బాక్స్ చుట్టుపక్కల ఉండే చెట్లలోంచి వెచ్చని బాక్స్‌లోకి గుడ్లు పెట్టడానికి నత్తలు వెళ్తాయని రాసింది. తాము పోస్ట్‌చేసిన ఉత్తరాలు గమ్యానికి చాలా కాలంగా చేరడం లేదని, ఇందుకు కారణం ఇపుడు తెలిసిందని, ఎంపీకి ఇచ్చినట్లుగా తమకూ పోస్ట్‌మాస్టర్ నష్టపరిహారం చెల్లించాలని బ్రిటన్‌లోని అనేక గ్రామాల నుంచి చాలామంది ఉత్తరాలు రాశారు. ఆ ఉత్తరాలని 'ది టైమ్స్'లో ప్రచురించారు. ఒకతను పోస్ట్‌బాక్స్‌లో నత్తలు గుడ్లు పెట్టడం రాబోయే చలికాలం తీవ్రతను సూచిస్తుందని తెలియజేశాడు. మరొకతను సగటున ఒక్కో పోస్ట్‌బాక్స్‌లో రెండువందల నత్తలు ఉంటాయని రాశాడు. ఇంకొకరు పగటిపూట నత్తలు పోస్ట్‌బాక్స్ పై భాగానికి వచ్చి నిద్రపోతాయని, రాత్రిళ్లు ఆహారం కోసం కిందకి దిగి, స్టాంప్‌కి వెనక ఉన్న తుమ్మ జిగురుని తింటాయని రాశాడు. అందువల్ల పోస్ట్‌బాక్స్‌లో నత్తలు ఉన్నాయా, లేదా? అనేది లోపలికి చేతిని పోనించి చుట్టూ తడిమి తెలుసుకోవచ్చని... ఇలా చాలా మంది నత్తల గురించి తమకి తెలిసిన సమాచారాన్ని ఉత్తరాల ద్వారా తెలియజేశారు. ఆ ఉత్తర‌ప్రత్యుత్తరాల శీర్షిక కొంతకాలం సాగాక బ్రిటిష్ పోస్ట్‌మాస్టర్ జనరల్ ఓ ప్రెస్‌నోట్ విడుదల చేశాడు. 'ది టైమ్స్'లో ప్రచురించినట్లు కన్జర్వేటివ్ పార్టీ ఎం.పి పోస్ట్‌మాస్టర్‌తో తను రాసిన ఉత్తరం నత్తలవల్ల నాశనం అయిందని ఫిర్యాదు చేయలేదని, అందువల్ల ఆమెకి తామెలాంటి నష్టపరిహారం చెల్లించినట్లు తమ రికార్డుల్లో లేదని, అలాగే బ్రిటన్‌లోని పోస్ట్‌బాక్స్‌ల్లోకి నత్తలు చేరడం గురించి ఇంతవరకూ తమకు ఒక్క ఫిర్యాదు కూడా అందలేదని ప్రకటించాడు. ఆ తర్వాత పాఠకుల నుంచి ఈ నత్త ఉత్తరాలు ఆగిపోయాయి. నిజానికి జరిగిందేమంటే ఆ ఎంపీ ఏప్రిల్ 1న అందర్నీ ఫూల్ చేయడానికి ఇలా ఉత్తుత్తినే పత్రికకు ఓ ఉత్తరం రాశారట.

మూశాడు.

అదే సమయంలో శంకర్ ముందుకు దూకి నారాయణ శరీరం మొత్తం తడిమాడు. నారాయణ నడుము దగ్గర ఎత్తుగా తగిలింది. ఆ సంచిని లాగటం మొదలుపెట్టాడు. అయితే అది అంత తేలికగా రావటం లేదు. ఈ పెనుగులాటలో శంకర్ చేతిలోని సారా సీసా కిందకు దొర్లిపోయింది.

ఎట్టకేలకు నారాయణ నడుముకు కట్టుకున్న సంచి విప్పిన శంకర్‌కి కళ్ళు పేలిపోయేలా అందులో నుండి వెయ్యి రూపా

యల నోట్లు బయటపడ్డాయి.

ఊపిరి బిగబట్టి వాటిని చూసిన మస్తాన్, "ఇంత డబ్బు నీకెక్కడిదిరా? " అన్నాడు నారాయణ నోటి మీద తన చేతిని కొద్దిగా వదులు చేస్తూ.

నారాయణకి తను వారి చక్రబంధంలో ఇరుక్కుపోయానని అర్థమైంది. వారిద్దరిలో ఏ ఒక్కరినీ తను ఒంటరిగా ఎదిరించలేడు. అలాంటిది ఇద్దరినీ కలిపి ఎదిరించటం అసాధ్యం. అందుకే పెనుగులాడటం ఆపేశాడు.

"చెప్పరా! ఎక్కడిదింత డబ్బు? " ఈసారి శంకర్ అడిగాడు.

"మీకెందుకు చెప్పాలి? " ఉక్రోషంగా అన్నాడు నారాయణ.

చెంప ఛెళ్ళుమంది శంకర్ కొట్టిన దెబ్బకి. కళ్ళ ముందు మెరుపులు మెరిసినట్లయింది నారాయణకి.

"అడిగినపుడు సమాధానం చెప్పాలి. అది మర్యాద" శంకర్ ఎందుకు కొట్టిందీ వివరించాడు.

"దొరికింది" గొణుక్కుంటున్నట్లు చెప్పాడు నారాయణ.

"ఎవడ్రా అంత డబ్బు పోగొట్టుకుంది? కనీసం ఆ ఏరియాలో ఎవరూ తమ డబ్బు పోయిందని అనుకోవటం వినలేదే"

ఆ డబ్బు తనకు ఎలా దొరికిందో వివరంగా చెప్పాడు నారాయణ.

"ఇంకా నయం! ఆకాశంలో నుండి ఊడి పడిందన్నావ్ కాదు" వ్యంగ్యంగా అన్నాడు శంకర్.

"నమ్మితే నమ్మండి. లేకపోతే లేదు. నా డబ్బులు నాకు ఇచ్చేయండి"

"డబ్బు దొరకటం ఏంట్రా? ఆ డబ్బు నీకు దొరికినట్లే ఇప్పుడు నాకు దొరికింది. ఆ డబ్బు మీద నీపేరేమన్నా రాసి ఉందా ఏమిటి? " డబ్బంతా చక్కగా సర్దుతూ అన్నాడు శంకర్. "కావాలంటే ఈ నోటు తీసుకో" ఒక వెయ్యి నోటు తీసి ఇస్తూ అన్నాడు.

"అక్కర్లేదు. ఆ నోటేదో నువ్వే ఉంచుకో.. నాకు నా డబ్బు ఇచ్చెయ్!"

"అయితే నీ ఖర్మ!" ఆ నోటు కూడా వెనక్కి తీసుకుంటూ అన్నాడు శంకర్.

నారాయణకి అసహాయత నుండి ఉక్రోషం, ఉక్రోషం నుండి కోపం వచ్చాయి. కానీ, ఏమి చెయ్యాలో అర్థం కాలేదు. ఇంతలో అతనికి కింద పడి ఉన్న సారా సీసా కనిపించింది. కిందకు వంగి దానిని చేతిలోకి తీసుకున్నాడు. మస్తాన్ ధ్యాస అంతా శంకర్ చేతిలోని డబ్బు మీదే ఉండటంతో అతను ఈ సంగతి గమనించలేదు. అదీకాక ఈ అర్భకుడు ఎదురుతిరగగలడన్న ఊహ కూడా వారికి రాలేదు.

నారాయణకి వాళ్ళిద్దరూ నోటిదాకా వచ్చిన కూడుని తన్నుకుపోయే గద్దల్లా కనిపిస్తున్నారు. అన్నిటికీ తెగించినట్లు చేతిలోని సీసాతో అడుగు ముందుకేశాడు.

అప్పుడే అతన్ని గమనించిన శంకర్ కేక పెట్టాడు "ఏయ్! ఆ సీసా ఇటివ్వు.." అంటూ.

అప్పటికే ఆలస్యం అయింది. నారాయణ తన బలం అంతా చేతిలోకి తీసుకుని ఆ సీసాతో శంకర్ బుర్ర మీద కొట్టాడు. అంతే! శంకర్ తల రెండుగా విచ్చుకుని రక్తం ధారలుగా కారసాగింది. తలను రెండు చేతుల్తో పట్టుకుని శంకర్ మరోమాట లేకుండా కూలిపోయాడు.

నారాయణ కిందకు వంగి తన డబ్బు సంచి తీసుకుని గుడిసె నుండి బయటకు పరుగెత్తాడు.

శంకర్ తల పగిలి కిందకు కూలిపోగానే ఒక్కక్షణం ఏమి జరుగుతుందో అర్థం కాక అలానే నిలబడిపోయాడు మస్తాన్. తేరుకున్న వెంటనే అతనికి అర్థమైన విషయం

ఇప్పుడా డబ్బు తను చేజిక్కించుకుంటే దానిని శంకర్‌తో పంచుకోనవసరం లేదని. ఆ విషయం అర్థమైన వెంటనే రెట్టించిన ఉత్సాహంతో అతను నారాయణ వెంటపడ్డాడు.

నిర్మానుష్యంగా ఉన్న వీధుల్లో అడుగుల శబ్దాలు ప్రతిధ్వనిస్తుంటే మస్తాన్, నారాయణ ఒకరి వెంట మరొకరు పరుగులు పెట్టుకుంటూ ముందుకు వెళ్ళిపోయారు.

★ ★ ★

రోజంతా జరిగిన రాజకీయ చదరంగంలో తను తప్ప మిగిలిన వారందరూ 'సేఫ్' అయ్యారని నరహరికి అర్థమైంది.

ప్రస్తుతం అతను పోలీస్ స్టేషన్లో ఉన్నాడు. అతను నడుపుతున్న ఉద్యమం వలన శాంతి భద్రతలకు భంగం కలుగుతుందని ముందు జాగ్రత్త చర్యగా అతన్ని అరెస్ట్ చేశారు.

అరెస్ట్ అయితే చేశారు కానీ, వ్యక్తిగత పూచీకత్తు మీద వదిలి పెడతామన్నారు. అతను మాత్రం బయటకు వెళ్ళటానికి ఇష్టపడలేదు. నిజం చెప్పాలంటే బయటకు వెళ్ళి ఏం చేయాలో అతనికి తెలియటం లేదు. ఫ్రీ పబ్లిసిటీ కోసం అర్ధరాత్రి దాకా పోలీస్‌స్టేషన్లోనే కూర్చున్నాడు. అయినా ఎవరూ పట్టించుకోకపోవటంతో తప్పక బయటకు వచ్చాడు. అతని అనుయాయులు కొంతమంది ఇతని విడుదల కోసం ఎదురు చూస్తూ పోలీస్‌స్టేషన్ బయట ఇంకా కూర్చుని ఉన్నారు. అప్పటి వరకు కూర్చుని కూర్చుని వారి శక్తి కూడా ఉడిగిపోయింది. దానితో అందరూ కలిసి నీరసంగా బయటకు వచ్చారు.

అదే సమయంలో పరుగెత్తుతూ వస్తున్న నారాయణ ఆ ప్రాంతానికి చేరుకున్నాడు. అక్కడకు దగ్గరలో పోలీస్‌స్టేషన్ ఉందని తెలిసినా దాంట్లోకి వెళ్దామని అతను అనుకోవటం లేదు. ఒకసారి డబ్బుతో పోలీసుల కంటపడితే డబ్బూ దొరకదు, తనూ బయటకు రానని అతనికి తెలుసు.

అంతలో అతనికి దూరంగా రోడ్డు మీద పోలీస్ స్టేషన్ నుండి బయటకు వస్తున్న నరహరి బృందానికి చెందిన మనుషులు కనిపించారు. ఒకసారి వారి దగ్గరకు వెళ్ళగలిగితే ఇక తన ప్రాణాలకు ప్రమాదం ఉండదనుకున్నాడతను.

అతన్ని వెంటాడుతున్న మస్తాన్‌కి కూడా అదే ఊహ వచ్చింది. ఒకసారి నారాయణ అంతమంది మనుషుల మధ్యకు వెళ్తే ఇక తనేమీ చేయలేడు. అందుకే అతను శక్తినంతా కూడదీసుకుని పరుగెత్తుతున్నాడు.

రోడ్డంతా ప్రదర్శనకారులు విసిరిన రాళ్ళు పడి ఉన్నాయి. వాటిని చూసిన మస్తాన్ బుర్రలో ఒక ఆలోచన మెరిసింది. పరుగెత్తుతూనే వంగి ఒక రాయి తీసి నారాయణ మీదికి విసిరాడు. అది సూటిగా వెళ్ళి అతనికి తగిలింది.

అంతే! పెద్దగా ఆర్తనాదం చేస్తూ నారాయణ కూలిపోయాడు.

రెండు క్షణాల్లో అక్కడకు చేరుకున్న మస్తాన్ నారాయణ చేతిలో డబ్బు సంచి లాక్కోబోయాడు.

నారాయణ దెబ్బ వలన కిందపడ్డాడు. కానీ స్పృహ కోల్పోలేదు. పైగా అతని చేతిలో సగం పగిలిన సీసా ఇంకా అలానే ఉంది. ఆ విషయం మస్తాన్ గమనించలేదు. అతను గమనించేటప్పటికి సమయం మించిపోయింది. రగిలిపోతున్న కసినంతా చేతుల్లోకి తెచ్చుకుని ఆ సీసాని మస్తాన్ కడుపులోకి దించాడు నారాయణ.

మస్తాన్ కళ్ళు విప్పారంగా విచ్చుకున్నాయి. జరుగుతున్న విషయం నిజమని నమ్మలేనట్లు అతను తన గాయం వైపు

చూసుకున్నాడు. బుసబుస కడుపులో నుండి రక్తం పొంగుకు వస్తోంది. దానిని చూసుకున్న మస్తాన్‌కి తను బతకటం కష్టం అని అర్థమైంది. క్రోధం అంతా వెళ్ల గక్కుతూ నారాయణ మెడ మీద కాలు వేసి తొక్కాడు.

ఇద్దరి హాహాకారాలు దూరంగా వెళ్తున్న నరహరి మనుషులకు లీలగా వినిపించాయి. వెంటనే స్పందించిన వారు పరుగెత్తుకు వచ్చారు. అయితే వారు అక్కడకు వచ్చేటప్పటికే నారాయణ చనిపోయి ఉన్నాడు. మస్తాన్ కొన ప్రాణంతో కొట్టుకుంటున్నాడు. వారి చుట్టూ కొత్త వెయ్యి రూపాయల నోట్లు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి.

కన్ను మూసి తెరిచే లోపు ఆ నోట్లన్నీ నరహరి మనుషుల జేబుల్లోకి చేరాయి. వారి నిరుత్సాహపు మొహాల్లోకి కళ వచ్చింది. ఇంకా ప్రాణంతో ఉన్న మస్తాన్‌ని తరలించటానికి అంబులెన్స్‌కు ఫోన్ చేయబోయారు. అయితే వారికి ఆ శ్రమ కూడా తగ్గిస్తూ ఫోన్ కలవక ముందే మస్తాన్ ప్రాణం కూడా పోయింది.

ఇంతలో నరహరి కూడా అక్కడకు వచ్చాడు.

అప్పటికే గుంపులో ఒక వ్యక్తి చనిపోయిన వారిని గుర్తుపట్టాడు.

"ఎవర్రా వీళ్లు? " అన్న నరహరి ప్రశ్నలకు సమాధానంగా "వీడి పేరు మస్తాన్. దగ్గరలోనే ఉంటాడు. ఇంకొకడి పేరు సరిగ్గా తెలియదు. కానీ నారిగాడంటారు. వాడేమో గుడి దగ్గర అడుక్కుంటూ ఉంటాడు" వివరించాడు వారిని గుర్తు పట్టిన వ్యక్తి.

ఆ మాటలు విన్న నరహరి మొహంలో వింత వెలుగు ప్రవేశించింది.

★ ★ ★

ఆదిశేష ప్రయాణిస్తున్న విమానం తెల్లవారుజామున ముంబయిలో దిగింది. మల్హోత్రాకి వాగ్దానం చేసిన ప్రకారం అతను స్వయంగా ముంబయి వచ్చాడు.

మల్హోత్రాకి ఎంత డబ్బు అవసరమో, అంత డబ్బు తన బ్యాంకు ఇవ్వగలదో, లేదో పరిశీలించటానికి అతను వచ్చాడు. ఈ విషయంలో మల్హోత్రా కంటే ఆదిశేషుకే ఆత్రుతగా ఉంది. ఒకసారి మల్హోత్రా సమస్యలు పరిష్కరించి ఫైనాన్స్ మినిస్టర్ చెప్పిన పని చేస్తే తన సమస్యల గురించి ఆయన పట్టించుకుంటాడు.

ఎయిర్‌పోర్ట్ బయటకు వచ్చిన అతనికి ఎప్పటిలా తన బ్యాంకు అధికారులెవరూ కనపడలేదు. అతను తన పర్యటనకు అనవసర ప్రచారం కల్పించదలుచుకోలేదు. అందుకే అక్కడకు ఒంటరిగా ఎవరికీ చెప్పకుండా వచ్చాడు. ఎదురుగా కనిపించిన టాక్సీ ఎక్కి కూర్చుని తను వెళ్ళవలసిన హోటల్ అడ్రస్ చెప్పాడు.

టాక్సీ బయలుదేరింది. వాన ఈడ్చి కొడుతోంది. గాలి రివ్వున వీస్తోంది.

"సాయంత్రం వరకు వాన పడినట్లు లేదు. ఇదేంటి ఇంత హఠాత్తుగా కాలం కాని కాలంలో వాన రావటం? " అన్నాడు ఆదిశేష టాక్సీ డ్రైవర్‌తో.

"నిన్న సాయంత్రం నుండి చినుకులు మొదలయ్యాయి సర్! అరేబియా సము

**కొత్తగాలి...**

**నాటి సామెత**
**'ముందు'ందిలే మంచి కాలం!**
**ప్రభుత్వ ఉవాచ**
**'మందు'ంది మంచి కాలం!!**

*– అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, దేవరకొండ*

ద్రంలో తుపానని అంటున్నారు. తీవ్రతరమైన పెనుగాలులు వీయవచ్చని హెచ్చరిస్తున్నారు" అద్దంలో నుండి తీక్షణంగా ముందుకు చూస్తూ చెప్పాడు డ్రైవర్.

"ఇలాంటి వాతావరణంలోనూ విమానాలు క్షేమంగా దిగుతున్నాయంటే హ్యాట్సాఫ్ టు టెక్నాలజీ" అన్నాడు ఆదిశేషు.

తెలియని విషయాల్లో తలదూర్చటం ఇష్టం లేనట్లు ఆ డ్రైవర్ మాట్లాడలేదు.

టాక్సీ అద్దం మీద నుండి ధారలుగా వాన నీరు కిందకి జారుతోంది. టాక్సీకున్న వైపర్లు నీటిని అడ్డు తొలగించలేకపోతున్నాయి. జాగ్రత్తగా, నెమ్మదిగా డ్రైవ్ చేస్తున్నాడు డ్రైవర్.

**కొత్తగాలి...** 

**పోయాక పిండం పెట్టడం**
**కాదు ప్రధానం**
**ఉన్నపుడు కడుపునింపి**
**ఆదరించడమే ఔదార్యం**

– నేమాన సుభాష్ చంద్రబోస్,
విశాఖపట్నం

వీరి టాక్సీకి ఎదురుగా స్కైలైన్ సంస్థకి చెందిన ఎయిర్‌పోర్ట్ బస్ వెళ్తోంది. అది కూడా ఎయిర్‌పోర్ట్ దగ్గర నుండే బయలుదేరింది. బహుశా స్కైలైన్ విమానాలు ఎగరక పోవటం వలన ఆ ప్రయాణికులను హోటళ్ళకు తరలిస్తున్నట్లున్నారు. తను మల్హోత్రాతో సమావేశం కాగానే ఈ సంక్షోభం తీరుతుందేమో!... అనుకున్నాడు ఆదిశేషు.

"ఇంకెంతసేపు పడుతుంది? " విసుగ్గా అడిగాడతడు టాక్సీ డ్రైవర్ని.

"వచ్చేస్తున్నాం సార్! కొత్తగా కట్టిన ఫ్లైఓవర్ దగ్గరకు వచ్చాం! దాని మీద అయితే త్వరగా వెళ్ళవచ్చు"

ఒక్కసారిగా గాలివేగం బాగా పెరిగింది. వింత వింత ఊళలు వేస్తూ వాతావరణం భయంగొలిపేలా తయారయింది.

ఎదురుగా వెళ్తున్న ఎయిర్‌పోర్ట్ బస్ కూడా ఫ్లై ఓవర్ వైపు తిరిగింది. టాక్సీ డ్రైవర్ దాని వెనుకే వెళ్తున్నాడు.

ఆదిశేషుకి తన సమస్యలు గుర్తుకు వచ్చాయి. తన భవిష్యత్తంతా ఫైనాన్స్ మినిస్టర్ చేతుల్లో ఉంది. ఆయన ఏమి నిర్ణయం తీసుకుంటాడో తెలియదు. మధ్యలో ఆయన ఈ స్కైలైన్ సంస్థకి లోన్ అనే పితలాటకం పెట్టాడు. దీని విషయం ఈరోజే తేల్చేయాలి. ఏమిటో విచిత్రం? అంత పెద్ద మల్హోత్రాని తను సమస్యల నుండి బయట పడెయ్యగలుగుతున్నాడు! కానీ, తన సమస్యలు తీరాలంటే తను మరొకరి కాళ్ళు పట్టుకోవాలి..

ఆలోచనల మధ్య అతను కాసేపు పరిసరాలను మరచిపోయాడు. అదే సమయంలో అతను ప్రయాణిస్తున్న టాక్సీ ఫ్లై ఓవర్ పైకి చేరింది. అది పి.ఎస్. కన్‌స్ట్రక్షన్స్ ఆధ్వర్యంలో నిన్న సాయంత్రమే ప్రారంభించబడిన కట్టడం. నిమిష నిమిషానికి పెరుగుతున్న గాలి వేగానికి ఒకటొకటిగా దాని డిజైనింగ్ లోపాలు బయటపడుతున్నాయి. ఐ.ఐ.టి. విద్యార్థి ఊహించినట్లే వేగంగా వీస్తున్న గాలి కలిగిస్తున్న పీడనానికి ఫ్లై ఓవర్ కంపించటం ప్రారంభించింది. సన్నగా మొదలయిన కంపనాలు ఎక్కువవుతున్నాయి. కొంతమంది డ్రైవర్లు భూకంపం వచ్చిందేమో అని అనుమాన పడుతున్నారు. తమ తమ వాహనాలు ఎక్కడివి అక్కడే ఆపారు.

ఎదురుగా వెళ్తున్న స్కైలైన్ బస్ కూడా ఆగింది. దాని వెనుకే టాక్సీ ఆగింది.

ఏమి జరుగుతోందో ఎవరికీ అర్థం

# వందమైళ్ల బ్రిడ్జ్!

కొన్ని నగరాలు అక్కడి బ్రిడ్జ్‌లకి ప్రసిద్ధి. శాన్‌ఫ్రాన్సిస్కో గోల్డెన్ గేట్ బ్రిడ్జ్‌కు, లండన్‌లో థేమ్స్‌పైన లండన్‌బ్రిడ్జ్, న్యూయార్క్‌లో బ్రూక్లిన్ బ్రిడ్జ్, అలాగే ప్రాగ్‌లో చార్లెస్ బ్రిడ్జ్ కూడా ప్రసిద్ధి చెందాయి. ఆస్ట్రేలియా దేశంలో ప్రసిద్ధి చెందింది సిడ్నీ హార్బర్ బ్రిడ్జ్.

అయితే 2011లో ప్రారంభించిన బీజింగ్-షాంఘై హైస్పీడ్ రైల్వేలైన్ కోసం 244 బ్రిడ్జ్‌లను చైనా నిర్మించింది. ఈ రైలు పట్టాలు 85శాతం బ్రిడ్జ్‌లమీదే సాగటం విశేషం! నిత్యం రెండు లక్షల ఇరవైవేలమంది ప్రయాణికులను చేరవేసే ఈ హైస్పీడ్ రైల్వేలైన్ నిర్మాణానికి 3200 కోట్ల డాలర్లు ఖర్చయ్యాయి. ఈ 244 బ్రిడ్జ్‌లలో డాన్‌యాంగ్ కున్‌షన్ గ్రాండ్ బ్రిడ్జ్ ఇంజినీరింగ్ అద్భుతంగా పేర్కొనతగ్గది. ఇది ప్రపంచంలోని అత్యంత పొడవైన బ్రిడ్జ్. ఈ బ్రిడ్జ్ పొడవు వంద మైళ్లు! దీన్ని అనేక నదుల మీదుగా నిర్మించారు.



చైనా దీన్ని కట్టినా ప్రపంచంలోని పేరొందిన బ్రిడ్జ్‌లు తమ విశిష్టతను కోల్పోలేదు. ఎందుకంటే ఈ పొడుగాటి చైనాబ్రిడ్జ్‌కి ప్రపంచ ప్రజల్లో గుర్తింపు పెద్దగా లభించలేదు. చైనా కూడా ఈ బ్రిడ్జ్ నిర్మాణం గురించి ప్రపంచానికి విశదపరిచే ఉత్సాహాన్ని చూపలేదు. దాంతో దీని గురించి కేవలం ఇంజినీరింగ్ సర్కిల్‌లోని వారికి మాత్రమే తెలుసు.

కావటం లేదు. ఏమి చేయాలో ఆలోచించే సమయం అసలే లేదు.

పెద్ద పెద్ద శబ్దాలు చేస్తూ ఫ్లైఓవర్‌కి చెందిన ఒక సెక్షన్ కూలి పోవటం ప్రారంభించింది.

కూలిపోతున్న భాగంలో ఉన్నవి రెండే వాహనాలు. ఒకటి బస్సయితే, మరొకటి టాక్సీ.

★ ★ ★

స్వదేశ్ సింగ్ ఆ రాత్రంతా కలత నిద్రతోనే గడిపాడు. అతని వయసు అరవై సంవత్సరాలు. అయినా తండ్రి లేని లోకంలో ఇదే మొదటి రోజు. తండ్రి తమ కంపెనీని ఎంత బాగా కాపాడుకుంటూ వచ్చాడో అతనికి బాగా తెలుసు. తన తండ్రికి లాభాల కంటే విలువలు ముఖ్యం. తననూ అదేదారిలో నడవమన్నాడు. తను ఆయన చూపిన బాటలోనే నడుస్తున్నాడు. కానీ ఇప్పటి వరకు ఎలా జరిగినా, ఎవరు జరిపినా ఆ ఖ్యాతి అంతా తండ్రికే వెళ్లింది. రేపటి నుండి అన్ని నిర్ణయాలూ స్వయంగా తనే తీసుకోవాలి అనుకుంటుంటే అతనికి ఒక పక్క గర్వంగా, మరొక పక్క భయంగా ఉంది.

ఆలోచనల మధ్య తెల్లవారింది. డైనింగ్ టేబుల్ మీద పెట్టిన వార్తాపత్రిక తెరచిన అతనికి వెక్కిరిస్తూ కనిపించింది ఆ వార్త. అదేమంటే నిన్ననే ప్రారంభించిన ముంబయి ఫ్లై ఓవర్ కూలిపోయిందని.

అతను ఎంత షాక్‌కి గురయ్యాడంటే చాలాసేపు నోటి నుండి మాట రాలేదు. ఈ విషయం ఇప్పటి వరకు తనకు ఎవరూ ఎందుకు చెప్పలేదో ముందు అర్థం కాలేదు. కానీ ఆలోచిస్తే అప్పుడే తండ్రి అంత్యక్రియలు పూర్తి చేసిన తనకు ఈ విషాదవార్త చెప్పే ధైర్యం ఎవరూ చేయలే

దన్న మాట.

చివరకు గొంతు పెగల్చుకుని, "ఎవరయినా చనిపోయారా? " అని మాత్రం అడగగలిగాడు అక్కడే ఉన్న సెక్రటరీని.

"ఒక బస్, ఒక టాక్సీ ఫ్లై ఓవర్‌తో పాటు కిందపడిపోయాయి. బహుశా ప్రాణ నష్టం భారీగానే ఉండి ఉండవచ్చు" సమాధానం చెప్పాడు ఆ సెక్రటరీ.

తింటున్న బ్రేక్‌ఫాస్ట్ సగంలో వదిలి లేచాడు స్వదేష్ సింగ్. తన తండ్రి చనిపోయిన మరుసటి రోజే ఈ దారుణం జరగటం దేనికి సంకేతమో అతనికి అర్థం కావటం లేదు. బతికినన్నాళ్ళూ కంటికి రెప్పలాగా కాపాడుకొచ్చిన ఈ సామ్రాజ్యం ఆయన పోయిన కొన్ని గంటల్లోనే కూలిపోవటం మొదలుపెట్టిందా?

ఇంతలో అతనికి తండ్రి చనిపోయే ముందు ఈ ఫ్లైఓవర్ ఫైల్ కావాలని అడగటం, తను డ్రైవర్‌కి ఇచ్చి పంపటం గుర్తుకు వచ్చింది. తరువాత ఆ విషయమే తనకు గుర్తు రాలేదు. ఇంతకీ ఆ ఫైల్ ఏమయింది?

వెంటనే అతను హాస్పిటల్‌కి ఫోన్ చేశాడు. ఫైల్ అక్కడే ఉందనీ, ఎవర్నైనా పంపి తీసుకువెళ్ళమనీ చెప్పారు.

అరగంటలో హాస్పిటల్ చేరుకున్నాడు స్వదేష్ సింగ్. ఆ ఫైల్ తెచ్చి అతనికి ఇచ్చారు హాస్పిటల్ సిబ్బంది. దాని పేజీలు తిప్పిన అతనికి ఒక కాగితం బాగా నలిగిపోయి ఉండటం కనిపించింది. అది ఫ్లైఓవర్ స్ట్రక్చరల్ డిజైనులకు సంబంధించిన పేజీ. ఆ కాగితం అంత ఎందుకు నలిగిందో అతనికి అర్థం కాలేదు. తమకెవరికీ కనిపించని పొరపాటు తండ్రికి కనిపించిందా? అది తమతో పంచుకోవాలన్న ఆత్రుత ఆయన ప్రాణాలు తీసిందా?

ఆ ఐ.ఐ.టి. విద్యార్థి చెప్పినట్లు డిజైన్‌లో లోపం కచ్చితంగా ఉండి ఉండాలి. లేనిదే ఫ్లై ఓవర్ ఎందుకు కూలిపోయింది? ఈ నలిగిన కాగితాన్ని బట్టి ఆలోచిస్తే ఆ విషయం తన తండ్రికి కూడా అర్థమైనట్లే ఉంది. మరి వయోవృద్ధుడయిన తన తండ్రికీ, నవయువకుడైన ఆ విద్యార్థికీ అర్థమైన విషయం ఎంతో అనుభవజ్ఞులయిన తమ ఇంజనీర్లకు ఎందుకు అర్థం కాలేదు? ఆ ఫైల్ డ్రైవర్‌కి ఇవ్వకుండా తనే తెచ్చి ఉంటే బహుశా పరిస్థితి వేరే విధంగా ఉండేదేమో!

ఇంతలో అతనికి మరో ఫోన్ వచ్చింది. ఫ్లై ఓవర్ కూలిపోవటానికి కారణం నాణ్యత లేని పనులు చేసిన పి.ఎస్.కన్‌స్ట్రక్షన్స్ అని ప్రభుత్వం ప్రకటించింది. ఎవరో ఒకరిని బలి పశువు చేయాలి కాబట్టి పి.ఎస్.కన్‌స్ట్రక్షన్స్ మీద క్రిమినల్ కేసులు పెట్టబోతున్నారు. అవన్నీ తేలే దాకా కంపెనీ మరేవిధమయిన నిర్మాణాలూ చేపట్టకుండా నిషేధం విధిస్తున్నారు. ఫోన్‌లో వ్యక్తి సలహా ఇస్తున్నాడు- 'లాయర్తో మాట్లాడి ముందస్తు బెయిల్ తీసుకుంటే మంచిదేమో.. ఆలోచించండి..' అని.

ఏమీ మాట్లాడకుండా ఫోన్ పెట్టేశాడు స్వదేష్ సింగ్. అతను ఇంటికి చేరుకునేటప్పటికి పోలీసులు అతని కోసం ఎదురు చూస్తున్నారు.

"ఆ ప్రమాదంలో మనుషులు చనిపోకుండా ఉంటే ఇంత అలజడి రేగి ఉండేది కాదు. ఇపుడు మిమ్మల్ని అరెస్ట్ చేయటం తప్ప ప్రభుత్వం వద్ద మరో ప్రత్యామ్నాయం లేదు" చెప్పాడు అరెస్ట్ చేస్తున్న ఆఫీసర్.

పోలీస్ స్టేషన్లో కూర్చుని ఆలోచిస్తున్న స్వదేష్ సింగ్‌కి తప్పు ఎక్కడ జరిగిందో అర్థం కావటం లేదు. తన తండ్రి మరి కొన్ని నిమిషాలు బతికుంటే డిజైనింగ్

లోపం బయటి ప్రపంచానికి తెలిసేది. అప్పుడు తను ఆ లోపం సరిచేసే వరకూ ప్రారంభోత్సవం జరగకుండా ఆపేవాడు. 'నిజంగా ఆ దేవుడు ఎంత కఠినాత్ముడు? అంత దీర్ఘాయువు ఇచ్చిన తన తండ్రిని అవసరమయినపుడు మరికొన్ని నిమిషాలు బతకనివ్వలేదు. దీనికి కారణం ఎవరూ కాదు! ఆ దేవుడే ఇలా జరగాలని రాసి పెట్టాడు' అనుకున్నాడతను.

అంతేకానీ, స్వదేశ్ సింగ్ ఒక విషయం గుర్తించలేదు. ఏదైతే తమ కంపెనీ అప జయం అనుకుంటున్నాడో, అది మరో పక్క ఆ ఐ.ఐ.టి. విద్యార్థి విజయం అవు తుంది.

ప్రకాష్ సింగ్ ఎలా అయితే ఒక పొర పాటుని ఎత్తిచూపి జీవన సమరంలో విజ యబావుటా ఎగరవేశాడో.. అలాగే ఆ ఐ.ఐ.టి. విద్యార్థి తమ కంపెనీ చేసిన ఈ పొరపాటును నిచ్చెన మెట్టుగా చేసుకుని పైకి ఎదగబోతున్నాడు. అతి త్వరలో అతను మరో ప్రకాష్ సింగ్ అవబోతు న్నాడు.

★ ★ ★

తన జీవితంలో అత్యంత ముఖ్యమ యిన రోజు అదే కాబోతుందని మల్హోత్రాకి తెలుసు.

ఈ రోజు ఆదిశేషుని తను కలుసుకోబో తున్నాడు. ఆదిశేషు లోను ఇవ్వటానికి ఏమేమి కండీషన్లు పెడతాడో, ఏమేమి సెక్యూరిటీలు అడుగుతాడో చూసుకోవాలి. ఒకటి మాత్రం నిజం. తనకి మరో ఛాన్స్ లేదు. అదే ఆఖరి అవకాశం.

అందుకే ఏమి చేసి అయినా ఈ లోను సంపాదించాలి. ఒకసారి చాలినన్ని డబ్బులు చేతిలో పడితే, తన తెలివితేటల్ని ఉపయోగించి తిరిగి స్కైలైన్ సంస్థని లాభాల్లోకి తేవటం పెద్ద విషయం ఏమీ కాదు.

వ్యాపారంలో డీలా పడ్డ వ్యక్తికి కావల సింది ఓదార్పు కాదు, 'ఆలంబన'. కొద్దిగా బలహీనపడ్డాడని తెలియగానే అందరూ సానుభూతి చూపిస్తారు. అంతేతప్ప ఎవరూ సహాయం చెయ్యరు. అయినా అన్ని అడ్డంకులూ అధిగమించి తను సాధించి చూపిస్తాడు.

మల్హోత్రా పదేపదే వాచ్ చూసుకుంటు న్నాడు. ఆదిశేషు నుండి రావలసిన ఫోన్ ఆలస్యం కావటంతో అతను అసహనంగా ఉన్నాడు. కాసేపు చూసి ఇక ఎదురు చూడలేక తనే అతని నెంబర్‌కి ఫోన్ చేశాడు. ఎవరూ తియ్యలేదు.

ఇంతలో దిలీప్ పరుగెత్తుకుంటూ లోప లకు వచ్చాడు. "సిటీలో కొత్తగా కట్టిన ఫ్లై ఓవర్ కూలిపోయింది" వగరుస్తూ చెప్పాడు.

'సో వాట్? అన్నట్లు చూశాడు మల్హోత్రా.

"ఎయిర్‌పోర్ట్ నుండి ప్రయాణికులను హోటల్‌కి తీసుకువెళ్తున్న మన బస్ ఆ ఏక్సిడెంట్లో చిక్కుకుంది"

శక్తినంతా ఎవరో పిండేసినట్లు కుంగిపో యాడు మల్హోత్రా. కాసేపటికి తేరుకుని "అందులో ఎంత మంది ఉన్నారు? వారికి ఎలా ఉంది? " అని అడిగాడు.

ఇబ్బందిగా చూస్తూ చెప్పాడు దిలీప్ -

## కొత్తగాలి...

**సినీతార ముదిరితే**
**రాజకీయ నాయకుడు!**
**నాయకుడు ముదిరితే**
**స్విస్‌బ్యాంక్ ఖాతాదారుడు!!**

– ఆర్.ఎస్ హైమవతి, చెన్నై

"దాదాపు పాతిక మంది ఉన్నారు. ఎవరూ బతికే ఛాన్స్ లేదంటున్నారు"

మల్హోత్రా తల విదిలించాడు. 'ఇప్పుడు సమస్య మరొక కోణం నుండి మొదలయింది. ఇప్పటి వరకు తమ సంస్థకి ఆర్థిక పరిపుష్టి లేదన్నది ఒక్కటే ఆరోపణ.

ఇప్పుడు నిర్వహణా సామర్థ్యం మీద కూడా ప్రశ్నలు మొదలవుతాయి. ప్రయాణికుల ప్రాణాలు పోవటానికి తమనే బాధ్యులను చేస్తారు. కాంపెన్సేషన్ క్లెయిమ్‌లు మీదపడతాయి. బస్సు ప్రమాదం ఇన్సూరెన్స్ పరిధి కిందకి వస్తుందో, రాదో.. అసలు ఆ ఫ్లైఓవర్ కట్టిన కాంట్రాక్టర్ ఎవరో? అందులో ఎంత తిన్నాడో? ప్రారంభోత్సవం జరిగిన మరుసటి రోజే కూలిపోయేలా కట్టిన వాడిని ఏమి చెయ్యాలి? నిలబెట్టి కాల్చేయాలి' కసిగా అనుకున్నాడతను.

ఇంతలో అతనికి మరొక ఫోన్ వచ్చింది. అది అతని స్నేహితుడయిన సెంట్రల్ మినిస్టర్ నుండి.

"అయామ్ సారీ!" అన్నాడు మినిస్టర్.

"ఎవరు మాత్రం ఏమి చేయగలరు? మా దురదృష్టం" అన్నాడు మల్హోత్రా.

"ఇంకేమైనా సాయం కావాలంటే చెప్పండి చేస్తాను" అన్నాడతను.

"సర్! ఆదిశేషు నుండి ఇంకా ఫోన్ రాలేదు"

ఈసారి ఆశ్చర్యపోవటం మినిస్టర్ వంతయింది.

"ఇందాక నేను సారీ చెప్పింది దేనికోసం అనుకున్నావ్? ఆదిశేషు కూడా ఆ ఫ్లైఓవర్ ఏక్సిడెంట్లో చనిపోయాడు"

"డామిట్!" పెద్దగా అరిచాడు మల్హోత్రా.





"ఉంటే!
వెంటనే వాటిని
అమ్మేయండి. కాసే
పాగితే అవి నాలుక గీసు
కోవటానికి కూడా పనికిరావు"
అని చెప్పి అ వతల వ్యక్తి చెప్తున్న మాట వినకుండా ఫోన్ పెట్టేశాడు.

మరో అరగంటలో కంపెనీ లాయరు అతని ముందు ఉన్నాడు. ఇద్దరూ ఒక గంట సేపు చర్చించుకున్నారు.

ఆ తర్వాత లాయర్ పరుగెత్తుతున్నట్లు నడుస్తూ బయటకు వెళ్ళిపోయాడు మల్హోత్రా తరపున దివాళా పిటీషన్ దాఖలు చెయ్యటానికి.

★ ★ ★

చనిపోయిన నారాయణ, మస్తాన్ శవాలు వికృతంగా రోడ్డు మీద పడి ఉన్నాయి. వాటి ముందు నిలబడి ఉన్నాడు నరహరి. చుట్టూ అతని అనుచరులు ఉన్నారు. అతనికి ఇప్పుడు చనిపోయిన వ్యక్తుల పేర్లు తెలిశాయి. అతని

కాసేపు నిశ్శబ్దంగా ఉన్న మినిస్టర్ మల్హోత్రా ఏమీ మాట్లాడకపోవటంతో, "మరి ఫోన్ పెట్టేయనా? " అ న్నాడు.

"ఆగండి.." గట్టిగా అన్నాడు మల్హోత్రా. "మీరు నాకు ఏమి సాయం చేశారన్నది పక్కన పెట్టండి. నేను మీకు ఒక సాయం చెయ్యనా? "

"ఏమిటది? "

"మీకు స్కైలైన్ సంస్థ షేర్లు ఉన్నాయా? "

"తెలియదు. ఉండే ఉంటాయి. ఎందుకు? "

బుర్రలో ఒక ఫ్లాష్ వెలిగింది.

తన అనుచరుల్లో ముఖ్యమయిన ఇద్దరిని పక్కకు పిలిచి వారి చెవిలో చెయ్యవలసినది చెప్పి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

"సారు మనసు వెన్న. ఈ శవాలను అలా దిక్కులేని వాటిలా వదిలేయకుండా వాళ్ళ వాళ్ళకు చేర్చమన్నాడు మన నరహరి సారు. వారికి ఎవరూ లేకపోతే దహన సంస్కారాలు కూడా మనల్నే చేయమన్నాడు.." చెప్పాడు నరహరి చేత చెవిలో చెప్పించుకున్న ఇద్దరిలో ఒకడు.

"ఇప్పుడాపని ఎవడు చేస్తాడు? " ఉదయం నుండి తిరుగుతున్న అతని అనుచరుల్లో ఒకడు విసుగ్గా అన్నాడు.

మెజారిటీ అభిప్రాయం అదే అవటంతో, "సరే! మీరు పోండి. ఎవరికి తప్పినా మాకు తప్పదుగా! మేం చూసుకుంటాంలే!" అన్నాడు మరో ముఖ్య అనుచరుడు.

అందరూ వెళ్ళిపోయారు, ఆ ఇద్దరు తప్ప.

వారిద్దరు ఈ శవాలను జీపులోకి ఎక్కించుకుని తీసుకువెళ్ళారు. జీపు చాలా దూరం ప్రయాణించి ముస్లింలు అధికంగా ఉండే ఒక ఏరియాకి చేరింది. చీకట్లలో భయంగా అటుఇటు చూస్తున్నారు. చివరకు నిర్మానుష్యంగా ఉన్న ఒక రోడ్ మీద ముందుకు వెళ్ళి ఒకచోటఆగారు. వెంటనే జీప్‌లోంచి మస్తాన్ శవాన్ని కిందకు దించి ఒక మసీదు మెట్ల మీద పడేశారు. అక్కడకు దగ్గరలోని ఒక గుడి మెట్ల మీద నారిగాడి శవాన్ని పడేశారు.

తను రోజూ ఎక్కడ కూర్చుని అడుక్కుంటాడో అక్కడే శవమై పడి ఉన్నాడు నారిగాడు.

రెండు శవాలూ పడి ఉన్న ప్రదేశాలకు సమీపంలో కొన్ని గుడిసెలు ఉన్నాయి. నిశ్శబ్దంగా అక్కడకు చేరుకున్న వారిద్దరూ ఆ గుడిసెలో ఒకదానికి నిప్పంటించి కలకలం సృష్టించారు.

అంతా కలకలం. ఎవరికీ ఏమీ అర్థం కావటం లేదు. ముందు అగ్ని ప్రమాదం అనుకున్నారు. తరువాత నారిగాడి శవం బయట పడింది. హత్య జరిగిందనుకున్నారు. మరి కాసేపటికి మస్తాన్ శవం కనిపించింది.

అంతే! జరిగిన సంఘటన మత కలహాల రంగు పులుముకుంది. మరికాసేపటికి దాడులు, గృహదహనాలూ మొదలయ్యాయి.

★ ★ ★

తెల్లవారుజామున నాలుగు గంటలకు నిద్రపోతున్న ముఖ్యమంత్రి మహేష్‌ని నిద్రలేపి జరిగింది చెప్పారు.

అతను వెంటనే బయలుదేరి తన ఆఫీసుకు చేరుకున్నాడు. అప్పటికే అత్యున్నత స్థాయి పోలీసు అధికారులు రంగంలోకి దిగారు. వెంటనే రాపిడ్ యాక్షన్ ఫోర్స్ కూడా దిగిపోయింది.

జరుగుతున్న గొడవలు చల్లార్చటం ఎంత ముఖ్యమో అవి వేరే ప్రదేశాలకు పాకకుండా ఆపటం కూడా అంతే ముఖ్యం.

అన్ని జిల్లా కలెక్టర్లకీ సందేశాలు వెళ్ళాయి. గొడవలు పెద్దవి కాకముందే అధికార యంత్రాంగం అప్రమత్తమయింది.

తెల్లవారేటప్పటికి గొడవలు కంట్రోల్లోకి వచ్చాయి. "అతి తక్కువ సమయంలో, అతి తక్కువ నష్టంతో గొడవల్ని అదుపులోకి తెచ్చారు. కంగ్రాచ్యులేషన్స్" అని పోలీస్ కమీషనర్ని అభినందించాడు ముఖ్యమంత్రి.

ముఖ్యమయిన మంత్రులు, పార్టీ ప్రముఖులు, సలహాదారులు ముఖ్యమంత్రి కార్యాలయానికి చేరుకున్నారు. వారంద

రితో సమావేశమయ్యాడు ముఖ్యమంత్రి.

"జరుగుతున్న గొడవలన్నిటికీ మూల కారణం పదవి కోసం ఆరాటం. మనకి తగినంత బలం లేక పోవటంలో ప్రతి ఒక్కరికీ మన ప్రభుత్వాన్ని తేలికగా పడ గొట్టవచ్చన్న అభిప్రాయం కలిగింది. అందుకే అందరూ ప్రయత్నించి చూస్తు న్నారు..." చెప్పాడు ముఖ్యమంత్రి.

"కానీ! ఏం చెయ్యగలం?"

"రెండు ఆప్షన్లున్నాయి. ఒకటి ఇలాగే దినదినగండంగా రోజులు నెట్టుకు వచ్చి ఎలాగోలా అయిదేళ్ళూ పూర్తిచేసి అప్పుడు ఎన్నికలకు వెళ్ళటం.

అయితే ఇలా ఏ పనీ చెయ్యకుండా పద విలో ఉన్నంత కాలం మన పరువుప్రతి ష్టలు దిగజారటం తప్ప మెరుగవ్వవు.

రెండవ ఆప్షన్ ధైర్యం చేసి ప్రభుత్వాన్ని రద్దు చేసి ఇప్పుడే ఎన్నికలకు వెళ్ళటం. ఇలా చేస్తే ప్రజలకి మన సమస్య కూడా చెప్పవచ్చు. చాలీచాలని మెజారిటీతో మనం పడుతున్న అవస్థలు గమనించిన ప్రజలు ఇస్తే పూర్తి మెజారిటీ ఇస్తారు. లేకపోతే ప్రతిపక్షంలో కూర్చుం దాం! అం తేకానీ ఆత్మను చంపుకుని ఇలా బతకటం నాకు నచ్చటం లేదు. ఎలక్షన్లకి వెళ్దాం, పూర్తి మెజారిటీ తెచ్చుకుందాం"

ముఖ్యమంత్రి అభిప్రాయం మీద సుదీర్ఘమైన చర్చ జరిగింది.

చివరకు అందరూ మధ్యంతర ఎన్నిక లకు వెళ్ళటానికే తమ మద్దతు పలికారు.

వెంటనే ముఖ్యమంత్రి గవర్నర్ నివాసం చేరుకున్నాడు. తన రాజీనామా సమర్పించి వీలయినంత త్వరగా మరలా ఎన్నికలు పెట్టించమని ఆయనకు విన్న వించుకున్నాడు.

అందుకు అంగీకరించిన గవర్నర్ తదు పరి ఎన్నికలు జరిపే వరకూ ఈ ముఖ్య మంత్రినే ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా ఉండ మని కోరాడు.

పని ముగించుకుని విజయగర్వంతో గవర్నర్ నివాసం నుండి బయటకు వచ్చాడు ముఖ్యమంత్రి మహేష్.




'హమ్మయ్య' అనుకున్నాడు ఆదిత్య. మొదట ముఖ్యమంత్రి రాజీనామా చేశా డంటే ఆందోళన చెందాడు. ఈ పని ఆయన వ్యూహాత్మకంగా చేశాడని అర్థమ య్యాక అతను నిట్టూర్చాడు.

అటూ ఇటూ చూసిన అతనికి సహదే వుడు ఎక్కడా కనిపించలేదు. ఇక కనప డడు అని కూడా అర్థమయింది.

ఇంతకీ దేవుడు తనద్వారా ఈ ప్రయోగం చేయించి ఏం నిరూపించదలు చుకున్నాడు? ఏం చెప్పదలచుకున్నాడు? ఇంతలో అతనికి మరొక అనుమానం వచ్చింది. అసలిదంతా దేవుడు తనకు గు ణపాఠం నేర్పాలని చేశాడా? తనకు తెలి యచెప్పడానికే చేశాడా?

ఒకవేళ రెండోది నిజం అనుకుంటే తను ఏమి తెలుసుకున్నాడు?

అతను ఒకసారి జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకున్నాడు. తను నారాయ ణకు చేయబోయిన చిన్న సాయం వికటించి అతని ప్రాణం తీసింది. అతనికి సాయం చెయ్యటం కోసం తను వేలు పెట్టటంతో మల్హోత్రా జీవితం చిన్నాభిన్న

మయింది. అతను దివాళా తీశాడు. ప్రకాష్ సింగ్ చనిపోయాడు. ఆయన కంపెనీ పరువు పోయింది. ముఖ్యమంత్రి రాజీనామా చేశాడు. కానీ రాబోయే ఎన్నికల్లో గెలుస్తాడా? ఏమో! అంటే సహదేవుడి ద్వారా దేవుడు తనకేం చెప్పదలుచుకున్నాడు? ఈ ప్రపంచంలో సమానత్వం కావాలనుకోవటం తప్పా? అతను మరొకసారి సహదేవుడి మాటలు గుర్తుకు తెచ్చుకున్నాడు. ప్రపంచంలో రెండు రకాల జీవుల మధ్య సమానత్వం లేదేమో! కానీ, ఒకే జాతి జీవుల మధ్య ఎప్పుడూ సమానత్వం ఉందని అన్నాడు.

అవును! ప్రతి మనిషీ సమాన శక్తియుక్తులతో పుడుతున్నాడు. తరువాత అతను ఎలా మారతాడో అతని పట్టుదల, కర్మల మీద ఆధారపడి ఉంటుంది. అదేనా దేవుడు తనకు చెప్పదలచుకుంది?

అలా అయితే పేదరికంలో ఉన్న వ్యక్తికో, తక్కువ స్థాయిలో ఉన్న వ్యక్తికో సాయం చేయటం తప్పా? మానవ సేవే మాధవ సేవ అని ఆయనే చెప్పాడుగా! మరి తను సహాయం అందించటం వలనే నారాయణ ఎందుకు చనిపోయాడు?

ఏమీ అర్థం కాక తల విదిలించాడు ఆదిత్య. తల వెళ్ళి మంచానికి తగిలి గాఢ నిద్ర నుండి మెలకువ వచ్చింది. అటూ ఇటూ చూశాడతను. అప్పటికే బాగా తెల్లవారింది. అంటే ఇప్పటివరకూ తను అనుభవించింది కలా!

ఆ రోజు దినపత్రికలు టేబుల్ మీద నీటుగా అమర్చి ఉన్నాయి. వాటిలో ఒక దాన్ని తీసుకుని తారీఖు చూశాడు. 25 అని ఉంది. తనకి వచ్చింది కలే! పేపరు వెనక్కి తిప్పి చూశాడు. తను నటించిన సినిమా ప్రకటన మొత్తం పేజీ అంతా కవరయి ఉంది. నేడే విడుదల అన్న అక్షరాలు పేజీ అంతా నిండి ఉన్నాయి. యస్! ఇదంతా కలే!

'హమ్మయ్య!' అనుకున్నాడతను. తన తెలివి తక్కువతనం వల్ల ఎంతమందికి ఎంత నష్టం కలిగిందో అని బాధపడుతున్న అతనికి కాస్త ఊరట కలిగింది.

తరువాత తీరికగా వార్తలు చదివాడు. ఎక్కడా రాజకీయ సంక్షోభం గురించి కానీ, స్కైలైన్ సంస్థ పతనం గురించి కానీ, ఫ్లై ఓవర్ ప్రమాదం జరిగినట్లు కానీ లేదు. అతను అంతిమ నిర్ణయానికి వచ్చాడు. తనకి వచ్చిందంతా కలే!

ఇంతలో సుమ లోపలకు వచ్చింది. అప్పుడే తలస్నానం చేసినట్లు ఉంది. తలకు టవల్ చుట్టుకుంది.

"లేవండి, లేవండి.. ఈ రోజు మీ సినిమా రిలీజ్. నేను గుడికి వెళ్ళాలి"

అతను మంచం దిగి బాత్‌రూమ్ వైపు నడుస్తుంటే పేపర్లో నుండి ఒక కరపత్రం జారి పడింది. అది ఎవరు ప్రచురించారో దాని మీద లేదు.

కానీ ఆ కరప్రతం మీద ఇలా రాసి ఉంది. భగవంతుడు ప్రతి మనిషికీ తెలివి ఇచ్చాడు- ఏ విషయాలు అతను మార్చలేడో తెలుసుకోవటానికి.

ప్రతి మనిషికీ ధైర్యాన్ని ఇచ్చాడు-
మార్చగలిగే విషయాలు మార్చటానికి.
ప్రతి మనిషికీ విచక్షణ ఇచ్చాడు-
పై రెంటికీ తేడా తెలుసుకోవటానికి.

అయితే మనమందరం మొదటి రెండు వాక్యాల్లో ఏదో ఒకదాని దగ్గర ఆగిపోతున్నాం.. మూడోవాక్యం దాకా వెళ్ళి జ్ఞానం సంపాదించిన వాడికి కానీ అర్థం కాదు.. తనెంత మూర్ఖుడో!

అది చదివిన ఆదిత్యకి మళ్ళీ అనుమానమొచ్చింది తనకి వచ్చింది కలేనా? అని.

"నేనూ వస్తాను" తయారవుతున్న సుమని చూసి అన్నాడు ఆదిత్య.

"ఎక్కడికి? "

"నువ్వు వెళ్తున్న చోటుకి"

"మీరు.. గుడికి వస్తారా? " ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

అతనేమీ మాట్లాడలేదు. తయారై సుమతో కలిసి గుడి దగ్గరకు వెళ్ళాడు. జనం ఎక్కువగా ఉండటంతో ఆదిత్య కారు దిగలేదు.

"రండి, లోపలకు వెళ్దాం" అంది సుమ.

"వద్దు. నేను ఇక్కడే ఉంటాను"

మరేమీ వాదించకుండా సుమ ఒక్కతే గుడిలోకి వెళ్ళింది.

కారు అద్దాల నుండి బయటకు చూశాడు ఆదిత్య.

గుడి మెట్ల మీద అదే బిచ్చగాడు. తను కలలో ఎవరి జీవితాన్ని మారుద్దామని ప్రయత్నించాడో అతనే ఈ బిచ్చగాడు.

కాస్త పక్కకి చూసిన ఆదిత్యకి గుడి ఆవరణలోని ఒక హోర్డింగ్ మీద రాసిన వాక్యాలు కనిపించాయి.

నీవు వేటినైతే పొందావో వాటిని ఇక్కడ నుండే పొందావు.

ఏవైతే ఇచ్చావో వాటిని ఇక్కడే ఇచ్చావు.

నేడు నీవు స్వంతం అనుకున్నది నిన్న ఇంకొకరిది.

రేపు మరొకరిది...

ఆ వాక్యాలు చదివిన ఆదిత్యకి బుర్రలో లైటు వెలిగినట్లయింది.

బిచ్చగాడికి సాయం చెయ్యటానికి భగవంతుడే కావాలా? తను చాలడూ! అదేనేమో ఆ భగవంతుడు తనకు చెప్పదలచుకుంది! ప్రతిఒక్కరూ అడిగేవాళ్ళే అయితే ఆయన మాత్రం ఎక్కడి నుండి తెస్తాడు? ఆయన్ని ఫలానాది కావాలని అడిగే ముందు మనమెరెవరికైనా ఏమి ఇస్తున్నామని ఎప్పుడైనా ఆలోచించామా?

అసలు సాయమంటే ఏమిటి? కేవలం డబ్బు ఇవ్వటమేనా? ఆ బిచ్చగాడికి లక్ష రూపాయలు ఇవ్వటం వలన అతని పరిస్థితి అధ్వాన్నమయి ప్రాణాలకే ప్రమాదం ఎలా కలగవచ్చో కళ్ళకు కట్టినట్లు సహదేవుడు చూపించాడు కదా! ఆలోచిస్తోంటే సాయం చేసే మార్గం అది కాదనిపిస్తోంది. ఆ బిచ్చగాడి పరిస్థితి మారేవరకు తనే మార్గదర్శనం చేయాలి. చేయి పట్టుకుని నడిపించాలి.

అలా చేద్దామంటే మరో సమస్య ఉంది. అలా ఎంత మందికి చేయగలననే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. అందరికీ తనే చేయలేకపోవచ్చు కానీ ఒకడితో మొదలు పెట్టలేడా? దేనిని మార్చగలమో, దేనిని మార్చలేమో తెలుసుకునే విచక్షణ అంటే ఇదేనేమో!

ఆదిత్యకి ఒక్కసారిగా తృప్తిగా అనిపించింది. ఇన్నాళ్ళూ తను ఆ బిచ్చగాడికి సాయం చెయ్యంది వనరులు లేక కాదు, మనసు లేక. మనం దేవుణ్ని ప్రార్థించవలసింది ఎదుటి మనిషి కంటే ఎక్కువ సంపదనివ్వమని కాదు. ఎదుటి మనిషికి సాయపడే మనసివ్వమనీ...

ఇంతలో అతనికి తనకి కథ చెప్పిన దర్శకుడు గుర్తుకు వచ్చాడు.

ఎందుకు వద్దన్నాడు తనా ప్రాజెక్ట్.

నిజంగా తను బిచ్చగాడి వేషం వేస్తే అభిమానులు బాధ పడతారా? ఇష్టమయితే, నచ్చితే... చూస్తారు. లేకపోతే లేదు. అంతే తప్ప ఇలాంటి విషయాలను పట్టించుకుని బాధపడే తీరిక ఎవరికి ఉంది? ఒకవేళ ఉన్నా అలాంటి వారిని ప్రోత్సహించవచ్చా?

మరి తనెందుకు వద్దన్నాడు!

బిచ్చగాడు అంటే తేలిక భావం కదూ! ఆ వేషమే వెయ్యలేనంత అహం తనలో పేరుకుపోబట్టి కదూ!

వెంటనే ఫోన్ తీసి తనకు కథ చెప్పిన దర్శకుడికి రింగ్ చేశాడు - తను అభిప్రాయం మార్చుకున్నానని చెప్పటానికి. ©

# కనపడుటలేదు

- పార్థసారథి చిరువోలు



'నా పెంపుడు పిల్లికి ముద్దుగా నేను పెట్టుకున్న పేరు మున్నీ. గత రెండు నెలలుగా కనిపించటం లేదు. గోధుమ రంగులో.. పైన నల్ల చారలు.. పేరుతో పిలవగానే చటుక్కున వెనక్కి తిరిగి చూస్తుంది. వెతికి తెచ్చిన వారికి మంచి బహుమతి.. నగదు అక్షరాలా రూ. 50 వేలు'

ఆ రోజు దినపత్రికలో వచ్చిన ఆ ప్రకటన నన్ను ఆశ్చర్యపరిచింది. పిల్లికోసం ఇంత వెచ్చించటమా? కానీ ఇంతకు ముందెప్పుడూ ఇలాంటివి చదవలేదు. కొత్తగా అనిపించింది. ప్రకటన ఇచ్చిన వ్యక్తి కేవలం ఫోన్ నెంబర్ మాత్రమే పేర్కొన్నారు. అందులో చిరునామా లాంటిదేమీ లేదు.

ఆసక్తిగా ఫోన్ చేశాను. నన్ను నేను పరిచయం చేసుకుంటూ 'మీకెంత అనుబంధం లేకపోతే ఇలాంటి ప్రకటన ఇస్తారు' అన్నాను.

అవతల వ్యక్తి బదులుగా చిరునవ్వు నవ్వారు.

'మీకు పిల్లి లభ్యమైతే ఆ సంగతి నాకు తెలియజేయండి. ఆసక్తికరమైన ఈ అంశం గురించి పత్రికలో రాస్తాను' మళ్ళీ చెప్పాను.

దానికీ అవతల వ్యక్తినుంచి నవ్వే సమాధానం.

'నేను సీరియస్‌గా చెబుతున్నాను. మీ గురించి పాఠకలోకానికి తెలియచేస్తాను. నా వృత్తిలో భాగంగా..' అనటంతోనే ఆయన స్పందించారు.

'మాస్టారూ! నా వయస్సు 72. నా పిల్లలు, మనవలు, మనవరాళ్ళ సహా అంతా అమెరికాలో ఉంటున్నారు'

ఫోన్‌లో ఆయన చెబుతుంటే స్క్రిబ్లింగ్ పాడ్ పైన వివరాలు నమోదు చేసుకోసాగాను.

'ఒంటరివాడిని.. ఏదో కాలక్షేపం కోసం...'

'అంటే...? ' అర్థంకాక అడిగాను.

'మరేం లేదు. ఈ ప్రకటన రెండు మూడు వారాలుగా ఇస్తూ వస్తున్నాను. రోజూ నాకు డజన్లకొద్దీ ఫోన్లు వస్తున్నాయి. పలకరిస్తూ.. పరిచయం చేసుకుంటూ... రకరకాల కబుర్లు

## చతుర కతలు

చెబుతూ ఎందరో అపరిచితులు.. ఈ రకంగా నాకు ఒంటరితనం నుంచి విముక్తి లభిస్తోంది'

ఆయన చెప్పుకుపోతున్నారు.

'డబ్బుకి పెద్ద సమస్య లేదు. తోడు లేకపోవటమే నాకు పెద్దలోటు. అందుకే...'

నాకు విషయం అర్థమైంది.

'మీరు పత్రికా విలేకరని చెప్పారు కనకే... అసలు విషయం బయటపెట్టాను' అన్నారు ఆయన ముక్తాయింపుగా.



# విజేత

- డి.వి. రమణమూర్తి

"ఆఫీస్‌కి రెండు గంటలు పర్మిషన్ ఇచ్చేరు గదటే. పదవే.. ఈ వేళైనా పెందరాళే ఇంటికి పోదాం" అంది సుజాత.

"పర్మిషన్ ఇచ్చింది ఇంటికెళ్ళడానికి కాదు. మన ఆఫీసు రిక్రియేషన్‌క్లబ్ నిర్వహిస్తున్న ఆటల పోటీలు చూడ్డానికి" అంది సుచిత్ర.

"బోర్.. మనకెందుకులేవే!" అన్న సుజాతతో, "ఒక ఇంటరెస్టింగ్ ఈవెంట్ ఉంది.. అది చూసేసి వెళ్లిపోదాం" అంది సుచిత్ర.

"ఏంటబ్బా.. అంత ఇంటరెస్టింగ్ ఈవెంట్? " అంది సుజాత.

"మన ఆఫీస్ స్టోర్సు ఇన్‌ఛార్జి అయిదు పదుల నరసింహంగారు ఈవేళ నూరు మీటర్ల పరుగుపందెంలో పాతికేళ్ళ కుర్రాళ్ళతో పోటీపడుతున్నారు" అంది సుచిత్ర ఆసక్తిగా.

"నీకేమైనా పిచ్చా! ఆ ముసలాయన ఈ పరుగుపందెంలో పాల్గొనడమా? " అంది నమ్మలేనట్టుగా.

"అందుకే కదా.. ఆ యాభైఏళ్ళ నరసింహంగారి పరుగు చూద్దామనేగా నా కుతూహలం"

"సరే, నీ ఇష్టం. ఆ ఈవెంటు అయిపోగానే బయలుదేరాలి" అంది సుజాత.

"ప్రామిస్" అంది సుచిత్ర.

★ ★ ★

క్రీడా మైదానంలో వ్యాఖ్యాత ప్రకటన ప్రారంభించేడు.

"చూడండీ! చూసి ఆనందించండి! ఇంకాస్సేపట్లో నూరుమీటర్ల పరుగుపందెం ప్రారంభం కాబోతోంది. మన స్టోర్సు ఇన్‌చార్జి యాభైఏళ్ళ నరసింహంగారు ఈవేళ పాతికేళ్ళ యువకులతో ఈ పరుగుపందెంలో పాల్గొంటున్నారు. వారీమధ్యే తాతగారిహోదా పొందడం గమనార్హం"

అక్కడున్న ప్రేక్షకుల్లో ఆసక్తి, ఉత్సుకత! సన్నగా నవ్వుకున్నారు. కరతాళ ధ్వనులు చేసారు. కొంతమంది ఈలలు వేసి తమ ప్రోత్సాహాన్ని వ్యక్తపరిచారు. పోటీదారులైన మధు, రాజు, మూర్తి, జాన్, లతీఫ్, నరసింహంగార్లను వ్యాఖ్యాత పరిచయం చేసాడు. నరసింహంగారు అంపైర్ విజిల్ కోసం ఉత్కంఠగా చూస్తున్నారు.

"బట్టతల, నెరుస్తున్న మీసకట్టు, బిగించి కట్టిన పంచె స్లీవ్‌లెస్ బనియన్‌తో ఉన్న పెద్దాయనే నరసింహంగారు" చెప్పేడు వ్యాఖ్యాత.

అంపైర్ విజిల్ వేసేందుకు సిద్ధంగా ఉన్నాడు. పరుగులంకించుకోడానికి ఆత్మవిశ్వాసంతో చూస్తున్నారు నరసింహంగారు.

'ముసలాయనకు ఈ వయసులో పరుగులేంటి? కాలో చెయ్యో విరిగితే మూల కూర్చోవాల్సిందే' అనుకున్నాడు పోటీదారు మధు.

'వెధవ కక్కుర్తి! ప్రైజు కొట్టేసి ఆ వచ్చిన వెండి

కప్పు కరిగించేసి మనవరాలికి మువ్వలపట్టీలు చేయిద్దామనుకుంటున్నాడేమో ముసలాయన' అనుకున్నాడు పోటీదారుల్లో మరొకడైన జాన్.

"ఈ ముసలాయనకిదేం పిచ్చే! అతనేం పరుగెత్తగలడే? " అంది సుచిత్ర.

"అదే తమాషా! తినబోతూ రుచులు అడగడమెందుకే? " అంది సుజాత.

విజిల్ మోగింది. పరుగు ప్రారంభమైంది. పోటీదారులు శరవేగంగా పరుగెడుతున్నారు. ప్రేక్షకుల్లో కోలాహలం.

"చూశావా! ముసలాయన వెనుకపడ్డాడు" అంది సుచిత్ర.

"ఇదుగో ఇప్పుడు చూడవే వాళ్ళలో కలిసిపోయేడు" అంది సుజాత ఉత్సాహంగా.

ప్రేక్షకుల్లో మెజారిటీ నరసింహంగారినే ప్రోత్సహిస్తున్నారు. "నరసింహంగారూ.. పరుగెత్తాలీ" అంటూ కేకలు, ఈలలు, చప్పట్లతో మార్మోగిపోతుంది క్రీడామైదానం.

"దాటేసారే.. అయిదుగుర్నీ దాటేసారు" అంటూ అరిచింది సుజాత చిన్న పిల్లలా చప్పట్లు చరుస్తూ!

"అదుగో.. ఆయనే వచ్చారు ఫస్ట్" అంది సుజాత ఆనందంగా.

నరసింహం విజయానికి ప్రేక్షకుల్లో ఆశ్చర్యపోని వ్యక్తిలేరు. ఓడిపోయిన అయిదుగురు యువకులూ ఆయనను అభినందించేరు.

★ ★ ★

ఆ మర్నాడు ఆఫీసులో వార్షికోత్సవం, బహుమతి ప్రధాన సభ. ముఖ్య అతిథుల, అధ్యక్షుల ఉపన్యాసాలు, నివేదికల సమర్పణ ముగిసాయి. ఆటల పోటీల్లో విజేతలకు బహుమతి ప్రదానం ప్రారంభమైంది. ఆటల్లో పాల్గొన్న విజేతలను పేరుపేరునా కార్యదర్శి పిలుస్తున్నాడు. ముఖ్య అతిథి బహుమతులు అందజేస్తున్నారు.

చివరగా నూరు మీటర్ల పరుగు పందెంలో మొదటి బహుమతి విజేతగా నరసింహంగారిని పిలిచేరు. ప్రేక్షకుల్లో కరతాళధ్వనులు మోగటం ప్రారంభించేయి. నరసింహంగారు కళ్ళజోడు సరవరించుకుని, కండువా సర్దుకుని బహుమతిని స్వీకరించడానికి వేదిక దగ్గరికొస్తున్నారు.

ఆయన్ని చూసిన ముఖ్యఅతిథిగారికి అనుమానం వచ్చి "విజేత రాలేదా! ఈయనెవరో పెద్ద మనిషి వస్తున్నారు" అన్నారు కార్యదర్శితో మెల్లగా.

"విజేత ఆయనే" అన్నాడు చిరునవ్వుతో.

యాభైఏళ్ళ నరసింహంగారు బహుమతి తీసుకుంటుంటే సభ చప్పట్లతో మారు మోగింది. ముఖ్యఅతిథి మాట్లాడుతూ "ఈ వయస్సులో యువకులతో పోటీపడి విజయాన్ని సాధించిన రహస్యాన్ని బయటపెట్టి యువతరం ఉజ్వల భవిష్యత్తుకి నరసింహంగారు తోడ్పడతారని ఆశిస్తున్నాను" అన్నారు.

వారి ఆదేశానికి సమాధానంగా నరసింహంగారు తన విజయం వెనుక రహస్యాన్ని చెప్పడం ప్రారంభించేరు.

"నేను వయస్సులో ఉన్నప్పుడు కొన్ని బహుమతులు వచ్చేయి. అదంతా గతం.

ఇక వర్తమానంలోకి వస్తే దేశంలో ఇంచుమించు అన్ని ప్రధాన నగరాల్లో పనిచేసాను. అక్కడెక్కడా నా పరుగును ప్రాక్టీసు చేసే అవకాశం దొరకలేదు. ఈ మహానగరానికి వచ్చాకే పరుగెత్తాల్సిన అవసరం కలిగింది. ఆ అవసరాన్ని అవకాశంగా తీసుకొని మళ్ళీ రన్నింగ్ ప్రాక్టీసు చేసాను. అలాగని నేనేదో ఉదయం పార్కుల చుట్టూ పరుగెత్తి ప్రాక్టీసు చేసాననుకునేరు. నా సాధనంతా నిత్యజీవన దినచర్యలో భాగంగా సాగింది. అదెలా జరిగిందంటారేమో? ఆ పాయింటుకే వస్తున్నా..

ఈ మహానగరంలో బస్టాప్‌లో ఆగకుండా, స్టాపుకి ఓ రెండు ఫర్లాంగులు ముందో, వెనుకో ఆగే సిటీ బస్సులకోసం, అది దాటిపోతుందేమో అనే భయంతో, దాన్ని ఎలాగైనా అందుకోవాలనే ఆత్రుతతో పరుగెత్తాల్సి వచ్చేది.

అలా పరుగెత్తేటప్పుడు నాకున్నంత వేగం ఎప్పుడూ, ఎవరికీ ఉండదు. ఆ విధంగా నా పరుగులో వేగం, గుండెల్లో దమ్ము, శరీరంలో శక్తి పెరిగాయి. దాని ఫలితంగానే నేడు విజేతను కాగలిగాను" సభ ఘొల్లుమని నవ్వింది. కరతాళధ్వనులు మోగాయి.

"అంతేకాదు, యువకులకో సలహా. ఈ రకమైన సదవకాశం మన దేశపు మహా నగరాలలో మరెక్కడా దొరకదు. కాబట్టి దీనిని సద్వినియోగం చేసుకుని ప్రజలకోసం ఆగని సిటీబస్సుల వెనక పరుగులు తీసి, మీ పరుగులో వేగాన్ని, పెంపొందించుకుని, రాష్ట్ర, జాతీయ స్థాయిలో పరుగు పందెపు స్థాయిని పెంచుకొని, అంతర్జాతీయ స్థాయిని అందుకుని విజేతలు కాగలరని ఆశిస్తూ.. సెలవు తీసుకుంటున్నాను" అంటూ నమస్కరించేరు.

కరతాళధ్వనులు మళ్ళీ మారు మోగాయి. ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
అవధాన సరస్వతి
డా. మేడసాని మోహన్
సమాధానాలు

ప్ర. అగ్నిప్రమాదం జరిగినపుడు 'పరశురామ ప్రీతి' అంటారెందుకు?

**– పి. శకుంతల, గాజువాక**

**జ.** పరశురాముడు ఇరవై ఒక్కసార్లు దుర్మార్గులైన రాజులను చంపి, వారి అవశేషాలు కూడా మిగులకుండా నిర్మూలించాడు. అంటే ఆయన కోపాగ్నికి శత్రురాజులు భస్మీపటలమైపోయారు. దాంతో అగ్నిప్రమాదం జరిగినప్పుడు సర్వం భస్మమైపోతే 'పరశురామ ప్రీతి'యైనట్లుగా భావించడం పరిపాటిగా వచ్చింది. ప్రాచీనకాలంలో ఒక రాజు దండెత్తి, ఆ శత్రురాజును చంపి, వారి సైన్యాన్ని కూడా నిర్మూలించిన తరువాత యుద్ధ భూమిలో ఎక్కడా ఏమీ మిగులకుండా అగ్ని రగిల్చి కాల్చివేసేవారు.

ప్ర. చనిపోయిన వ్యక్తి తలదగ్గర దీపం పెడతారెందుకు? మృతదేహం ఉన్న ఇంటి ముందు కట్టెలకు నిప్పంటించి పెడతారెందుకు?

**– జి. ప్రభాకర్ రావు, హైదరాబాద్**

**జ.** భారతీయ సంస్కృతి చాలా ప్రాచీనమైంది. మన ఆచారాల్లో దీపం, అగ్ని- ప్రధాన పాత్ర వహిస్తాయి. జీవుని శరీరం నుండి ప్రాణవాయువులు పరిత్యజింపబడినప్పుడు అవి శిరోభాగంలోని బ్రహ్మరంధ్రం ద్వారా అనంతవాయువులో కలిసినట్లు భావించడం మన ఆచారం. అలా విముక్తమైన ప్రాణవాయువులు వెలుగులోనే ప్రస్థానం సాగించాలని తల దగ్గర దీపం పెడతారు. జీవుని పుట్టుకకు, పంచభూతాలకు ఏవిధంగా అనుబంధం ఉంటుందో, అలాగే జీవుని మరణానికి, పంచభూతాలకు కూడా అనుబంధం ఉంది. ఆ అనుబంధానికి చిహ్నంగానే ఇంటి ముందు కట్టెలకు నిప్పంటించడం. మన ఆచారాలన్నీ ప్రకృతితో మనకున్న అనుబంధానికి సంకేతాత్మకాలే.

ప్ర. ఉపనయనం జరిగిన వటువు త్రిసంధ్యల్లో 'గాయత్రి'ని ముద్రలతో అర్చించాలన్నారు. నేటి స్పీడ్ జీవనంలో కుదరనివారికి ప్రత్యామ్నాయ విధానాన్ని వివరించగలరు? గాయత్రి మంత్రాన్ని సూర్యోదయానికి ముందు పఠించకూడదంటారు. ఎందువల్ల?

**– పి. శైలజ, నవులూరు**
**– కన్నెపల్లి నారాయణమూర్తి, మంగువారితోట**

**జ.** ఉపనయనం జరిగిన వటువు త్రిసంధ్యల్లో గాయత్రిని ముద్రలతో అర్చించడం శాస్త్రం విధించిన నియమం. వేగవంతమైన నేటి జీవన విధానానికి ప్రత్యామ్నాయమైన ఏర్పాట్లు శాస్త్రం పేర్కొనలేదు. అలాంటి ప్రత్యామ్నాయం సూచించే సాధికారికమైన అర్హత గాయత్రీ ప్రబోధం చేసిన గురువుగారికే ఉంటుంది. గాయత్రీ మంత్రార్థంలో సూర్యోపాసనకు సంబంధించిన అంశాలు ఉన్నాయి. సూర్యోదయం తరువాత అనుసంధానం చేసుకోవడం సముచితం.

ప్ర. కల్కి అవతారం ఉందా? వివరించండి?

**– కొక్కెరగడ్డ శ్రీదేవి, మానేపల్లి**

**జ.** త్రేతాయుగాంతంలో పరశురామ, రామావతారాలు, ద్వాపరాంతంలో శ్రీకృష్ణావతారం ధరించిన శ్రీమన్నారాయణుడే కలియుగాంతంలో కల్కి అవతారం ధరించి ధర్మసంరక్షణం చేస్తాడని శ్రీమద్భాగవతం, ఇతర గ్రంథాలు ప్రతిపాదిస్తున్నాయి. కలి ప్రభావంతో పెరిగిపోతున్న పాపభారాన్ని హరించడానికి, ఆ పాపభారానికి కారకులైన దుష్టులను సంహరించడానికి భగవంతుడు కల్కి అవతారం ధరిస్తాడని వాఙ్మయం

పేర్కొంటూ ఉంది.

ప్ర. 'సోహం'ను నిర్వచించండి?

**– సురేందర్‌రావు నోముల,** హబ్సిగూడ

**జ.** సః + అహం = సోహం - అని, 'సోహం' పదంలో రెండు శబ్దాలు ఉన్నాయి. సః = అంటే సంస్కృతంలో 'అది' అని అర్థం. సః = అంటే సంస్కృతంలో ఈశ్వరుడు- అని కూడ అర్థం ఉంది. జీవునికి యోగస్థితి పరాకాష్ఠ వహించినప్పుడు తానే ఈశ్వరుడినన్న దివ్యభావం కలుగుతుంది. ఈ స్థితినే 'అహం బ్రహ్మాస్మి' - అనే మహావాక్యం కూడ విశదీకరిస్తూ ఉంది. అంటే జీవునకు అచంచలమైన తపస్సువల్లగాని, తపస్సుచే సంక్రమించిన యోగబలంతోగాని ఈ దివ్యమైన, అద్వైత భావన కలుగుతుంది. ఈ స్థితినే అన్నమాచార్యులవారు తన సంకీర్తనలలో ఒక చోట 'ఎదుట ఎవ్వరులేరు అంతా విష్ణుమయము' - అని పేర్కొంటారు.

ప్ర. గుడి ముందు గాలిగోపురం, ధ్వజస్తంభం ప్రాముఖ్యతేంటి? గర్భగుడి గోపురం కంటే గాలి గోపురం ఎత్తుగాను, ధ్వజస్తంభం మాత్రం కాస్త తక్కువ ఎత్తుగానూ ఉండాలంటారెందుకు?

**– వెల్మల రాంరెడ్డి,** కరీంనగర్

జ. ఆలయ నిర్మాణం వివిధ సంప్రదాయాలకు చెందిన ఆగమశాస్త్రాలలో పేర్కొన్నదానికి అనుగుణంగా జరుగుతుంది. గర్భగుడిలో వెలసిన అర్చామూర్తిని భూలోకంలోని భక్తులు, ఊర్ధ్వలోకాల్లోని దేవతలు కూడా సేవిస్తారు. ఆవిధంగా ఆకర్షించే లక్షణానికి ప్రతీకగా ఆకాశాన్ని చుంబించే శిఖరాలతో గాలిగోపురం శోభించాలి. పైగా గాలి గోపురంపై ఆయా అర్చామూర్తులకు సంబంధించిన పరివార దేవతామూర్తుల శిల్పాలు, జీవులకు సంబంధించిన కొన్ని యోగభావనామూర్తులను కూడా తగిన రీతిలో ప్రతిష్ఠించాలి. ధ్వజస్తంభం అన్నది ఆయా దేవాలయాలలోని అర్చామూర్తుల దుష్టశిక్షణ, శిష్టరక్షణ, లీలావిభూతి - ఇత్యాది అంశాలకు సంబంధించిన వైభవానికి ప్రతీక. ఈ రెండు నిర్మాణాలలోని ఎత్తులోని భేదాలలో తక్కువ ఎక్కువలు భావింప కూడదు.

ప్ర. 'చేసేది నేనే, చేయించేది నేనే' అని కృష్ణుడు గీతలో అన్నాడు కదా! మరి మనకు పాపాలు ఎలా అంటుతాయి? కర్మసిద్ధాంతం అంతరార్థం ఏమిటి?

**– మాధవిరాణి,** హైదరాబాద్

**జ.** 'చేసేది నేనే, చేయించేది నేనే'- అని కృష్ణుడు గీతలో పేర్కొన్నట్లే ఆయా జీవుల మంచిచెడులకు సంబంధించిన కర్మ ఫలానుభవం కూడా తానే అన్న అంశాన్ని కూడా అక్కడక్కడా చెప్పియున్నాడు. కర్మ ఫలానుభవాన్ని దృష్టిలో ఉంచుకొన్నప్పుడే కర్మ సిద్ధాంతంలోని అంతరార్థం స్పష్టంగా బోధపడుతుంది.

ప్ర. పూజామందిరంలో దేవుళ్ల కొత్తఫొటోలు ఉంచినపుడు పాతవానిని పెద్ద చెరువుల్లో, నదుల్లో వదిలివేయమన్నారు. చెరువులు, నదులు లేని ప్రాంతాలవారు ఏం చేయాలి?

**– చక్కిలాల విజయలక్ష్మి,** తిరుపతి

**జ.** పూజామందిరంలో దేవుళ్ల కొత్త చిత్రాలు ఉంచినప్పుడు పాతవానిని చెరువులు, నదుల్లో వేయడం పరిపాటి. చెరువులు, నదులు దగ్గరలో లేకుంటే ఒక సుదీర్ఘప్రయాణమైనా నిర్వహించి అలా చేయటం సముచితం. అంతవరకు మనచే భక్తిప్రపత్తులతో అర్చింపబడి, మనలను అనుగ్రహించిన దేవతామూర్తులను ఎక్కడ పడితే అక్కడ వేయలేం కదా!

ప్ర. ఆడవాళ్లు దేవునిదగ్గర, తులసికోట దగ్గర దీపం పెట్టినపుడు గంట వాయించవచ్చునా, లేదా తెలుపగలరు?

**– ఎమ్. వసంత,** బోరబండ

**జ.** ఆడవాళ్ళు దేవుని దగ్గర తులసికోట దగ్గర దీపాదికాలు నిర్వహించే సమయంలో గంట వాయించవచ్చు. అందులో సందేహించవలసిన అవసరం లేదు. ఇందుకు ప్రాచీనకాలంలో దృష్టాంతాలు కూడా ఉన్నాయి.

ప్ర. జ్ఞానం, భక్తి ఈ రెంటిలో ఏది ముఖ్యం?

**– రామకూరు లక్ష్మి,** శ్రీకాకుళం

**జ.** జ్ఞానం, భక్తి- రెండూ ముఖ్యమైనవే. ఎంత జ్ఞానం సముపార్జించినా భక్తి లేకపోతే అహంకారాది మనోవికారాలు ప్రబలమవుతాయి. అందుకే పెద్దలు భక్తిని జ్ఞానమాత అని పేర్కొన్నారు.

ప్ర. ఇంట్లో సాలిగ్రామం ఉంటే ఎంతో నియమం, నిష్ఠ పాటించాలంటారు కదా! అది ఎందుకు, ఆ నిష్ఠలు ఏమిటో తెలియజేయండి?

**– కోడుగంటి విజయలక్ష్మి,** హైదరాబాద్

**జ.** పూజామందిరంలో సాలిగ్రామాదులు ఉన్నప్పుడు తప్పక నియమ నిష్ఠలు పాటించాలి. ధూపదీప నివేదనాదులు క్రమం తప్పకుండా నిర్వహించడంతోపాటు మనోవాక్కాయ కర్మలతో పరిశుద్ధులై కైంకర్యాలు నిర్వహించడం మంచిది.

ప్ర. ఒడిశా కోణార్క్‌లో రామచండీగుడిలో

పచ్చి చేపలు, త్రినాథ మేళాలో గంజాయి నైవేద్యంగా పెడతారు. ఎంతవరకు సమంజసం?

**– ఇందిరా బోగెల**, రాయగడ్

**జ.** అస్సాంలోని ఒక శక్తి గుడిలో, ఇంకా మన దేశంలో అక్కడక్కడా మాంసాన్ని నివేదన చేయడం ప్రాచీనకాలం నుంచి వస్తున్న ఆచారమే. ఇది సమంజసమా? కాదా? - అని విచారించడం సముచితం కాదు. ప్రాచీన గ్రంథాలలో ఘంటాకర్ణుడనే భక్తుడు కృష్ణుడికి మాంస నివేదనం చేయడం, తిన్నడు శ్రీకాళహస్తీశ్వరునికి మాంసం తినిపించడం- వంటి ఐతిహ్యాలు ఉన్నాయి గదా! అయితే ఇటువంటి గాథలను ఆధారంగా చేసుకొని యథేచ్ఛగా మాంసాహారం తీసుకోవడం సముచితం కాదు.

**ప్ర.** శ్రీశైల శిఖర దర్శనం చేసి వస్తే పునర్జన్మ ఉండదంటారు. నిజమేనా?

**– యు. శైలజ**, మచిలీపట్నం

**జ.** 'శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే'- అని సంప్రదాయజ్ఞులైన పెద్దలు పేర్కొనడం పరమసత్యమే.

**ప్ర.** దేవాలయాల శిఖరం నీడ నివాస గృహాలపై పడితే తప్పా? ఆలయాల పక్కనే ఇండ్లు ఉండవచ్చా? కొన్ని గుళ్ల పక్కనే అర్చకులు నివసిస్తుంటారు కదా! వారికి దోషం వర్తించదా? కారణం తెలుపగలరు?

**– బచ్చు లక్ష్మి**, కొత్తగూడెం

**జ.** దేవాలయాదుల శిఖరాల నీడ గృహస్థుల ఇండ్లపై పడడం మంచిది కాదు. ఆలయాల పక్కనే ఇండ్లు ఉంటే ఇటువంటివి ఎదుర్కోక తప్పదు. అర్చక స్వాములు దేవాలయాలలోని అర్చామూర్తులకు నిత్య కైంకర్యాలు నిర్వహిస్తారు. కాబట్టి వారికి ఇటువంటి దోషాలు అంటవు.

**ప్ర.** బ్రహ్మోత్సవాల్లో గురుసేవకు ప్రాధాన్యత ఎందుకు?

**– నోరి శివప్రకాశం**, నెల్లూరు

**జ.** భారతీయ సంస్కృతిలోనే గురుసేవకు చాలా ప్రాధాన్యం ఉంది. సమస్త బ్రహ్మాండ భాండాలనూ పరిపాలనం చేసే శ్రీమన్నారాయణుడు కూడా సకల జీవులను సంస్కరించి, జ్ఞానయోగోన్ముఖులను చేసే గురుస్థానం వహించటానికి ఇష్టపడతాడని ఎందరో మహాకవులు, ఆచార్య పురుషులు పేర్కొన్నారు. 'తనంగ కపిలుడై, దత్తాత్రేయుడై, ఘనమైన మహిమను శ్రీవేంకటరాయడై-' అని అన్నమాచార్యులవారు ఈ అంశాన్ని ధ్రువీకరించారు. కాబట్టి ఏ ఉత్సవాలలోనైనా గురుసేవను ప్రధానంగా నిర్వహించడం మన సంప్రదాయం.

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

**ప్ర.** పుత్రమోహంతో పాండవులకు అష్టకష్టాలు కలిగించిన ధృతరాష్ట్రుడికి శ్రీకృష్ణుని విశ్వరూపం దర్శించే భాగ్యం ఎందుకు ప్రసాదించాడు ఆ నల్లనయ్య?

**– తటవర్తి రామలక్ష్మి**, తాళ్లగడ్డ

**జ.** శ్రీకృష్ణుని లీలావిభూతి అనంతం. ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహం అధికంగా కలిగినవాడైనా 'శరణంబు వేడెద, భవచ్చరణంబులు కనుగొనన్ ప్రసాదింపగదే!'- అని కృష్ణుణ్ణి ఆర్తితో అర్థించాడు. ఆ ఆర్తిని కృష్ణుడు మన్నించాడు. భగవానుడు చెడ్డవాళ్ళకు కూడా ఒక కనువిప్పు కలిగించాలని మంచి మంచి అవకాశాలిస్తుంటాడు. కనువిప్పు కలిగి భగవానుని లీలావిభూతిలోని ఆంతర్యాన్ని గ్రహించిన వారు చెడుదారి నుండి మంచిదారికి వస్తారు. కొందరు అలా రాలేక మళ్ళీ మాయలో పడుతుంటారు.

**ప్ర.** పరమపదించిన వారిని ఉత్తరం వైపే శిరస్సు ఉంచి ఎందుకు పడుకోబెడతారు? అదేవిధంగా పరమేశ్వరుడు కూడా విఘ్నేశ్వరుని బతికించడానికి ఉత్తరం వైపు తలపెట్టి పడుకున్న వారి తలనే ఎందుకు తీసుకురమ్మన్నారు?

**– బత్తుల శ్రీనివాసరావు**,
చంద్రాజుపాలెం, గుంటూరు జిల్లా

**జ.** 'ఉత్తరం'- అంటే ఉత్ అనే ఉపసర్గ, తరం- అనే పదంతో ఏర్పడిన శబ్దం. అంటే ఉత్కృష్టంగా తరింపజేయునది- అని అర్థం. లోకంలో సహజమైన అంశంగా కాకుండా ఏదైనా విలక్షణంగా ఉంటే 'లోకోత్తరం'గా ఉందని చెబుతుంటారు. పరమపదించినవారు తరించి ఉత్తమ లోకాలు పొందాలనే యోగభావనతోనే అలా శవాన్ని పడుకోబెడతారు. బతికి ఉండగా ఉత్తరంగా తల ఉంచి నిద్రించడం మరణించడంతో సమానమే- అని పూర్వుల భావన. విఘ్నేశ్వరుని బతికించడానికి అలా ఉత్తరాభిముఖంగా తల ఉంచి నిద్రిస్తూ ఉన్న ఏనుగు శిరస్సును ఖండించి తెచ్చినారన్నది ఐతిహ్యం. ©

# అభినందన చందనం!

## జంటపత్రికల అభిమానిని



ప్రారంభ సంచికల నుండి 'చతుర', 'విపుల' జంట పత్రికల అభిమానిని. ఏనాడూ చదవడం మానలేదు. అలా చదువుతూనే చతురకు నా చిన్నచిన్న అనుభవాలను హాస్యకథలుగా రాయడం మొదలుపెట్టాను. మొదటి కథ అచ్చయినపుడు నాకెంతో సంతోషంగా అనిపించింది. తర్వాత విపులకు కూడా కథ పంపి అదృష్టాన్ని పరీక్షించుకున్నాను. అది కూడా అచ్చయిన రోజున నా ఆనందం వర్ణనాతీతం. అప్పటికే మిగిలిన వార, మాస పత్రికలలో నా కథలు వచ్చినా చతుర విపులల స్థాయి వేరు. అప్పట్లో చలసాని ప్రసాదరావుగారు ఎడిటర్‌గా ఉండేవారు. నవల రాయడానికి కొన్ని టిప్స్ తెలుసుకోవాలని వారి ఇంటికి వెళ్లాను. మీ సలహా కోరి వచ్చానని చెప్పాను. అపుడు ఆయన నన్ను ప్రోత్సహిస్తూ చాలా విషయాలు తెలియజేశారు. ఆయన చెప్పిన అంశాలను దృష్టిలో పెట్టుకుని నవల రాయడం మొదలుపెట్టాను. అప్పటికే మా పిల్లలు అమెరికాలో ఉన్నందువలన అక్కడి విశేషాలను తెలియజేస్తూ రాసిన ఆ నవల చతురలో అచ్చయింది. అదే నా మొదటి నవల 'ఆలంబన'. అలా రెండేళ్లలో నా మూడు నవలలు చతురలో వచ్చాయి. ఆ తర్వాత వివిధ పత్రికలలో వ్యాసాలు రాశాను. అయితే మొదట్లో నాకు అవకాశం ఇచ్చింది మాత్రం చతుర విపుల పత్రికలే!

– అన్నపూర్ణ. ఎ, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్

## పాఠకులకు ప్రపంచంతో అనుసంధానం!

మూడున్నర దశాబ్దాల చతుర విపుల ఘనతను మాటల్లో చెప్పడం సాధ్యం కాదు. చక్కని నవలల ఎంపికలో ఏ పత్రికలూ చతురకు సాటి రావు. సంప్రదాయాన్ని, సమకాలీనతను, ఆధునికతను ఇనుమడించుకున్న నవలలు, కథలు ఈ పత్రికల్లో రావడం విశేషం. అలాగే ఈ పత్రికలు ప్రపంచాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నాయి. వీటి ప్రస్థానం మున్ముందు ఇంతకంటే గొప్పగా సాగాలని కోరుకుంటూ ధన్యవాదాలు!

– ముమ్మిళ్ల వందన,
హన్మకొండ

## గొప్ప ఆశయం!

గత ముప్పైఐదు సంవత్సరాలుగా 'చతుర', 'విపుల' నా అభిమాన పత్రికలు. విదేశాలలో ఉన్నపుడు కూడా ఇంటర్‌నెట్‌లో చదివేవాడిని. చతుర ద్వారా విభిన్న కథనాలతో ప్రతినెల ఒక చక్కటి నవల అందిస్తున్నారు.

ప్రపంచ దేశాల సంస్కృతులు, ఆచార వ్యవహారాలు విపుల ద్వారా విశదీకరిస్తున్నారు. అతిసామాన్య పాఠకుడు కూడా కొని చదివేందుకు వీలుగా కేవలం పన్నెండు రూపాయలకు అందించగల మీ ఆశయం గొప్పది!

– ఎన్. దేవేంద్రప్రసాద్,
యూసఫ్‌గూడ, హైదరాబాద్

అన్నీ సరైన సమాధానాలు రాసిన
వారిలో డ్రా ద్వారా ఎంపికైన
ఈ విజేతకు రూ.150/–
త్వరలోనే అందుతాయి.

**బి. సూర్యనారాయణ మూర్తి**
ఇంటి. నెం. 70-3-34/2,
రోడ్‌నెం-2, వైద్యనగర్-1,
రమణయ్యపేట,
కాకినాడ - 533005

## చతురంగం - 29 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వ | 2 న | ము | | 3 క్షీ | 4 ర | 5 సా | 6 గ | రం | |
| 7 మ | ధి | | 8 తృ | ణ | కం | క | ణం | | 9 భా |
| నం | | 10 గు | ణ | ము | | డం | | 11 బా | ల |
| | 12 గు | లా | ము | | 13 గం | | 14 రం | సు | భా |
| 15 జీ | లే | బీ | | 16 చై | త | 17 న్యం | గా | | ర |
| | బ | | 18 చి | త్ర | | మ | | 19 మ | తం |
| 20 శ్రీ | కా | 21 రం | | 22 మా | ద్రి | | 23 మే | ను | |
| | 24 వ | న | 25 వా` | సం | | 26 పాం | డ | వు | 27 లు |
| 28 తా | ళి | | న | | 29 లం | చా | లు | | ప్త |
| డు | | 30 త | రం | గం | | లి | | 31 మే | ము |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. బచ్చు సత్యనారాయణ, కొత్త గూడెం, 2. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 3. పి. దేవసేనమ్మ, హైదరా బాద్, 4. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 5. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 6. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరా బాద్, 7. గౌతమి శిష్టా, హబ్సిగూడ, 8. కె. ప్రమీల, హైదరాబాద్, 9. తిప్పావఝుల వెంకట నారాయణ, మల్కాజిగిరి, 10. సి. జనార్ధన సింగ్, నల్లకుంట, 11. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, హైదరాబాద్, 12. ఆలూరి పార్థసారథి, చెన్నై, 13. మడపు శర్వాణి, హైదరాబాద్, 14. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, రంగారెడ్డి జిల్లా, 15. సరస్వతి. కె, తిరుపతి, 16. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 17. మహమ్మద్ ఖాసిం, ఖమ్మం, 18. డి. సుధాదేవి, సీతారాంబాగ్, హైదరా బాద్, 19. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 20. కె. భానుమతీదేవి, వనస్థలి పురం, హైదరాబాద్, 21. ఎస్. మణిమేగలై, తిరుపతి, 22. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయన గరం జిల్లా, 23. కృష్ణకుమారి దైతా, హైదరాబాద్, 24. పక్కి సుందరీకృష్ణ, గరివిడి, 25. టి. నవీన, విజయవాడ, 26. గరికిపాటి రాజాదత్తాత్రేయసూర్య, కాకినాడ, 27. ఎల్. చంద్రకళ, నూజి వీడు, 28. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 29. ఇందన మల్లికార్జున్‌రావు, తంగెళ్ల మూడి, ఏలూరు, 30. పి. రాజగోపాల్ రావు, నెల్లూరు, 31. అనంతుల సుబ్బారావు, బ్రాడీపేట, గుంటూరు, 32. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 33. ధరణి పద్మాసన, హైదరాబాద్, 34. కె.వి.జె. దాస్, సికింద్రాబాద్, 35. యం.వి.యన్ ధనలక్ష్మి, నరసాపురం, ప.గో. జిల్లా, 36. టి. సుజాతా వేణుగోపాల్‌రావు, సంగారెడ్డి, మెదక్ జిల్లా, 37. యం. చక్రధర్, హన్మకొండ, 38. లక్ష్మణరావు మంచాళ, విశాఖపట్నం 39. వెలసిరి రమాదేవి, నల్గొండ, 40. శ్రీదేవి పప్పు, అమ లాపురం, 41. డా. శివభూషణం, కర్నూలు, 42. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 43. ఎన్. ప్రేమ లత, ప్రగతినగర్, హైదరాబాద్, 44. పి.వి. రంగాచార్యులు, హైదరాబాద్, 45 పి. ఉదయశ్రీ, హయత్‌నగర్, హైదరాబాద్, 46. తోటపల్లి ప్రదీప్, గుంతకల్లు, 47. గుడిపాటి కనకదుర్గ, బాపట్ల, 48. రామకూరు లక్ష్మి, గుజరాతీపేట, శ్రీకాకుళం, 49. కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో. జిల్లా, 50. సి. హెచ్. వి. కృష్ణమాచార్యులు, సైనిక్‌పురి, 51. ఆర్. భవ్య, ఎమ్మిగనూరు, 52. ఎస్. నాగశ్వేత, బెంగళూరు, 53. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 54. గెడ్డం రామస్వామి, వీర వరం, తూ.గో. జిల్లా, 55. వి. సత్యకామేశ్వరి, చంచల్‌గూడ, 56. వి. రమాదేవి, బెంగళూరు, 57. గేదెల రామారావు, ఏలూరు, 58. కోనే నాగవెంకట ఆంజనేయులు, విశాఖపట్నం, 59. తట వర్తి రామలక్ష్మి, తాళ్లగడ్డ, 60. హృదయ, బెంగళూరు, 61. ఎమ్. అరుణరేఖ, ఎల్బీనగర్, 62. ఎమ్. పునీత్ భరద్వాజ్, ఎల్బీనగర్, 63. కె. వాణీ సుజాత, బ్రాడీపేట, గుంటూరు, 64. శివ లెంక చంద్రశేఖర్, మెహదీపట్నం, 65. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, 66. టి. సత్యనారా యణమూర్తి, ఖమ్మం, 67. అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, 68. వై. వెంకటరెడ్డి, మేడారం, 69. బి.వి. నరసింహారావు, చీరాల, 70. అనిల రేణు, తార్నాక,

*(తరువాయి 128 లో..)*

# చతురంగం - 30 ఆధారాలు

## అడ్డం

1. మార్పిడిని ఇలా కూడా అంటారు (3)
3. భార్య (2)
4. కథలన్నీ చేరేది ఎక్కడికి? (3)
6. రమారమి (3)
7. ద్రౌపదికి ఐదుగురు - - - (3)
8. 'వాడుతాడు' వ్యతిరేకం (3)
10. బ్రహ్మరాత ఇక్కడే రాస్తాడంటారు (3)
12. చేయి (2)
15. బ్రహ్మదేవుడికెన్ని ముఖాలు? (3)
16. ------ పుణ్యపురుషులు వేరయా (5)
18. పురుషార్థాల్లో మూడోది (2)
19. తెలుగు వ్యాకరణంలో 'ఆ, ఈ, ఏ'లను ఇలా అంటారు (2)
20. పాటలు పాడేవాడు (4)
23. సరస్వతీదేవి చేతిలో వాద్యం (2)
24. గుండెకు ఉండే తలుపు (3)
26. -- బలీయం (2)
28. తగాదా (4)
29. దండ (2)
30. మేనక, విశ్వామిత్రుల కుమార్తె (4)
32. 'వెన్నెముక' సగమైంది (2)
33. గోదావరి పుట్టిన చోటు నాసికా ---- (4)
34. పట్టుదల (3)

## నిలువు

1. 'జగదేకవీరుడు అతిలోకసుందరి' చిత్రంలో శ్రీదేవి చిరంజీవిని ఇలా పిలుస్తుంది (3)
2. శ్రీకృష్ణుని మేనమామ (3)
3. --- సొమ్ము పాము వంటిది (3)
4. కిస్తీ, వాయిదా (2)
5. ఆకుపచ్చని రెక్కలు, ఎర్రటి ముక్కులు గల పక్షులు (4)
7. ఫొటో, వస్త్రం (2)
9. శివుడు తాండవం చేస్తూ వాయించే వాద్యం, నాగార్జున, అనుష్కల సినిమా (4)
11. మిగులు, ప్రయోజనం (2)
13. ఇంద్రధనుస్సులో ఏడు --- (3)
14. ఇప్పుడు ఈ రాష్ట్ర ఏర్పాటు మీదే వివాదం జరుగుతోంది (4)
15. పేరు, ఊర్ధ్వపుండ్రం (2)
16. కుమార్తె (3)
17. శ్రీకృష్ణుని వంశం తిరగబడింది (2)
18. శ్మశానం (2)
21. కౌరవ, పాండవుల వంశం (2)
22. పెళ్లి (4)
23. మార్గం, పేట, వాడ, దశరూపకాల్లో ఒకటి (2)
24. స్వప్నం (2)
25. అడ్డు, నిరోధం... గడబిడ అయింది (4)
26. ప్రళయం (3)
27. ఆజ్ఞ, ఆదేశం (2)
28. బాధ (3)
29. ఔషధ గుళిక, ఛందస్సులో అక్షరాన్ని కొలిచేది (2)
30. క్రీస్తు, శాలివాహన వంటి సుప్రసిద్ధుల పేర్లతో చెప్పే కాలప్రమాణం (2)
31. తపస్సు (2)

( 127 తరువాయి )

71. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, 72. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, ప.గో. జిల్లా, 73. కె. సత్యనారాయణ, విశాఖపట్నం, 74. కొక్కెరగడ్డ కామశాస్త్రి, మానేపల్లి, తూ.గో. జిల్లా, 75. నేమాని దేవీసూర్యలక్ష్మి, అక్కయ్యపాలెం, విశాఖపట్నం, 76. నందూరి నాగేశ్వరరావు, బేగంపేట, హైదరాబాద్, 77. సి. నిర్మల, తిరుపతి, 78. జయశేషసాయి, సామర్లకోట, తూ.గో. జిల్లా 79. పొణుకుమాటి లీలాప్రవీణ, రెడ్డిగూడెం, కృష్ణాజిల్లా, 80. కె.ఇ. నిలమంగై, మల్కాజిగిరి, 81. వేగే రాజారావు, నరసరావుపేట, 82. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 83. వంకాయల చిరంజీవి, రాజమండ్రి, 84. ఎన్. జగన్మోహనరావు, కరీంనగర్, 85. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 86. అమ్ముపండు, టెక్కెమిట్ట, 87. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డెపల్లి, వరంగల్ జిల్లా, 88. తిరునగరి కేశవ దాసు, గుంటూరు.

# చతురంగం - 30

**రూ.150/- బహుమతి**

**గడువు తేది : సెప్టెంబరు 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | ■ | 4 | 5 | |
| | ■ | 6 | | | ■ | 7 | | | ■ |
| 8 | 9 | | ■ | 10 | 11 | | ■ | 12 | 13 |
| ■ | | ■ | 14 | ■ | | ■ | 15 | | |
| 16 | | | | 17 | ■ | 18 | | ■ | |
| 19 | | ■ | 20 | | 21 | | ■ | 22 | ■ |
| | ■ | 23 | | ■ | | ■ | 24 | | 25 |
| ■ | 26 | | ■ | 27 | ■ | 28 | | | |
| 29 | | ■ | 30 | | 31 | | ■ | 32 | |
| 33 | | | | ■ | 34 | | | ■ | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (    ) చిరునామా : ------------------------------

----------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

## ఆధారాలు

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. www.eenadu.net.

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## విద్య అవసరం!

విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్ ।
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మస్తతస్సుఖమ్ ॥

**భావం:** విద్య వల్ల వినయం, వినయం వల్ల యోగ్యత, యోగ్యత వల్ల ధనం, ధనం వల్ల ధర్మం, ధర్మం వల్ల సుఖం కల్గుతాయి.

## దండన - లాలన

లాలనే బహవో దోషాః తాడనే బహవో గుణాః
తస్మాత్ పుత్రం చ శిష్యం చ తాడయేత్ న తు లాలయేత్॥

**భావం:** లాలించడం వల్ల దోషం కలుగవచ్చు. దండించడం వల్ల ఓ వ్యక్తిలో మంచి గుణాలను పెంపొందించవచ్చు. కనుక కొడుకైనా, శిష్యుడైనా సరే, దండించడం మంచిది. దండించాల్సి వచ్చినప్పుడు దండించి, లాలించాల్సి వచ్చినప్పుడు లాలించాలి. తన్నేప్పుడు తన్నాలి. తల నిమిరేటప్పుడు నిమరాలి.

## స్నేహానికి ఇవి ముఖ్యం

లోకయాత్రా భయం లజ్జా దాక్షిణ్యం ధర్మశీలతా
పంచ యస్మి న్న విద్యన్తే న కుర్యాత్ తేన సంగతిమ్

**భావం:** లోక వ్యవహారం, భయం, సిగ్గు, దయ, ధర్మ గుణం- ఈ ఐదు లేని వారితో స్నేహం చేయరాదు.

## పరోపకార ఫలితం

పరోపకారః కర్తవ్యః ప్రాణైరపి ధనైరపి ।
పరోపకారం పుణ్యంచ న స్యాత్క్రతు శతైరపి ॥

**భావం:** డబ్బిచ్చి లేదా ప్రాణమిచ్చి అయినా చేసే పరోపకారం.. వంద యజ్ఞాలు చేస్తే కలిగే పుణ్యం కన్నా ఎక్కువ.

## ఎవరికి? ఎలా?

విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం పరిపీడనాయ ।
ఖలస్య సాధోః విపరీతమేతత్
జ్ఞానాయ దానయ చ రక్షణాయ ॥

**భావం:** దుర్మార్గుడికి విద్య వివాదాలకు, ధనం అహంకారానికి, బలం అపకారం చేయడానికి పనికొస్తుంది. సజ్జనులకి విద్య జ్ఞానానికి, ధనం దానానికి, బలం పరుల రక్షణకు ఉపయోగపడుతుంది.

## కల్మష హృదయం

అనిష్కల్మష చిత్తస్య
సర్వతీర్థేషు మజ్జనమ్ ।
నరస్యాఙ్గారకస్యేవ
సదా క్షీరాభిషేచనమ్ ॥

**భావం:** కల్మషం నశించని హృదయం గలవాడు సమస్త తీర్థాల్లో స్నానం చేసినా శుద్ధుడు కాడు. ఇది ఎలా అంటే, బొగ్గుని తెలుపు చేయడానికి పాలతో ఎంత కడిగినా అది ఎలా శుద్ధం కాదో అలా అతడు కూడా శుద్ధం కాలేడు.

సేకరణ : లిపి

**CHATURA** Telugu Monthly, September 2013. Regd No. HD/965/2012-2014 RNI/32186/78